కాకినాడ నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి

ఎనిమిదవ కుసుమము.

# యోగసంకలనము.



(శ్రీ అరవింద ఘోషుగారిచే రచింపఁబడిన యోగసంకలనమునకు
తెలుగుతర్జుమా.)

వాల్యూము II. భాగము II.

## జ్ఞానయోగము.

వ్యాసావళి, సంపూర్ణమహాభారతము, శ్రీకృష్ణావతారము, వసుంధర,
విహారలీల, మొదలగు పదినాటకములు వ్రాసిన

మధ్వశ్రీ దాల్తాబాదా గోపాలకృష్ణారావు B. A., గారిచే
నాంధ్రీకరింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు.

కాకినాడ:
రంగా అండ్ కో., వారిచే ముద్రింపఁబడియెను.

1934.



[వెల రు 1-0-0.

# నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి.



## రాజపోషకులు.

1 మ॥రా॥రా॥ యన్. బలరామమూర్తినాయుడుగారు,
బి.ఏ., బి.ఎల్., చెన్నపట్టణము.

2 ,, వారణాసి సీతారామయ్యగారు, బి.ఏ.,
సబ్ మేజస్ట్రేటు, గన్నవరం.

3 ,, శీలంశెట్టి వెంకటరత్నంనాయుడుగారు, డి. పి. డబ్లి
యూ అసిస్టాంటుఇంజనీరు, పెన్షనర్ లింగారెడ్డిపాలెం.

4 ,, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారు,
చెన్నపట్నం.

## పోషకులు

5 ,, పైండా శ్రీరామకృష్ణయ్య బ్రదర్సు,
జమీందార్లు, కాకినాడ.

6 ,, వారణాసి బాపయ్యగారు, బి. ఏ., క్యాషియరు,
డి. కో. బ్యాంకి, చెన్నపట్నం.

7 ,, అంగర వెంకటసుబ్బారావుపంతులుగారు,
రామచంద్రపురం.

8 ,, మాజేటి సూరెయ్యగారు, బి.ఏ., బి.యల్.,
రాజమండ్రి.

9 ,, ముత్తా సత్యప్రసన్నం బ్రదర్సు, బ్యాంకర్సు,
కాకినాడ.

10 ,, దేవులపల్లి విశ్వనాధంగారు, ఆకిరిపల్లి.

11 ,, ధూళిపాళ్ల వెంకటరత్నంగారు, గ్రామమునసబు,
పురుషోత్తమపట్నం.

12 ,, దర్భా వెంకటశివరామరావ్, బి.ఏ., బి.యల్., కాకినాడ.

13 ,, చెలికాని రామస్వామిబాబుగారు, అసిస్టెంటు యింజనీరు, సామర్లకోట.

14 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు, ప్లీడరు, కాకినాడ.

15 ,, కొత్త వెంకటరత్నంగారు, యానాం.

16 ,, దసిగె వెంకటేశ్వరావుగారు, గుడివాడ.

17 ,, కె. వి. రమణారావుగారు Representative Confectionery Dept. Parry & Co., Ltd., Madras.

18 ,, జమ్మి వెంకటసుబ్బారావుపంతులుగారు, Tq Office, Cocanada.

19 ,, పైండా సూర్యనారాయణమూర్తిగారు, జమీందారు, బ్యాంకర్సు, కాకినాడ.

20 ,, యం. వి. రాజరత్నంగారు, బి. ఏ., కాకినాడ.

21 ,, శ్రీ ఇల్లెళ్ల తిరుమలవెంకటలక్ష్మిబాయమ్మగారు, Guardian, Minor, Zamindar of Vilasa, Jalamudi etc., Perur.

22 ,, ధరణిప్రగడ బాపిరాజుగారు, కాకినాడ.

23 ,, Nandagiri V. Ramadas Pantulu garu.

24 ,, దామోజిపురపు నరసింహారావుపంతులుగారు, తాడేపల్లిగూడెం.

25 ,, పోలూరి వెంకటప్పయ్యపంతులుగారు, తాణేదారు, రేపూడి యెస్టేటు.

26 ,, పులుపుల సత్యనారాయణగారు, నర్సారావుపేట.

27 ,, శ్రీరాజా సురభి మురళీకృష్ణరావు బహద్దర్, జమీందారుగారు, మెడ్రాసు.

28 ,, శ్రీవైశ్యబాలమిత్రగ్రంథాలయం, నర్సారావుపేట.

29 ,, వెలమూరి కుటుంబరావుగారు, అవనిగడ్డ.




## 27 అధ్యాయము.

## బ్రహ్మాండజ్ఞానము. (పురుషుఁడు)



క్రియాబ్రహ్మమును దెలుసుకొని వానితో నైక్యమొందుట యనఁగాఁ బూర్తిగనో యసంపూర్తిగనో యైక్యానుసారము, వ్యష్టి జ్ఞానమును బ్రహ్మాండజ్ఞానముగా మార్చుటే. సాధారణ మనుష్య స్థితి వ్యష్టిజ్ఞానము మాత్రమేగాక నేనను నహంకారజ్ఞానమై యున్నది. జీవాత్మ (Individual soul) సర్వసాధారణకార్యవిధానమందైన మనఃప్రాణస్థూలానుభవ బంధముతో నైక్యమొందుచున్నాఁడు. మనోనిర్మిత యహంకారముతో నైక్యమగుచున్నాఁడు. అనుభవములకు స్థానములైన మనఃప్రాణదేహములతో మనోనిర్మితమైన నేనను నహంకారముతోఁ గంటె నెక్కువగా నైక్యమొందుటలేదు. కారణమేమనగా వీనినిగురించి నామనస్సు, నాప్రాణము, నాదేహ మనుచున్నాఁడు. కాని యివి తాను కానని, తనసంబంధమై తనచేఁ బొందఁబడి నుపయోగింపఁబడువానిగాఁ జెప్పుచున్నాఁడు. కాని యహంకారము తాననని చెప్పుచున్నాఁడు. మనఃప్రాణదేహముల

తో నైక్యమునుండి వేరగుటవలన నహంకారమునువిడిచి మనఃప్రాణ దేహము లెవనికి నిజముగాఁ జెందియున్నవో యట్టిజీవాత్మయొక్క జ్ఞాన మొందుచున్నాఁడు. ఈజీవాత్మస్థానమునుండి, దేనికి జీవాత్మ ప్రతినిధియు, వ్యక్తిస్వరూపముగుచున్నదో దానివైపునకుఁ జూచుచు, నిత్యసత్యముయొక్క మూఁడుస్థితులైన శుద్ధాత్మ, పరిపూర్ణస్థితి, పరిపూర్ణస్థితిశూన్యముయొక్క యతీతజ్ఞానమును దిరిగి పొందుచున్నాఁడు. కాని బ్రహ్మాండస్వభావ వ్యవహారమునకు నీయతీతస్థితికిని మధ్య, బ్రహ్మాండస్వభావమెవనికి వశవర్తియై యున్నదో, యతీతస్థితికి నెవ్వఁడు బ్రహ్మాండాత్మయైయున్నాఁడో యట్టి బ్రహ్మాండజ్ఞానమనునది కలదు. దీనినే బ్రహ్మాండపురుషుఁడందురు. బ్రహ్మాండస్వభావ మతని ప్రకృతిలేక పనిచేయు జ్ఞానశక్తియందురు. అహంకారకుడ్యములఁ బగులఁగొట్టి యద్వితీయునందు సమస్తస్థితులతో నైక్యమొందుటచేనైనను, లేక శుద్ధాత్మ బహిర్గతమందెట్లు సర్వవ్యాపకవ్యక్తి సర్వసృష్టిశక్తి దనలోఁ గలిగియున్నదో పైనుండి తెలుసుకొనుటచేనైనను మన మీబ్రహ్మాండపురుషునిఁ బొందఁగలము.

సమస్తమందున్న తనిశ్శబ్దాత్మయున్నదనెడు బునాదిపై నీ బ్రహ్మాండపురుషుఁడు మానసముచే నిర్మింపఁబడుచున్నాఁడు. ఆ యున్నత నిశ్శబ్దాత్మ సర్వవ్యాపకుఁడు. శుద్ధసాక్షి. అతఁడు సమస్త ప్రపంచవ్యాపారమును బ్రహ్మాండముయొక్క జ్ఞానజీవునిగాఁ దలచుచున్నాఁడు. ఎవని యానందముకొఱకుఁ ప్రకృతి తనపనుల నిత్య మహోత్సవమును జరుపుచున్నదో యట్టి సచ్చిదానందముగాఁ దలచుచున్నాఁడు. అవిచ్ఛిన్నమగు నానందము, పరిపూర్ణశుద్ధస్థితి, యనంతశక్తిలో సమస్తవస్తువులతో వస్తువిభాగములచే భాగింపఁబడక

బ్రహ్మాండావిర్భావమునకు సంబంధించిన పోరాటమునకంటెను, సం
తరమున సమస్తమై యన్నిటికన్న నుత్తమమై యున్నదని యెఱుంగు
దుము. దానివల్ల నీసమస్తమున్నది. ఈసమస్తమువల్ల నది యుండు
టలేదు. కాలస్థలమునకది యాధారమైయున్నది. వానిచే బంధింపఁ
బడదు. ఈపైనఁజెప్పఁబడిన పునాది దైవమున్నాఁడను నమ్మకము
పై మనలో బ్రహ్మాండమును వశముచేసుకొనుటకు శక్తి నిచ్చుచున్న
ది. మనము నివసించియున్నదానిచే నిక బంధింపఁబడము. ఈశ్వరుని
వలెనే మనము నివసించుటకంగీకరించిన నీసమస్తమును వ్యవహారము
కొఱకు మనలోఁ గలిగియుండుము. మనము మనస్సు ప్రాణము
శరీరము కాము. సమస్తమును భరించి పోషించుశక్తి సమస్తమును
వశము చేసుకొన్నట్టి, నిత్యజీవుఁడే మనము. ఈజీవుఁడు సమస్త ప్రా
ణ మాన దేహముల నిర్మించుచు భరించుచుఁ బోషించుచు నెచ్చ
టబట్టిన నచ్చట నున్నవాఁడని తెలుసుకొందుము. ప్రత్యేకించి
మనలో వేరుగా నున్నాఁడనుతలంపు విడుతుము. వానియందు సమ
స్తము జరుగుచున్నది. పనిచేయుచున్నది. ఈసమస్తమందతఁడు మూ
ర్పులేక స్థిరముగా నున్నాఁడు. ఇట్టి జీవునిపొంది మన నిత్యస్వకీయ
స్థితిని వాని నిత్యజ్ఞానానందములయందు స్థిమితముతో నుంచుకొనఁ
గలము.

తరువాత నీనిశ్శబ్దాత్మ బ్రహ్మాండస్వభావకార్యమునకుఁ బ్ర
భువని మనము తెలుసుకొనవలెను. ఆస్వకీయాత్మస్థితే తన నిత్య
జ్ఞానముయొక్క సృష్టిశక్తియందు వెల్లడగుచున్నదని తెలుసుకొనవ
లెను. ఈసమస్తకార్య మతనిశక్తి జ్ఞానానందములే. అతని యనంతస్థితి
యందతని నిత్యవివేకచిత్తానుగుణ్యములైన పనులఁజేయుటకు బహిర్గ
తమగుచున్నవి. సమస్తమునకు నిత్యాత్మయైన యీశ్వరుని స్వభావము

మొదటఁ గ్రియానిష్క్రియలకు, జ్ఞానాజ్ఞానములకు, సుఖదుఃఖములకు మంచిచెడులకు, పూర్ణాపూర్ణములకు, శక్తిరూపములకు, సమస్తస్వభావ బహిర్గతాంతఃప్రవేశములకు, మూలమని తెలుసుకొనుచున్నాము. తరువాత శక్తిజ్ఞానములందతఁడే బహిర్గతమగుచున్నాఁడని గ్రహించుచున్నాము. కారణమేమనగా శక్తిజ్ఞానములు సహితమతఁడే. వానిపనులకు మూలమగుటేగాక, సమస్తస్థితులందొక్కఁడై యుండి, వానిపనులఁ జేయువాఁడును, సృజించువాఁడతఁడేనని తెలుసుకొనుచున్నాము. బ్రహ్మాండావిర్భావమందుండు బహుజీవులీశ్వరుని ముఖములే. వివిధ మనఃప్రాణదేహములతని పైవేషములే. ప్రతిజీవుఁడు బహుముఖములతోఁ గనుపించుచున్న సర్వవ్యాపక నారాయణుఁడని చూచుచున్నాము. అట్టి నారాయణునియందు మన మైక్యమవుచున్నాము. అప్పుడు మన మానసప్రాణదేహము లాత్మయొక్క ప్రదర్శనమని భావించఁగలము. మనకంటె వేరనుకొన్న వారందఱు మనకిప్పుడు వివిధ మనఃప్రాణశరీరములందున్న మనయాత్మగా దోఁచఁబడును. ప్రపంచమందుండు సమస్త వస్తురూపవిషయభావశక్తులీ యాత్మావిర్భావమందు తరగతులే యవుచున్నవి. తన నిత్యస్వకీయ రూపధారణమందీశ్వరుని విలువలవుచున్నవి. వస్తువులయందు భూతములందిట్టి దృష్టికలుగుటచే విభాగమొందిన యతని భాగములేయని మొదట తెలుసుకొందుము. కాని యీగుణస్థల విభాగభావమును విడిచి పైకిపోవకున్న జ్ఞానానుభవములు పూర్తికానేరవు. సర్వమందనంతునిఁ జూడకున్న జ్ఞానము పూర్తికాదు. ఈబ్రహ్మాండము దీనియందు సమస్తవస్తువులతని సచ్చిదానందమందువలెనే యది నిర్మించురూపము మనకెంత యస్థిరపూర్ణావిర్భావమని తోఁచినను పరిపూర్ణాఖండేశ్వరుఁడని తెలుసుకొనక జ్ఞానము సంపూర్తికానేరదు. ఈశ్వరుని శబ్దాతీతద్రష్టగాను, క్రియాప్రభువుగాను, సర్వంభరుఁడు

గా నీమూఁడింటియం దభేదభావముతో మనము పొందఁగలము. సర్వవ్యాపకాత్మ సత్యములయొక్క సమస్తము నాలింగన మొనర్తు ము. అప్పుడు మనకు బ్రహ్మాండజ్ఞానమనఁబడు బ్రహ్మాండపురుషుఁడు వ్యక్తమవును.

మనముపొందిన యీబ్రహ్మాండజ్ఞానమునకును మన వ్యష్టిస్థి తికిని సంబంధమేమి? మనకింకను మానస్సు, శరీరము, మానుషజీవిత ము కలవు. మన ప్రత్యేక వ్యష్టిజ్ఞాన మతిక్రమింపఁబడినను మన వ్యష్టిస్థితి యింక నిలిచియున్నది. మనము బ్రహ్మాండజ్ఞానము కాకుం డనే దానిని దెలుసుకొనవచ్చును. జీవాత్మతో దానినిజూడవచ్చును. దానితోఁ గలసిపోకుండనే యైక్యము కావచ్చును. అనగా జీవాత్మ యొక్క ప్రత్యేకత్వమునిలిపి వాని సంబంధముల మన మనుభవింప వచ్చును. మనము వ్యష్టిరూపముగానే నిలిచియుండి సర్వవ్యాపకా త్మయొక్క యనంతత్వానందములఁ బాలుగొనవచ్చును. లేక నా రెంటిని ఘనాత్మ స్వల్పాత్మలని పొందవచ్చును. ఘనాత్మ దివ్యజ్ఞా నశక్తులయొక్క విలాసమందు స్వల్పముగాఁ బ్రవహించును. రెండ వది మనఃప్రాణదేహరూపక వ్యష్టికార్యములకొఱకు జీవరూపము నుఁ జీవవ్యష్టిద్వారమున నాసర్వవ్యాపకుని కార్యమగుచున్నది. [illegible] యోగమునకు శిఖరమేమనగా సర్వవ్యాపకునియందు వ్యష్టిమూర్తి ని కల్పివేయుటే బ్రహ్మాండజ్ఞానమందు వ్యష్టిమూర్తిని ముంచివే యుటే. ఆత్మయొక్క సర్వవ్యాపకత్వాద్వితీయత్వమందు జీవాకార మునుసహితము భంగముచేయుటే. జ్ఞానయోగము కాంక్షించునది లయమే. ఈమోక్షమే. దీనిని శిష్టాచారమందున్న యోగమునకు వలెనే (Traditional Yoga) మనఃప్రాణదేహములు నిశ్చలబ్రహ్మ మందు లయముచేయుట యనవచ్చును. కానిముక్తికి ముఖ్యము

వ్యష్టిజీవుఁ డనంతమందు లీనగుమటే. మనసుచే బంధింపఁబడి దేహమందుండెడు జ్ఞానమే తానను భావము యోగికిలేనప్పుడు భిన్నత్వముయొక్క వ్యక్తి యనంతజ్ఞానమందు నశించగా యోగి ప్రారంభించినపని పూర్తియైనది. తరువాత మానుషజీవిత ముంచుకొనుట యుంచుకొనకుండుట యంత ముఖ్యమైన విషయముకాదు. ఏలననగా మనఃప్రాణస్థూలముల బహురూపములలోఁ బనిచేయువాఁడు సదా రూపములేని యద్వితీయుఁడై యున్నాఁడు. ప్రతిజీవుఁడాయద్వితీయుఁడు తన నాటకమాడుటకుఁ గనిపెట్టుటకు నెన్నుకోబడిన స్థానమగాచున్నాఁడు.

బ్రహ్మాండజ్ఞానమందు మనము దేనితో లీనమగాచున్నామో యది సచ్చిదానందము. మనమప్పుడు నిత్యమగు నద్వితీయస్థితియై యుందుము. ఇతరులలో మనలో తనకార్యములఁ జూడఁగలిగిన నద్వితీయ నిత్యజ్ఞానమై యుందుము. తనయొక్క తనకార్యములయొక్క సంతసముగల యద్వితీయ నిత్యానందమై యుందుము. స్వతసిద్ధముగా స్థిరమై, మార్పులేనిదై, కాలస్థలశూన్యమై, యుత్తమమై, తన యనంతకార్యములందు స్థిమితముకలదై, వాని మార్పులచే మార్పుజెందనిదై వానిబహుళత్వముచే విభాగింపఁబడనిదై, కాలస్థల మహాసముద్రమందు పోటుపాటులకు వృద్ధి నశింపులు లేనిదై, పైకి కనుపించువాని విరోధములకు దైవేచ్ఛకుసంబంధించి, బంధములకుఁ జిక్కనిదై యుందుము. సచ్చిదానందమనగా నావిర్భవించిన వస్తుబహుముఖత్వముల యేకత్వము. అవస్తుభేదవిరోధములయొక్క యనంత సమరసత్వము. వానిహద్దుల నంగీకరింపఁజేయు ననంత పరిపూర్ణత్వము. వాని యసంపూర్తులకు గమ్యస్థానము.

ఇట్టి బ్రహ్మాండజ్ఞానమందు నివసించుటచేత మన సమస్తానుభవము, ప్రపంచమందున్న ప్రతివస్తువునకుఁగల విలువ, పూర్తిగా

మారిపోవుచున్నదనుట నిజము. సాధారణముగా వ్యష్టి యహంకారపురుషులమై యజ్ఞానమందు నివసించి స్వల్పభిన్నజ్ఞానముతో సర్వము విమర్శించుచున్నాము. హద్దుల మధ్యస్థమైన జ్ఞానశక్తిజనిత సామర్థ్యానుసారముగ ప్రతిదాని ననుభవించుచున్నాము. కాబట్టి బ్రహ్మానందానుభవభాగమున కెద్దానికైన నిజమైనవిలువ నివ్వఁజాలకున్నాము. హద్దు, బలహీనత, యసమర్థత, దుఃఖము, బాధ, పోరు, వీని విరుద్ధగుణముల నిత్యాద్వైతభావమందు విరుద్ధగుణములుగానే యనుభవించుచున్నాము. మంచిసుఖముయొక్క నిత్యానంతత్వమును దనుభవించుటలేదు. శకలానుభవములతో జీవించుచున్నాము. ప్రతి వస్తువును మొత్తమును శకలములైనవిలువలిచ్చి విమర్శించుచున్నాము. సంపూర్ణవిలువలకై ప్రయత్నించినపుడు దివ్యకార్య సంఘాతముగొఱకుఁ బనిచేయుటకై కించిద్వస్తుభాగమునే ప్రచురముచేయుచున్నాము. మనభాగములు పరిపూర్ణములని నమ్మకము పుట్టింతుము. స్వల్పమైన మనకించిత్జ్ఞత్వమే యీశ్వరదృష్టి బహుళజ్ఞత్వమని వాదింతుము.

బ్రహ్మాండజ్ఞానమందుఁ బ్రవేశించుటచే మన మానస్వదృష్టి యందుఁ బాలుగొందుము. సమస్తవస్తువుల ననంతాద్వితీయుని విలువలయందుఁ జూతుము. అజ్ఞానము, హద్దుసహితము వేరర్థములఁ బొందుచున్నవి. అజ్ఞానము దివ్యజ్ఞానముయొక్క ప్రత్యేకకార్యముగాఁ బరిణమించుచున్నది. బలము, బలహీనత, యసమర్థతలు దివ్యశక్తి సంకోచవికాసములుగా మారుచున్నవి. సుఖదుఃఖములు దివ్యానందవశీకరణ వివశీకరణములుగా మారుచున్నవి. పోరాట దివ్యసమరస్వమందు విలువల శక్తుల సరిచేయుటగా మారుచున్నది. మనము మనఃప్రాణదేహబంధములచే బాధింపఁబడము. కారణమేమ

నగా మనము వానియందు నివసించుటలేదు. ఆత్మయొక్క యనంతత్వమందే నివసించుచున్నాము. ఆవిర్భావమందు వానికి సరియైన విలువలు ప్రయోజనములు స్థానములిత్తుము. మనకుతో బ్రహ్మాండమందావిర్భవించుచున్న సచ్చిదానందముయొక్క యుత్తమస్థితి జ్ఞానశక్తి యానందసోపానములుగాఁ జూతుము. మనుష్యుల వస్తువుల వాని పై యాకారములఁబట్టి విమర్శించుట మానెదము. విరుద్ధభావముల హృదయరాగముల విడచెదము. కారణమేమనగా మనము చూచునది జీవాత్మ. ప్రతివస్తువునందు మనము వెతికికని పెట్టుచున్న దేవుఁడు. తక్కినవి మనకంత ముఖ్యము కాదు. తమకుఁ బ్రత్యేకవిలువలులేని యాశ్వరావిర్భావములుగా సర్వమప్పుడు తోచెడు సంబంధములు. ఆ దేవిధమున నేవిషయము మనలఁ గదలింపఁజాలదు. సుఖదుఃఖములను, లాభనష్టములను భేదముపోయినది. సమస్తము దివ్యవిలువతో దివ్యప్రయోజనముతోఁ జూడఁబడుచున్నది. ఈవిధమున సంపూర్ణముక్తియు ననంతసమత్వమునొందుచున్నాము ఈపరిపూర్ణత్వమునే యుపనిషత్తిట్లు చెప్పుచున్నది. “ఎవనియందువ్యష్టి బహుస్థితులవుచున్నదో వానికి భ్రమయెక్కడిది? ఎవఁడు పరిపూర్ణముగాఁ దెలుసుకొని సమస్తవస్తువులందేకత్వమును జూచుచున్నాఁడో వానికి దుఃఖ మెందుండివచ్చును?”

బ్రహ్మాండజ్ఞానమందుఁ బరిపూర్ణత్వమున్నప్పుడే యిది యుండును. మానసపురుషునకిది కష్టసాధ్యము. ఈశ్వరభావము వ్యక్తికలుగబోవుచున్నప్పుడు మానసికత్వ మూర్ధ్వాధోస్థితులనఁబడు రెండు భాగములుగా స్థితిని విభాగింప మొదలిడును. ఒకవైపున ననంతరూపరహితాద్వితీయ శుద్ధప్రశాంతానంద విపులత్వములుగాన్పించుచుండును. రెండవవైపున నంత్యము, రూపభేదములు, బహుళత్వము

పోరాట, దుఃఖము, నిష్ప్రయోజనత్వము, ఫలశూన్యత్వము, హద్దు లలోనున్న వ్యర్థత, నిజముకాని మంచి బాధింపఁబడు వ్యాపారము గాన్పించుచుండును. ఈవిభాగము చేయువారికిఁ బరిపూర్ణముక్తియు ద్వితీయుని పరిశాంతత్వమందుగాని సంభవింపదు. విశారదశూన్య మైన యనంతుని యందుగాని లభింపదు. అతీతుని యనుభవ మే వారికి సత్యమైన స్థితి. విమోచనమొందుటకు సమస్తవిలువల నశింపుచేయవలెను. సర్వబంధముల నతిక్రమించుటేగాక నాశనము చేయవలెను. దివ్యపరిశాంతమువల్లఁ గలిగినస్వేచ్ఛ వారొందుచు న్నారు. కాని వారికి దివ్యకార్యమువలనఁ గలిగెడి స్వాతంత్ర్యములే దు. అతీతునియందుగల శాంతిని వారనుభవింపఁగలరు. కాని యతీ తుని బ్రహ్మాండాన ద మొందఁజాలరు. బ్రహ్మాండవ్యాపారమునుం డి వేరవుటపై వారి స్వాతంత్ర్యము నిలిచియున్నది. కాని బ్రహ్మాం డస్థితిని వశపరచుకొని దానిని నడుపఁజాలదు. కాని వారికి నంతర్వ ర్తియై యతీతమైనస్థితి ననుభవింప వీలుకలదు. ఇంకను భేదము గలేదు. వారొందు స్వతంత్రసుఖము సమస్తవస్తువులఁబొంది యన్నిటి తో నానందించి, పతనభయముగాని, బంధమలిన భయముగాని లేక సర్వస్థితిస్వరూపముల నొందునట్టి దివ్యజ్ఞానపరిభువుయొక్క స్వా తంత్ర్యము వారికిలేదు. ఆత్మయొక్క సర్వహక్కులనింకఁ బొందలే దు. సమస్త స్థిత్యేకత్వమునుండి వేరుగానుండుట, బంధను, నిరాక రణమింకను కలదు. మనఃప్రాణ శరీరవ్యాపారములు విజ్ఞానలోకము నుండి పరిశాంతస్థిమితములతోఁ జూడఁబడుచు నాపరిశాంతస్థిమిత ములతో నిండియుండును. కాని సర్వాధికారముగల యాత్మధర్మ మునుబొంది దానికి వశులై యుండలేదు.

విజ్ఞానలోకములనఁబడు సచ్చిదానందములలోనిలిచి మానస పురుషుఁడధోస్థితులలోనికి నానందపరికాశత్వములఁ బ్రవహింపఁజేసి

నప్పుడిది కలుఁగుచున్నది. కాని యధోస్థితులయందు నివసించియుండి బంధముల ఛేదించి యూర్ధ్వస్థితియొక్క తేజోవిపులత్వముల నవతరింపఁజేయుటచే బ్రహ్మాండజ్ఞానము నొకవిధముగాఁ బొందుటకు సహితము వీలుకలదు. ఆత్మమట్టుకే యేకమై యుండలేదు. మనః ప్రాణదేహములు సహితము లేకములే. ఓక బ్రహ్మాండమానసము కలదు. ఒక బ్రహ్మాండప్రాణమే కలదు. ఒక బ్రహ్మాండదేహమే కలదు. సర్వభూతదయాళుత్వము, సర్వభూతప్రేమ, సర్వస్థితులయందున్న జీవుని తెలుసుకొనుటకై మనుజుఁడుచేయు సర్వప్రయత్నములు నహంకారకుడ్యముల సన్నగిలఁజేసి, పగులఁగొట్టి, పడఁగొట్టి బ్రహ్మాండమేకత్వమును సమీపించుటకుఁజేయు ప్రయత్నములై యున్నవి. మనోహృదయముల మూలకమున నాత్మస్పర్శము నొందఁగలిగినయడల, నీమానుషాధోస్థితిలోఁ దివ్యమైన యీశ్వరప్రవాహమును స్వీకరించఁగలిగినయడల, ప్రేమచే, నానందముచే, సర్వభూతములతో మానసము నైక్యమొందించుటచే మనస్స్వభావమును దివ్యస్వభావముయొక్క ప్రతిబింబముగా మార్చఁగలిగినయడల మనమాగోడలఁ బగులగొట్టఁగలము. మన దేహములుసహితము ప్రత్యేకవిషయములుకావు. కావున మన స్థూలజ్ఞానముసహితము బ్రహ్మాండముయొక్కయు నితరస్థూలములయొక్కయు జ్ఞానముతో నేకత్వమొందుటకు సామర్థ్యముకలది. సమస్తదేహములతో తనదేహమేకత్వమొందినట్లు యోగి తెలుసుకొన సమర్థుఁడై యున్నాఁడు. వాని యనురాగముల నెరిగియుండుటేగాక వానియందుఁ బాలుగొన నేర్చియున్నాఁడు. సమస్తజడముయొక్క యేకత్వము సదా యనుభవించుచున్నాఁడు. తన స్థూలస్థితి యాజడముయొక్క విధానమందొక విధానమని తెలుసుకొనుచున్నాఁడు. అంతేగాక ననంతమైన ప్రాణసముద్రము తనయొక్క నిజప్రాణస్థితియని సదా తలచుట

కతనికి వీలుకలదు. తనప్రాణ మాయనంతకల్లోలములో నొక తరంగమని తెలుసుకొనటకు వీలుకలదు. ఇంతకంటె సులభముగా మానసహృదయమందున్న స్థితులతో నైక్యమొందుట కెక్కువ వీలు కలదు. వానికోరికలు పోరాటములు, సుఖదుఃఖములు, భావములు, ప్రేరేపణలు తనవని లేక యున్న తాత్మయందుఁ గలుగుచున్న మనోహృదయవ్యాపారములని తెలుసుకొనుటకంత వీలుకలదు. ఇది సహితము బ్రహ్మాండజ్ఞానమునొందుటే.






28 అధ్యాయము.

## ఏకత్వము.

మనఃప్రాణ దేహాభిమానముల విడిచినప్పుడు తన నిజతత్త్వమును గనిపెట్టినవాఁడగుచున్నాఁడు. శుద్ధనిశ్శబ్దబ్రహ్మముతోఁ దన నిజతత్త్వముయొక్క యేకత్వము మార్పులేని యక్షరబ్రహ్మమందుఁ గనిపెట్టుచున్నాఁడు. దానివలనఁ దన వ్యక్తిత్వమునువిడిచి నిర్గుణమందుఁ బ్రవేశించుచున్నాఁడు. అప్పుడు జ్ఞానమార్గముయొక్క మొదటివిధానము పూర్తియైనది. సిష్టాచారమందున్న జ్ఞానయోగమునకిదే ముఖ్యముగాఁ గావలసినది. లయమగుటకు, విశ్వస్థితినుండి తప్పించుకొనుటకు, విశ్వమునకు వెలిగానున్న యవిచ్ఛిన్న పరిపూర్ణ పరబ్రహ్మమునందు ముక్తిగాంచుటకు ముఖ్యమిదియే. ఈయంత్యముక్తికి ప్రయత్నించువానికి మార్గమందుఁ గొన్ని యితరయనుభవములు గలుగుచున్నవి. సమస్తజంతువులందావిర్భవించుచున్న పురుషుని, బ్రహ్మాండమునకుఁ బ్రభువునుఁ దెలుసుకొనవచ్చును. కాని యివియన్నియు నతని ప్రయాణములలోని వివిధతరగతులు. సోపా

నము. అవిచ్ఛిన్నగమ్యస్థానమును సమీపించినకొలది జీవుఁడొందు వికాసములే. వానినన్నిటిని గడచిపోవుటే యతని ముఖ్యోద్దేశము. కాని నిశబ్దస్థిమిత స్వాతంత్ర్యములఁ బొందినప్పుడు బ్రహ్మాండజ్ఞానమువలన నిష్క్రియాబ్రహ్మమునే గాక క్రియాబ్రహ్మమును సహితము పొందెదము. ప్రమాదములేకనే దానియందు దివ్యస్వాతంత్ర్యముతోను శాంతితోను నివసింతుము. నివసించుటేగాక నందు విశ్రమింతుము. అప్పుడుజ్ఞానమార్గముయొక్క రెండవవిధానము పూర్తి కాఁబడినది. దానివలన ముక్తుఁడైనజీవున కాత్మజ్ఞాన పరిపూర్ణత్వము ప్రాప్తించును.

ఆవిధముగా జీవుఁడావిర్భవించిన సకలలోకస్థితులలో సచ్చిదానందైక్యమును బొందుచున్నాఁడు. ఇది పరిపూర్ణజ్ఞానమునకు లక్షణము. అది సచ్చిదానందునియందు సర్వమును నైక్యమొందించుచున్నది. కారణమేమనగాఁ బురుషుఁడు తనలోఁ దానొక్కఁడగుటే గాక సర్వమందుసహిత మొక్కఁడే. ఏకత్వమందెట్లొక్కఁడై యుండెనో వివిధాకారములందట్లే యొక్కఁడై బహుళత్వమందొక్కఁడై సమస్తస్థితులరీతుల నొక్కఁడై యున్నాఁడు. ఆచారమందున్న జ్ఞానము సిద్ధాంతమున కీతత్వము నొప్పుకొన్నను, సమస్తమందీయేకత్వము లేదనియు నన్నిటియందు సమానముగా గ్రహింపఁబడదనియు వితర్కించుచున్నది. ఆవిర్భావశూన్యమైన పరిపూర్ణమందు దానిని గనిపెట్టుచున్నది. ఆవిర్భావమందంతగా దానిని యది కనిపెట్టుటలేదు. సగుణమందుకంటె నిర్గుణమందు మిక్కిలి స్వచ్ఛమైనదానిగాఁ గనిపెట్టుచున్నది. నిశబ్ద నిష్క్రియాబ్రహ్మమందుఁ దోఁచినంత స్పష్టతరముగా క్రియాబ్రహ్మమందుఁ దోఁచుటలేదని వితర్కించి, పరిపూర్ణముయొక్క రూపాంతరములైన సగుణబ్రహ్మము నిష్క్రియా

హ్మములనుపదములు ముఖ్యములనిభావించి తద్విరుద్ధముల జ్ఞానము న కనవసరమని నిరాకరించుచున్నది. కాని పరిపూర్ణజ్ఞాన మట్టిభేదమును కల్పించుటలేదు. దాని యేకత్వదృష్టియందు మరియొకవిధమైన పరిపూర్ణత్వము దోచుచున్నది. ఆవిర్భవించినదానియందు నావిర్భవించనిదానియందు సగుణమందు నిర్గుణమందు మూర్తియందు మూర్తిరాహిత్యమందు సర్వవ్యాపక నిశ్శబ్దానంతాగాధమందు సర్వవ్యాపక క్రియావిపులత్వమందు నాయేకత్వమునే కనిపెట్టుచున్నది. పురుషప్రకృతులయందా పరిపూర్ణయేకత్వమునే కనుగొనుచున్నది. దివ్యస్థితియందును, దివ్యశక్తిజ్ఞానసంబంధములైన కర్మలందును, యద్వితీయపురుషుని నిత్యావిర్భావగుణములందును, యనంతపురుషుల యెడతెగని యావిర్భావమందును, బహువిధమైన తన యేకత్వమును సత్యముగా, తనయెదుటసత్యముగా, నిలుపుకోగల యచ్ఛిన్నసచ్చిదానందైక్యమందు నాయేకత్వమునే గాంచుచున్నది. మనఃప్రాణదేహ బహిరంగవిభాగములందుసహితము తన బహుముఖమైన యేకత్వమును నిలుపుకోగల యాయేకత్వమునే గాంచుచున్నది. సమస్తైక్యము దానికి దివ్యపురుషుని తీవ్రశుద్ధానంతానుభవమే. సమస్తభేదము నిత్యపురుషుని హద్దులేని విశేషానుభవమే.

పూర్తిగా నేకత్వమును దెలుసుకొనుటే పరిపూర్ణజ్ఞానమునకు యోగమునకు సారము. సచ్చిదానందము తనలోఁ దానొక్కటే యనియుఁ దనయావిర్భావములందొక్కటే యనియుఁ దెలుసుకొనుటే జ్ఞానమునకుమూలము. స్థితియందునుగ్రియయందును వ్యక్తికియా యేకత్వమును బ్రత్యక్షమొనర్చుట, పురుషునితో సమస్తభూతములతో నైక్యభావమందుఁ బ్రత్యేకవ్యష్టి వ్యక్తినిలీనముచేయుటచే నాయేకత్వమేయగుట జ్ఞానయోగమందు దాని సంసిద్ధియైయున్నది.

ఈయైక్యభావముతో జీవించుట, యోచించుట, యనుభవించుట, పనిచేయుట, యుచ్చరించుట వ్యష్టిపురుషునందు వ్యష్టిజీవితమందు దాని ఫలితార్థము. ఈయేకత్వానుభవమే భిన్నమందీయేకత్వాభ్యాసమే యీసమస్తయోగము.

ఏస్థితియందేలోకస్థితియందు సచ్చిదానందుఁడుతనలోఁ తానొక్కఁడే. కాబట్టి జ్ఞానశక్తిస్థితి సంసిద్ధికొఱకుఁగాని, జ్ఞానచిత్తానందసంసిద్ధికొఱకుగాని మూలమా సచ్చిదానందమునే యేర్పఱచవలెను. అతీతమైన పరిపూర్ణజ్ఞానమందును, యావిర్భవించిన పరిపూర్ణమందును మనము నివసించవలసియున్నది. నిర్గుణుఁడై యావిర్భావమందిన సగుణత్వమందును, గుణశూన్యుఁడై సమస్తగుణభరితుఁడైన వాని యందును, నిశ్శబ్దమై యవనియందు నిశ్శబ్దము ఘటించునో వాని యందును, దివ్యశాంతస్థితమను లెనని యనంతానందక్రియలందు గలిగియున్నవో వానియందు నివసించవలెను. పురుషుఁడే యతఁడు సమస్తము తెలుసుకొని, యొప్పుకొని యనుజ్ఞయిచ్చి, పరిపాలించుచు సమస్తమును తనలోఁ గలిగి, భరించి, వెల్లడిచేయుచున్నాఁడనియు తత్కాలమందే ప్రకృతియై జ్ఞానచిత్తనిర్మాణములఁ గలిగించుచున్నాఁడనియు మనము తెలుసుకొనవలసియున్నది. అద్వితీయుఁడై తనలో నిమిడియుండి సమస్తస్థితులయందుఁ బ్రదర్శింపఁబడు వాఁడనియు, నద్వితీయజ్ఞానమై తనస్థితియొక్క యైక్యమందే శాగ్రినొంది సర్వవ్యాపకస్వభావముగాఁ బరిణమించి బహుభూతములందే కాగ్రతనొందువాఁడనియు, నద్వితీయశక్తియై, స్థితియందు గనీభవించిన స్వకీయవ్యక్తిస్థితములఁ గలిగి, బహిర్గతవ్యక్తక్రియలంగాఁ బ్రబలశక్తి కలవాఁడనియు, నద్వితీయానందమై, తన నిరాకారయనంతమునొక్క యానందవ్యక్తి కలిగి, సమస్తయాకారసూపశక్తులు తనవేనను

యానందవ్యక్తితో నున్నవాఁడనియు, నద్వితీయసృష్టిజ్ఞానము పరిపాలించు చిత్తము, యూర్ధ్వమానసము, మనోదేహప్రాణములకు నియామకుఁడు, పుట్టించువాఁడనియు, సమస్తమనోభూతములు తన లోనుండ నద్వితీయమానసమై, వాని మనోవ్యాపారములనన్నిటిని కలిగించువాఁడనియు, సమస్తభూతములందుఁ బనిచేయుచున్న యద్వితీయప్రాణమై, వారి ప్రాణవ్యాపారములఁ బుట్టించువాఁడనియుఁ బ్రత్యక్షమున కాకారమొంది మనఃప్రాణవ్యాపారమునకు స్థానమై, సకలవస్తురూపములనిర్మించు నద్వితీయ పదార్థమైనవాఁడనియు మనము చూడవలసియున్నది. ఈయేకును సచ్చిదానందుని యావిర్భావ విశేషములు.

పరిపూర్ణజ్ఞానయోగభావ మీయావిర్భావముయొక్క ద్వంద స్వభావమును దెలుసుకొనవలసియున్నది. సచ్చిదానందున కుత్తమస్వభావము కలదు. దానియందతఁడు తెలియఁబడుచున్నాఁడు. ఆసచ్చిదానందునకే మానసప్రాణదేహసంబంధమైన హీనస్వభావముకూడ కలదు. దానియందతఁడు మరుగుపడుచున్నాఁడు. ఈరెంటిని సమన్వయముచేసి యేకత్వానుభవప్రకాశము కలిగియుండవలెను. వానిని వేరువేరుగా నుంచరాదు. అంతరమున దివ్యజీవితము బహిర్ముఖముగ మన భౌతికజీవితమందు మానసికస్థూలజీవితమని జీవితము రెండు విధములనుండరాదు. ఉత్తమసత్యముయొక్క శక్తి ప్రకాశానందములతో నీహీనజీవితమును బునర్నిర్మాణ మొనరించవలెను. జడమునింద్రియజ్ఞానముచే నిర్మింపఁబడిన యాత్మయొక్కయచ్చుకట్టుగా మనము తెలుసుకొనవలెను. భౌతికయుత్తమస్థితులందు సచ్చిదానందుని తేజోవక్ష యానందావిర్భావమున కేర్పడిన యుపాధియని తెలుసుకొనవలెను. ప్రాణమంత దివ్యశక్తి ప్రవహించుకాలువగా గ్రహించ

వలెను. ఇంద్రియనిర్మితమైనట్టియు మనోనిర్మితమైనట్టియు దూరవు
ను భిన్నత్వము నభ్యంతరమును భేదించవలెను. అప్పుడాదివ్యశక్తి
మీన సమస్త ప్రాణవ్యాపారముల వశముజేసుకొని, నియమించి,
మార్చఁగలదు. అట్లు మార్పుజెందినప్రాణము మనోదేహముల కా
ధారమైన యిప్పటి కించిత్ప్రాణశక్తిగానుండక సచ్చిదానందుని స
ర్వానందదాయకజ్ఞానశక్తి రూపము వహించుచున్నది. తద్విధమున
హృదయరాగమానసముల సహితము దివ్యప్రేమగా సర్వవ్యాపకా
నందవిలాసముగా మార్చవలెను. తెలుసుకొన బ్రయత్నించుచున్న
మన తెలివిని, చిత్తమును, దివ్యజ్ఞానచిత్తముయొక్క తేజముతో
నింపి యామహోన్నతోత్తమ వ్యాపారరూపముగా మార్చవలెను.

సత్యమానసమును (Truth-mind) మేలుకొలుపనిదే యీ
మార్పు పరిపూర్ణమొందఁజాలదు. మనోమయ పురుషునందుండు
యూర్ధ్వమానసమే (Super-mind) యీసత్యమానస మనవచ్చు
ను. మార్పుయొక్క ప్రకాశమును మానసముగా స్వీకరించుటకిది
సామర్థ్యమిచ్చుచున్నది. ఈమధ్యవర్తియైనశక్తిపుట్టనియెడల జడాత్మల
కుగల భేదముచే నుత్తమాధమములు వేరువేరుగానే యుండును. ఆవే
శమువల్లగలిగెడు నిద్రయందుత్తమస్థితిలోనికి హీనస్థితి యెత్తబడిసం
బంధము కలిగియున్నను హీనస్థితి పూర్తిగామారదు. జడములందు
జడరూపములందున్నయాత్మ, హృదయరాగములందున్న దివ్యానం
దము, సర్వప్రాణవ్యాపారముల కాధారమైన దివ్యశక్తి, హృదయ
మానసమున కసంపూర్తిగా నింద్రియమానసమున కింద్రియవ్యక్తి
గా మేధోమానసమునకు భావముగాఁ దోచవచ్చును. కాని యధో
స్థితి తనకు నైజమైన హద్దులనింక కలిగియుండి పైప్రవాహమును
తన కార్యానుసారముగా భిన్నత్వమొందించును. తన స్వభావాను

సారముగా మార్పు చెందించును. పైప్రవాహము మహోన్నత విపులత్వ తీవ్రతలనొందినను బనిజరుగునప్పు డక్రమమునే పొందుచున్నవి. ప్రశాంతస్థిమితమందు మాత్రము పూర్తిగా దెలియఁబడుచున్నది. పైప్రవాహము మనలోనుండి తొలగినప్పుడు మనమవ్యక్తములోఁ బడిపోదుము. సాధారణమైన జీవితమునకు సంబంధించిన యొత్తిడిచే మనమప్పుడు దానిని మరచిపోదుము. బహిరంగవ్యాపారమందు ద్వంద్వముల ముట్టడియందు మనకు మరుపురాఁగలదు. మనము దైవముతో నేకాంతమందున్నప్పుడే దానిని పూర్తిగాఁ బొందుదుము. మన మానసత్త్వము హద్దులలోఁ బనిచేయునదై శకలవస్తుజ్ఞానముకలిగినదై, స్థిమితములేక బహుమార్పులఁ జెందునట్టిది. తన వ్యాపారమును దగ్గించుకొన్నఁగాని నిలకడ పొందనేరదు. శాంతి నొందినఁగాని నిశ్చలత్వమొందనేరదు.

కాని యీయూర్ధ్వమానసమునుండి సత్యమైనభావములు సరాసరి కలుగుచున్నవి. తెలుసుకొనుచిత్తమదే. పనిచేయు జ్ఞానముదే. ఆయూర్ధ్వమానస మనంతమునుండి విశ్వక్రమమును సృజించుచున్నది. దానిమెలుకవతో నెడతెగని స్వర్గవర్ష ధారాపాతము కలుగుచున్నదని వేదము చెప్పుచున్నది. తేజోశక్త్యానంద సముద్రమునుండి సప్తనదులు పూర్తిగాఁ బ్రవహించునని వేదము చెప్పుచున్నది. అది సచ్చిదానందమును వెల్లడిచేయుచున్నది. మన మానసముయొక్క భిన్నభావములకు వెనుకనున్న సత్యమును వెల్లడించుచున్నది. అంతర్వర్తియైన సత్యముతో నైక్యమందా ప్రతిభిన్నాభిప్రాయమునకు సరియైన స్థానము నిచ్చుచున్నది. ఆవిధమున మనమానసికయర్ధప్రకాశత్వము నొకవిధమైన ప్రకాశరాశిగా మార్చఁగలదు. మన మానసచిత్తముయొక్కయు, హృదయకాంక్షలయొక్కయు, ప్రాణప్రయత్నములయొక్కయు, నసంపూర్తిప్రయాసలకు వెనుక

నున్నచిత్తమును వెల్లడించుచున్నది. వెనుకనున్న చిత్తప్రకాశమందు ప్రతిదానిని దాని స్థానములోనుండునట్లు చేయుచున్నది. ఆవిధమీన మన ప్రాణమానసముయొక్క యర్థవ్యక్తమైన జీవితమందలి పోరాటము నొకవిధమైన క్రమమునావహించిన శక్తిరాశిగా మార్చుచున్నది. మన హృదయరాగములు దేనికొఱకుఁ బ్రయత్నించుచున్నవో, దేనిని యసంపూర్తిగా గ్రహించి తుష్టి యసంతుష్టి, సుఖదుఃఖము నొందుచున్నవో, యట్టి యానందమును వెల్లడించుచున్నది. వెనుకనున్న విశ్వానందైకత్వమందుఁ బ్రతిదానిని దానిస్థానమునకుఁ జేర్చుచున్నది. ఆవిధమున మన ద్వందరాగభావ కల్లోలమును బలమైన ప్రేమానందస్థిమితముయొక్క రాశిగా మార్చుచున్నది. విశ్వకార్యమును వెల్లడించుచు, దేనినుండి తన ప్రతివ్యాపారము పుట్టుచున్నదో, దేనికై ప్రతిది వృద్ధిపొందుచున్నదో యట్టి సత్యస్థితిని కనుపరుచుచున్నది. ప్రతిదానికినుండు సంసిద్ధియొక్క శక్తిని, దేనికొఱకు దేనినుండి ప్రతివిషయముపుట్టుచున్నదో యాయానందమును వెల్లడిచేయుచున్నది. అది సచ్చిదానందుని స్థితి జ్ఞానశక్త్యానందములతో సమస్తమును గలుపుచున్నది. ఆవిధమున సమస్తభిన్న విరుద్ధ వివిధస్థితుల సమన్వయమొనరించి వానియందనంతాద్వితీయునిఁ జూపుచున్నది. ఈ యూర్ధ్వమానసప్రకాశములోనికి లేవనెత్తఁబడి సుఖదుఃఖములద్వితీయ స్వకీయస్థిత్యానంత బలాబలములుగా మారుచున్నవి. జయాపజయము లద్వితీయ స్వకీయనిర్వాహకశక్తిచిత్తములుగా మారుచున్నవి. సత్యాసత్యములు జ్ఞానాజ్ఞానము లద్వితీయానంత స్వకీయవ్యక్తిప్రకాశతగా సర్వవ్యాపకజ్ఞానముగా మారుచున్నవి. వృద్ధిక్షయములు బంధమోక్షము లద్వితీయస్వకీయ వ్యక్తిగల జ్ఞానస్థితిగా మారుచున్నవి. మన సమస్తజీవితము ముఖ్యస్థితి సచ్చిదానందుని స్వాధీనమగుచున్నది.

జ్ఞానకర్మ భక్తియోగములచేఁ బ్రతిపాదింపఁబడిన యైక్యత నీపరిపూర్ణజ్ఞానమార్గమువలనఁ బొందఁగలము. సత్యమైన యాత్మస్థితి జ్ఞానమునొఱకు జ్ఞానయోగము ప్రయత్నించుచున్నది. రహస్యముగా సర్వకర్మలఁ బాలించు దివ్యజ్ఞానచిత్తవ్యక్తినొఱకు గర్మయోగము ప్రయత్నించుచున్నది. ఇదే సత్, చిత్, ఆనందములు. సచ్చిదానందుని త్రివిధస్వభావములలో నేదో యొకదాని ననుసరించి యతనిబొందుట కీమార్గములు వేరువేరుగాఁ బ్రయత్నించుచున్నవి. జ్ఞానయోగముచేత మన నిత్యసత్యాఖండస్థితి నొందుచున్నాము. నేననునది ప్రపంచమునందసంపూర్తిగా దేనిని దెలుపుచున్నదో యాస్వయంభువే యానిత్యసత్యస్థితి. సోహమను గొప్ప యనుభవమందాభేదము విడుతుము. అప్పుడు సమస్తేతరభూతములతో నేకత్వము సహితము పొందుదుము.

అంతేగాక పరిపూర్ణజ్ఞాన మాయనంతస్థితి బ్రహ్మాండముల సృజించి పరిపాలించునట్టియు, వాని వ్యాపారములందావిర్భవించినట్టియు జ్ఞానశక్తియేయను వ్యక్తినికూడ కలిగించుచున్నది. స్వాయంభువుని యతని సర్వవ్యాపక జ్ఞానచిత్తమందీశ్వరునిగాఁ బ్రభునిగా వెల్లడిచేయుచున్నది. మనచిత్తము నతనిచిత్తముతో నైక్యమొందించుటకు సామర్థ్యమిచ్చుచున్నది. సమస్తస్థితులయొక్క శక్తులయందతని చిత్తమును గ్రహింపఁజేయుచున్నది. ఈభిన్నశక్తుల సంసిద్ధి మన సర్వవ్యాపకసంసిద్ధిలో భాగమేనని తెలుపుచున్నది. ఈవిధమున భిన్నవిరుద్ధవిరోధముల యసత్యమును బారఁదరిమి వానిపై యాకారముమట్టుకు నిలుపుచున్నది. అట్టి జ్ఞానమువలన మన స్వభావమునుబట్టి పౌరుషేయమై మన నిజతత్వమునుబట్టి యపౌరుషేయమైన దివ్యకర్మకు సాధ్యమున్నదని మనకుఁ దెలియుచున్నది. అట్లు

తెలియుటకుఁ గారణమేముఁగా నాకర్మయహంకారమునకు వెలియై నదానినుండి కలుగుచున్నది. దానిననుమతిపై జరుగుచున్నది. సమత్వముతో మనము కర్మలఁజేయుదుము. కర్మలచే కర్మఫలములచే బంధింపఁబడము. ఉత్తమోత్తమునితోఁగలిసి, సర్వవ్యాపకముతోఁ గలిసి, కర్మలకు బాధ్యులముగాక, కర్మఫలములనొందక పనులఁజేయుదుము. కర్మమార్గసంసిద్ధియని మనమేది వెనుక కనిపెట్టితిమో యదియే జ్ఞానమార్గమువలన సిద్ధించుచున్నది.

పరిపూర్ణజ్ఞానము స్వాయంభువుని సమస్తానందముగా వెల్లడి చేయుచున్నది. అతఁడు సచ్చిదానందుఁడై బ్రహ్మాండము నావిర్భవింపఁజేసి, సకలభూతముల నావిర్భవింపఁజేసి వారి జ్ఞానప్రయత్నముల వృద్ధిపరత్వకర్మల నంగీకరించినవిధమున నర్చనలసహితమంగీకరించి, వారివైపునకొరగి, తనవైపునకు వారినిచేదుకొని సమస్తమును తన దివ్యసంతసములోనికి తీసుకొనుచున్నాఁడు. మన దివ్యాత్మగా నతని దెలుసుకొని వానితో నేకమగుచున్నాము. ఆశ్లేషానందావేశమందుఁ బ్రియుఁడుఁ బ్రియురాలేకమైనట్లు వానితో నైక్యమొందెదము. సమస్తభూతములందు సహితమతని దెలుసుకొని ప్రియునిపరీక్ష్యాశి, సౌందర్యసంతసముల సర్వమందుఁగాంచి మనజీవులను సర్వవ్యాపకానందరాగముగాను, సర్వవ్యాపక ప్రేమయొక్క సంతోషవిపులత్వముగాను మార్చెదము. ఇదంతయు ముందు భక్తిమార్గశిఖరమని మనము కనిపెట్టుదుము. అదే జ్ఞానమార్గముచే సంభవించుచున్నది.

ఆవిధమునఁ బరిపూర్ణజ్ఞానముచేత నద్వితీయునందునమస్తము నైక్యమొందించుచున్నాము. సర్వవ్యాపక జ్ఞానముయొక్క సమస్తరాగముల పుచ్చుకొని, మధురమైనవిగాని, కటువైనవిగాని, ప్రియా

శమైనవిగాని, తేజోవిహీనమైనవిగాని, శక్తియుక్తములుగాని, బలహీనములుగాని, వినపడునవిగాని, వినపడనివిగాని, యన్నిటిని స్వీకరించి సచ్చిదానందముయొక్క యఖండ సమరసమందు సమన్వయము చేయుదుము. జ్ఞానము శక్త్యానందములసహితము కలిగించుచున్నది. "సమస్తమందేకత్వమును జూచువానికి దుఃఖమెక్కడిది? వాఁడేవిధమున మోసపోవును?"





# యోగసంకలనము.

29 అధ్యాయము.

## జీవుఁడు - స్వభావము.



సర్వవ్యాపక మేకత్వములోనికి వివిధభాగములఁ జేర్చి మొత్తము జేయగాఁ బరిపూర్ణజ్ఞానమిట్లుండును. కాని ప్రపంచము నీశ్వరుఁడెట్లు పొందియున్నాఁడో యట్లు మన నూతనదివ్యజ్ఞానమందుఁ బూర్తిగా పొందవలెనన్న మనము ప్రతివస్తువును దాని పరిపూర్ణత్వమందును, దానిని పూర్తిజేయు సమస్తముతో నైక్యమందును దెలుసుకొనవలసియున్నది. కారణమేమనగా దేవుఁడట్లూహించి తన స్వరూపమును ప్రపంచమందుఁ జూచినాఁడు. వస్తువులను భాగములుగా నసంపూర్ణములుగాఁ జూచుట హీనమైన భిన్నజ్ఞానమే. పరిపూర్ణుఁడు సర్వమందున్నాఁడు. సమస్తమందుఁ గనిపెట్టి చూడఁబడవలసియున్నాఁడు. ప్రతి కించిద్వస్తువనంతమైయున్నది. కాబట్టి దాని యనంతత్వమందు కించిదాకారమందు సహితము తెలుసుకొనఁబడి యనుభవింపఁబడవలసియున్నది. దానిని దెలుసుకొనుట మానస యూహాభావముగాఁ గాక, దివ్యదృష్టితో దివ్యవ్యక్తితో దివ్యావేశ

ముతో, మనకు వ్యక్తమగుచున్న వస్తువునందు దివ్యైక్యముతో నతీతమేగాక, నిచ్చటి సమస్తము సమస్తముయొక్క మొత్తమేగాక, సమస్తము ప్రతివస్తువు నిజమునకు మనయాత్మేయని దేవుఁడేయని పరిపూర్ణానంత సచ్చిదానందమేయని మనము గ్రహించుచుండెయున్నది. ప్రపంచమందు దేవుని పరిపూర్ణానందముయొక్క మనోహ్లాదయ చిత్తసంపూర్ణ సంతుష్టియొక్క జ్ఞానముయొక్క పరిపూర్ణముక్తియొక్క రహస్యమిదే. ఈయుత్తమానుభవముకొఱకే కళలు, కవనము, సమస్త పరోక్షాపరోక్షజ్ఞానప్రయత్నములు, వస్తువులఁబొంది యనుభవించవలెనను సమస్తకోరికలు తెలిసియో తెలియకనో ప్రయత్నములు చేయుచున్నవి. వస్తుగుణరూపముల గ్రహించుటకవి ప్రథమమునఁ బ్రయత్నములు చేయుచున్నవి. కాని గాఢమైన సంతుష్టికలుగుటలేదు. వానిని సంపూర్ణముగా గ్రహించుటవల్ల నవి దేని వెలియాకారములో యాయనంత సత్యవ్యక్తికలుగకున్న గాఢ సంతుష్టి కలుగదు. మానసతర్కమునకు నింద్రియదృష్టికిది భ్రమగాఁ గవనథోరణిగాఁ దోఁచఁగలదు. కాని యది యిచ్చుదానివల్లనే కలుగు సంపూర్ణ సంతోషవ్యక్తిప్రకాశములు దానిసత్యమును స్థాపించుచున్నవి. మార్పును రానిచ్చినయడల పొందఁగోరుచున్న దివ్యవ్యక్తికిరణము శ్రేష్ఠమైన దివ్యజ్ఞానకిరణము దానివల్లనే మనకు వచ్చుచున్నది.

ఈశ్వరస్థితియొక్క పరమోన్నతవిషయములకిది వర్తించునని మనము చూచియుంటిమి. విమర్శించుమానసము సద్భావిర్భావమునకు వెలినున్నదే పరిపూర్ణమని, నిరాకారమైనదే యనంతమని కాలస్థలభేదచలనశూన్యమైన యాత్మ తన స్థిమితమందే పరిపూర్ణసత్యమగుచున్నదని చెప్పుచున్నది. మన ప్రయత్నమందీభావమే

ముఖ్యమని యవలంబించినయడల మనకువచ్చు ముఖ్యానుభవమిదే. తక్కినదంతయు నసత్యముగాఁ దోచును. లేక మనము విఫులాభి ప్రాయముతోఁ బ్రారంభించితిమా పూర్ణతరమైనసత్యము విఫులత రానుభవము రాఁగలదు. కాలస్థలశూన్యమైన స్థితి మే పరిపూర్ణా నంతమని మనము తెలుసుకొనఁగలము. అదే యీశ్వరుని క్రియా రూపమైన యానందమని జ్ఞానశక్తియని సహితము తెలియఁగలదు. తన సర్వానందస్థితియందు శక్తుల, గుణముల, స్వకీయనిర్మాణములఁ బ్రవహింపఁజేయుచున్న పూర్ణానంతమేయని తెలుసుకొనుచున్నా ము. ఆపరిపూర్ణానంతమునే మన మేకకాలమున గాలశూన్య దివ్య ప్రశాంతముగాను కాలరూపానంత క్రియాసంతుష్టిగాను, బంధము లేక కల్లోలదుఃఖములఁ బడక, ననుభవి తుము. గనుక యచలమం దాత్మ గతమై లోనికీడ్వఁబడి దాగియున్నట్టియు, విశ్వమందు బహి ర్గతమై యనంతగుణసామర్థ్యముల వెల్లడిచేయునట్టియు నీవ్యాపార ముయొక్క (activity) సర్వవిషయానుభవమునే పొందెదము.

ఈవిషయములలో మిక్కిలి ముఖ్యమైనది కర్మయోగమందు వెనుకఁ జెప్పఁబడిన పురుషప్రకృతిభేదము. (అది యేకత్వమొందఁగ లదు). జ్ఞానయోగమునకు సహితమిది మిక్కిలి ముఖ్యమైనది. హిం దూవేదాంతశాస్త్రము లీవిభాగమును స్పష్టపరిచినవి. ఐక్యముతో నున్న యనుభవసిద్ధమైన భిన్నత్వమనఁబడు నిత్యసత్యమే దీనికి మూ లము. అట్టిభిన్నత్వముపై విశ్వావిర్భావమేర్పడినది. విశ్వమునుగురిం చి మనకున్న యభిప్రాయానుసారముగా దీనికివిధానము లివ్వఁబడి నవి. వేదాంతు లాత్మ మాయయని చెప్పిరి. ఆత్మయనగా నిర్వికార మనిరి. మాయ యనగా విశ్వభ్రమను దనయందధ్యారోపము చేసు కొనఁజాలిన యాత్మయొక్క శక్తియనిరి. ఆత్మయనగా దేవుఁడనిరి.

మాయయనగా దేవుఁడు జీవరూపములలో వస్తురూపములలోఁ దన కుఁదా దేనివలన నావిర్భవించుచున్నాఁడో యట్టి జ్ఞానశక్తి స్థితులస్వభావమనిరి. ఇతరు లీశ్వరుఁడుశక్తి యనుచున్నారు. ప్రభువు వానిశక్తియనుచున్నారు. పృథక్కారియైన సాంఖ్యసిద్ధాంతము వీనికి నిత్యద్వైతభావ మొప్పుకొనుచున్నది. సంయోగవియోగముల నంగీకరించుచున్నది. వానివలన ప్రకృతివ్యాపారము ప్రారంభమై, నడిచి, నిలిచిపోవుచున్నదని చెప్పుచున్నది. కారణమేమనగా పురుషుఁడు క్రియాశూన్యమైన జ్ఞానస్థితియనియు దనలోఁ దానొకటిగానుండు జీవపదార్థమనియు, సదా వికారశూన్యుఁడనియుఁ జెప్పిరి. ప్రకృతిస్వభావముయొక్క క్రియాశక్తియనియు దాని చలనమువలన విశ్వముల సృజించి సంరక్షించి తాఁబ్రశాంతమందఁగునప్పుడు విశ్వవికారమును లయముచేయుచున్నదనియుఁ జెప్పుచున్నారు. ఇట్టి వేదాంతశాస్త్రములమాట యటుండనిచ్చి ప్రత్యక్షమున మనకు సమస్తజంతుజాలమందు ముఖ్యముగా మానవజాతియం దనుభవమునకు గోచరించుచున్న ద్వైతవిభాగమును కనిపెట్టుడు. స్వభావము జీవుఁడను ద్వైతస్థితి గాన్పించుచున్నది.

ఈద్వైతభావము తనంతటఁ దావ్యక్తమగుచున్నది. ఎట్టివేదాంతముతోఁ బనిలేకనే యనుభవమందు మనకుఁ గనుపించునదిదే. కాని యిట్టిదని నిరూపించుటకుమాత్రము మనము శ్రమతీసుకొనుట లేదు. జీవుఁడు లేఁడనిచెప్పునట్టియు నిట్టిదని విశదముచేయలేని మెదడుయొక్కవికారమే జీవుఁడని చెప్పునట్టియు మనము వ్యక్తిమానసమనుదానినే జీవుఁడనునట్టియు మిక్కిలి దృఢమై ననాస్తికముసహిత (Meterialism) మీ ద్వైతభావమును తొలగించఁజాలకున్నది. అది యెట్లువచ్చెనో వచ్చినది. అదియుండుటేగాక మనసమస్తస్థితిని

నిర్ధారణ చేయుచున్నది. ఇచ్ఛ తెలివిగల మనుష్యజాతికది బహుముఖ్యము. దాని ననుసరించే మన కష్టసుఖములుండును. మనజీవితసమస్య యీయొక్క ప్రశ్న నే యనుసరించుచున్నది. పరస్పరవిరోధభావములుగల యీజీవస్వభావములగురించి మనమేమి చేయవలయు? జీవునియందధ్యారోపమై యతని వశముజేసుకొని యాడించ బ్రయత్నించు నీవిశ్వక్రియారూపమైన నీస్వభావమునుగురించి యేమిచేయవలయు? ఎట్లో తనకు స్వాతంత్ర్యాధికారములు గలవనితలచి స్వభావము నెదిరించి దాని వశముచేసుకొని యనుభవించుటకుగాని తప్పించుకొనుటకుగాని ప్రయత్నించుచున్న జీవునిగురించి యేమి చేయవలయు?" ఆప్రశ్నకుఁ బ్రత్యుత్తమిచ్చుటకు జీవుఁడేమి చేయగలఁడో తెలుసుకొనవలెను. తన్నుగురించి యేమి చేసుకొనగలఁడో తెలుసుకొనవలెను. స్వభావవిశ్వములగురించి యేమి చేయగలఁడో తెలుసుకొనవలెను. సమస్త వేదాంతములు, మతములు, శాస్త్రములీప్రశ్నమునకుఁ దగు ప్రత్యుత్తరమిచ్చుటకై సరియైనసామగ్రిని పోగుజేయు ప్రయత్నములే. మనజ్ఞానమునుబట్టి జీవితసమస్యను సాధ్యమైనంత తృప్తికరముగాఁ దీర్మానించుట కేర్పడినవే.

ఈపోరాటమునుండి దుఃఖభరితమైన మన హీనస్థితినుండి పూర్తిగా తప్పించుకొనుటకెప్పుడు వీలుకలుగుననగా, దేనిని మతము వేదాంతము వప్పుకొనుచున్నదో దేనిని యాధునికభావ మంగీకరించుచున్నదో యట్టిజీవునకు రెండుస్థితులు గలవనువిషయము తెలుసుకొన్నప్పుడే. దుఃఖభాజనమై లోఁబడిన హీనస్థితి, దుఃఖరహితమై ప్రభుత్వముగల యుత్తమయూర్ధ్వస్థితియనునవే జీవునకుఁగల రెండుస్థితులు. ఒకటి మనస్సునందుఁ జలనమొందునది. రెండవది యాత్మయందు స్థిమితముకలది. తప్పించుకొందమను యాశయేగాక

పూర్తియైన తృప్తికరమైన తీర్మానముసహిత మెప్పుడువచ్చుననగా కొన్నిమతములు వేదాంతము లంగీకరించునట్టియు, గొందఱు నిరాకరించునట్టియు జీవస్వభావైక్యమందుసహితము సాధారణ మధ్యమస్థితి, యుత్తమస్థితియను రెండుస్థితులుకలవని తెలుసుకొన్నప్పుడే. ఉత్తమస్థితి దివ్యమైనది. అట్టిస్థితియందు ద్వైతగుణములుమారి జీవుఁడు స్వభావమునుగెలిచి స్వతంత్రుఁడగుటేగాక దేనికొఱకతఁ డిప్పుడు పోరాడుచున్నాఁడో యట్టి ప్రపంచస్వభావమునుబొందిన దేవునితో నైక్యమొందుచున్నాఁడు. మనముగ్రహించు తీర్మానములీవిషయములగూర్చి మన యభిప్రాయానుసారముగా నుండును.

మానసమందుఁ జిక్కుకొని మానస హృదయ రాగ ప్రాణ స్థూల ప్రపంచిక ప్రేరేపణలకుఁ దత్ఫలములకు వశమై జీవుఁడు స్వభావమునకు దాసుఁడగుచున్నాఁడు. అతనిచిత్తము తెలివిసహితము మానసస్వభావమునుబట్టి నిర్ణయింపఁబడుచున్నది. వ్యష్టిమానసము చుట్టుయావరణముచే జయింపఁబడుచున్నది. చుట్టుయావరణముయొక్క మానసస్వభావమునుబట్టి నిర్ణయింపఁబడుచున్నది. తన యనుభవమును గర్మలను నిర్ణయించుటకుఁ గ్రమముగా నడుపుటకతఁడుచేయు ప్రయత్నములు భ్రమతోఁగూడిన విషయములగుచున్నవి. తాను పనిచేయుచున్నాననుకొన్నప్పుడు సహితము నిజమునకుఁ బనిచేయునది స్వభావము. తన చిత్తభావవ్యాపారముల నన్నిటిని నిర్ణయించునది స్వభావము. తాను కలఁడని, తనలోఁ దానున్నాఁడని, తాను శరీరము ప్రాణముగాక బ్రహ్మాండానుభవమును నిర్ణయించకపోయినను దానిని స్వీకరించి యంగీకరించు వేరువాఁడనియు జీవునికిజ్ఞానమే లేనియెడల స్వభావము నిజమని జీవుఁడు భ్రమయని చివరకుఁ జెప్పవలసివచ్చును. ఆధునికనాస్తిక విపర్య

వసానమును నిర్ధారణజేయుచున్నది. శూన్యమనఁబడు బౌద్ధవాద మీపర్యవసానమునకు చేరినది. సాంఖ్యు లీచిక్కుకనిపెట్టి యిట్లు తీర్మానించిరి. స్వభావముయొక్క నిర్ణయముల జీవుఁడు ప్రతిఫలించుననియుఁ దానేదియు నిర్ణయించఁడనియు, బ్రభువుకాఁడనియుఁ బ్రతిఫలించుటమాననా నిత్యప్రశాంతములోనికి యచలత్వములోనికి తిరిగిచేరుననియుఁ జెప్పుచున్నారు. ఈపర్యవసానమునే యిచ్చునట్టి మరికొన్నితీర్మానములు కలవు. కాని యాస్థికము స్వభావము భ్రమయనియు, స్వభావజీవములురెండు సత్యములుకావనియు వాని ద్వందస్వభావములేనట్టి స్థితికలదనియు నిత్యత్వమందిరెండు నశించుచున్నవనియు లేక వ్యాపారము పూర్తిగా తొలగుచున్నదనియు చెప్పుచున్నది. వీనివలన మనుష్యునకుగల గొప్పయాశ, గాఢమైన ప్రేరేపణధ్యాస తృప్తిపడకున్న నీతీర్మానములు కొంతవరకు సరియైనవే. ఏలననగా నవి తనకుదాప్రకాశించు పరిపూర్ణుఁడుకలఁడని తెలుసుకొన్నవి. జీవునకుప్రత్యేకము పరిపూర్ణత్వమున్నదని తెలుసుకొన్నవి. కాని యవి పరిపూర్ణుని యానందభరితానంతత్వముల నిరాకరించుచున్నవి. ఈపరిపూర్ణానందము జీవుఁడు స్వభావమును వశముచేసుకొన గాదివ్యస్థితియందు నిత్యాన్వేషికి కలుగుచున్నది.

ఆత్మలోనికి యెత్తఁబడిన జీవుఁడు స్వభావమునకుఁ లోఁబడఁడు. అప్పుడతఁడు మనోవ్యాపారమునకు పైగానుండును. బంధవిముక్తుఁడై యొంటరిగా పైన నుదాసీనుఁడై కూర్చొనవచ్చును. లేక భిన్నమగు తన యానందప్రశాంతత్వములం దాకర్షింపఁబడి లేనమై తన విజ్ఞానానుభవమందుండిన నుండవచ్చును. స్వభావమును, విశ్వస్థితిని మనమప్పుడు పూర్తిగావిడిచి యంటకుందుమేకాని, దివ్యప్రభావ వశీకరణముచే జయించినవారముకాము. దేవుఁడైనయాత్మ స్వభావ

మునకుఁ బైనుండుటేగాక విశ్వస్వభావములకుఁ బ్రభువుకూడ నై యున్నది. తన దివ్యస్థితియందు లోనికి యధిరోహించినజీవుఁడు దేవుని యం దైక్య మొంది యాప్రభుత్వముకలిగి యుండకఁదప్పదు. ప్రశాంత మొందించిగాని, స్థిమిత మొందించిగాని స్వభావమును జయించుటేగాక దాని విలాసవ్యాపారముపై ప్రభుత్వముసహితము కలిగియుండవలెను. అధోస్థితియందిది సాధ్యముకాదు. కారణమేమనగా జీవుఁడచ్చట మనస్సుద్వారా పనిచేయుచున్నాఁడు. దివ్యజ్ఞాన దివ్యచిత్తములు విశ్వమందు దేనిద్వారా పనిచేయుచున్నవో యట్టి సర్వవ్యాపకస్వభావమునకు లోఁబడినవిధేయతతోఁ దపించులోఁగుబాటుతో వ్యష్టిశకలరూపమున మానసము పనిచేయుచున్నది. కాని యాత్మ తన స్వాధీనమందు జ్ఞానచిత్తముల కలిగియున్నది. వానికి మూలకారణమైయున్నది గాని వానికి లోఁబడియుండలేదు. కాబట్టి జీవుఁడు తన దివ్యజ్ఞానస్థితినొందినకొలది తన స్వభావవ్యాపారముపై యధికారము కలిగియుండును. అది స్వరాట్టగుచున్నది. తన స్వకీయప్రాణస్థితి సామ్రాజ్యమును బాలించు స్వతంత్రప్రభువగుచున్నది. కాని ప్రపంచముపై తన చుట్టుయావరణముపై యధికారవృద్ధినిసహితము వహించుచున్నది. జీవుఁడు సర్వవ్యాపకమొంది యిట్టి యధికారియగుచున్నాఁడు. కారణమేమనగా విశ్వవ్యాపారమందతఁడు దివ్యమైన సర్వవ్యాపకచిత్తమును వెల్లడించవలసియున్నది. అతఁడు మొదట తన జానమును వృద్ధిఁజేసుకొని మనస్సువలె భిన్నమైన మూర్తియొక్క స్థూల ప్రాణ రాగ బుద్ధేంద్రియ దృష్టితోఁగాక తనలో విశ్వమును చూచుకొనవలెను. విశ్వసత్యముల, విశ్వశక్తుల, విశ్వవాసనల, విశ్వప్రయోజనముల తనవిగా భావించవలెను. తన భావములకు, కోరికలకుఁ, బ్రేరేపణలకుఁ, బ్రయత్నములకు నుద్దేశ్యములకుఁ బ్రయోజనముల కంటిపెట్టుకొని యుండరాదు. ఉన్నంత

వరకు వీనిని బ్రహ్మాండముతో సమరసమొందించవలెను. అంతట తన జ్ఞానచిత్తముల దివ్యజ్ఞానచిత్తములకు వశముచేయవలెను. ఆవిధమైన లోఁబడి బైటఁబడవలెను. తన స్వకీయకాంతిని దివ్యకాంతియందు లయముచేయువలెను. స్వప్రేరేపణను దివ్యప్రేరేపణయందు లయముచేయవలెను. మొదట యనంతునితో నేకీభావమొంది దేవునితో సమరసమొంది, తరువాత యనంతునియందైక్యమొందుట, దేవుని లోనికిఁ దీసుకోనఁబడుట, జీవుని బలాధికారపరిపూర్ణత్వలక్షణమగుచున్నది. ఇదే యధ్యాత్మికజీవితమునకు నధ్యాత్మికస్థితికి ముఖ్యలక్షణమగుచున్నది.

భగవద్గీతలోఁ బురుషప్రకృతులకుఁ గనుపరచిన భేదము జీవుఁడు తన పరిపూర్ణ స్వాతంత్ర్యమునకై చేయు ప్రయత్నమందు స్వభావమునుగురించి తానెట్లుండవలెనో యావివిధవిధానములఁ దెలుపుచున్నది పురుషుఁడు, సాక్షి భర్త సమ్మతించువాఁడు జ్ఞానప్రభువు భోక్తయని గీతపలుకుచున్నది. ప్రకృతి, పనిచేయునది కార్యకరణసామర్థ్యముకలది పురుషుని చిత్తవృత్తిననుసరించి పనిచేయునది. జీవుఁడు తనకిష్టమైనయెడల కేవలసాక్షియై యుండవచ్చును. తాను వెలియై స్వభావకార్యమును జూచుచుండవచ్చును. తాఁగనిపెట్టును. కాని యాకార్యమందుఁ బాలుకోనఁడు. ఈప్రశాంతస్థిమితముల యాధిక్యత మనము చూచియున్నాము. దేహము ప్రాణము మనోవ్యాపారము భావము యింద్రియవ్యాపారము రాగము ప్రకృతి చేయుపనులుకాని తాఁజేయుపనులుకావనియుఁ దాఁగాదనియుఁ జెప్పుటకు దీనివలన వీలుకలుగుచున్నది. దీనివలన జీవుఁడు వెలియగుచున్నాఁడు. అవియన్నియుఁ బ్రశాంతినొందుట సంభవించుచున్నది. స్వభావకార్యమున్నంతవరకు సహించి, విడిచి, పాలుగొనకుండుట

యను తామసికసన్యాసమిది కావచ్చును. అసహ్యము వినుకు పతన మువలన జనించిన రాజసిక వైరాగ్యము కావచ్చును. ప్రకాశమాన మై తెలివితో నేకాంతప్రశాంతస్థితితానందములతో సాత్వికసన్యాసము కావచ్చును. కాని యేదియైనఁ దమాషాచూడవచ్చి తనకిష్ట మువచ్చినప్పుడు సంతోషముతో లేచిపోఁగల ప్రేక్షకుని యకారణా నందము కావచ్చును. సాక్షియను స్థిత్యైన్నిత్యము విశ్వవికారము తో నంటకుండు స్వతంత్రపరిపూర్ణత్వమైయున్నది.

కేవలద్రష్టయైనప్పుడు జీవుఁడు తాను స్వభావమునకు భర్త యనువిషయము నిరాకరించును. భర్త మరియొకఁడు. దేవుఁడో, శక్తి యో, మాయయో యగుచున్నది. జీవుఁడుకాదు. జీవుఁడు వ్యక్తి తోఁ గనిపెట్టుచుండగా స్వభావకార్యమతనియందుఁ బ్రతిఫలించు చున్నదేకాని యట్టికార్యమును బోషించుటకుగాని నిలుపుటకుగాని యతనికి బాధ్యతలేదు. "సమస్తము నాలోనున్నది. నాచేఁ బోషింపఁబడుచున్నది నా స్థితికిసంబంధించిన వ్యాపారము" ని చెప్పఁడు. "ఇది నాపై వేయఁబడినది. నాకంటె వేరైనది" యనుచున్నాఁడు. సత్యమైన రెండుపదార్థములుండకున్న నిది సాధ్యముకాదు. జీవుఁడు భర్తసహితమై యున్నాఁడు. విశ్వమును వెలిఁబుచ్చి, దానిశక్తుల నడుపునట్టి బలమును తనలోఁ బోషించుచున్నాఁడు. పురుషుఁడు (Purusha) తన భర్తృత్వ మంగీకరించునప్పుడుసహితము స్థిమితము తో నంటకయే పనిచేయవచ్చును. తాను శక్తిని యిచ్చువాడనిమాత్రము వ్యక్తికలిగి యుండవచ్చును. కాని తాను నిర్ణయించి నడుపువాఁడుకాడని తలచవచ్చును. నడుపునది మరియొకరు. దేవుఁడో శక్తియో; మాయయో. జీవుఁడెంతకాలము తాభర్తగానుండవలెనో యంతవట్టు కట్టుఁడును. బహుశః యాతఁడు ముందు తానిచ్చిన శక్తి

వ్యయమయ్యేవరకు భర్తగానుండును. కాని భర్తయను విషయము పూర్తిగా నంగీకరించినయడల క్రియాబ్రహ్మము తాపిశ్వానంద పురుషునితో నైక్యమొందుటలో ముఖ్యమైన ముందంజవేయఁబడినది. కారణమేమనగా పురుషుఁడు వ్యక్తితో ననుజ్ఞ యిచ్చువాఁడగుచున్నాఁడు.

ద్రిష్టపీఠిలో యొకవిధమైన యనుజ్ఞయిచ్చుట కలదు. కాని యది శాంతినొంది కర్తృత్వములేక పరిపూర్ణత్వములేక నున్నది. జీవుఁడు తన భర్తృత్వమును బూర్తిగా నంగీకరించినప్పుడు యనుజ్ఞ బలమైనది కర్తృత్వమువహించినది యగును. అప్పుడుసహితము జీవుఁడు ప్రతిఫలించుటకు సమ్మతించుటకంటె మరివేరుచేయక పోవచ్చును. భర్తయై ప్రకృతిశక్తులచేతఁ బనిచేయుటకంటె మరి వేరు చేయకపోవచ్చును. నిర్ణయించి నిర్ధారణచేయుట తాను కాదనియు నిర్ణయించి నిర్ధారణచేయునది యవరో వేరొక దేవుఁడు శక్తి జ్ఞాన చిత్తమని నమ్మవచ్చును. జీవుఁడు సాక్షి భర్తయనుమతిచ్చువాఁడే కాని జ్ఞాత యీశ్వరుఁడుకాఁడని నమ్మవచ్చును. కాని తరుచు తనకివ్వఁబడినదానిలో నెన్నుకొని తక్కినదానిని యెప్పుడు నిరాకరించుచున్నాఁడో యప్పుడు నిర్ణయించువాఁడగుచున్నాఁడు. మొదట కర్తృత్వములేకనే యివ్వఁబడిన యనుమతి కర్తృత్వముకలది యగుచున్నది. కర్తృత్వముగల యధికారమునకు మార్గమారంభమైనది.

జీవుఁడు తాను బూర్తిగా జ్ఞాత ప్రభువు భోక్త యని యెప్పుడంగీకరించుచున్నాఁడో యప్పుడిది యగుచున్నాఁడు. జీవుఁడు జ్ఞాతయై పనిచేయునట్టియు నిర్ణయించునట్టియు శక్తియొక్క జ్ఞానము పొందుచున్నాఁడు. బ్రహ్మాండమందు సంసిద్ధినొందుచున్న స్థితి విలువలఁ జూచుచున్నాఁడు. విధియొక్క (Fate) రహస్యమును తెలుసు

కొనుచున్నాఁడు. కాని శక్తి, జ్ఞానముచే నిర్ణయింపఁబడుచున్నది. ఈజ్ఞానము శక్తికి మూలము. శక్తి విలువలను వాని సంసిద్ధిని నిర్ణయించునది జ్ఞానమే. జీవుఁడు జ్ఞాతయైనకొలఁది కర్మను నడిపించు ప్రభువగుచున్నాఁడు. భోక్తగాకయే ప్రభువుకానేరఁడు. అధోస్థితియందనుభవము ద్వివిధము. ఇంద్రియానుభవములకివె సుఖదుఃఖముగాఁదోఁచుచున్నది. కాని యూర్ధ్వస్థితియందు స్వకీయావిర్భావజనిత దివ్యానందానుభవముగా మారుచున్నది. అచ్చట స్వాతంత్ర్యముపోదు. అజ్ఞానజనితానుబంధములోనికిఁ బతనములేదు. జీవన్ముక్తుఁడైన మనుజుఁడు స్వభావకార్యమునకు ప్రభువీశ్వరుఁడని తెలుసుకొనుచున్నాఁడు. మాయ సమస్తమును నిర్ణయించునట్టి పనిచేయునట్టి యీశ్వరుని జ్ఞానచిత్తమని తెలుసుకొనుచున్నాఁడు. వ్యష్టిరూపమైన తాను సహితము దివ్యస్థితికొకస్థానమనియు గీత చెప్పినట్లీశ్వరునిలోని భాగమనియు స్వభావకార్యమెంతమట్టుకు తనకుఁ దోఁచఁబడి భరింపఁబడి నిర్ణయింపఁబడి యనుభవింపఁబడుచున్నదో యంతమట్టుకు నడుపుచున్నాఁడనియుఁ దెలుసుకొనుచున్నాఁడు. తాను సర్వసమత్వమొందినపుడు దివ్యజ్ఞానమునే యతనిజ్ఞానము ప్రతిఫలింపఁజేయుచున్నది. ఆతని చిత్తము దివ్యచిత్తముయొక్క కార్యమునే చేయుచున్నది. అతఁడు దివ్యానందమునే యనుభవించుచున్నాఁడు. కాని యజ్ఞానజనితస్వకీయసంతుష్టినికాదు. ఈవిధమున పురుషుఁడు తన విశ్వప్రతినిధిత్వానుభవమందు సహితము వ్యష్ట్యత్వము నైకొనుటకు విడుచుటకు తన స్వాతంత్ర్యమును నిలుపుకొనుచున్నాఁడు. జీవస్వభావములకు గల నిజసంబంధముల నతఁడున్నతస్థితమందుఁ బూర్తిగా స్వీకరించుచున్నాఁడు.

లు సచ్చిదానందస్థితినుండి పుట్టుచున్నవి. ఆత్మజ్ఞానముతోనుండుటే పురుషునకు ముఖ్యస్వభావము, అదే సత్ లేక పురుషుఁడు. ఆత్మ వ్యక్తితోనుండు శక్తే, లోనికీడ్వఁబడినప్పుడుగాని జ్ఞానచిత్తబలవ్యక్తుల తోఁ బనిచేయునప్పుడుగాని చిత్-తపస్సు-చిచ్ఛక్తి యనఁబడుచున్నది. అదే ప్రకృతి జ్ఞానముగలపురుషుఁడు వ్యక్తిగలశక్తియు నైక్యమొందుటే తనలోఁ దాలీనమైయున్నను విభజింపనలవికాని రెండు ముఖములఁ బనిచేయుచు బ్రహ్మాండములఁ గల్పించునప్పుడానందమనఁబడును. బ్రహ్మాండములవెలిబుచ్చి వానికి సాక్షియై యందు బనిచేయుచు, భర్తయై కర్మ నిర్వహించుచు, యేయనుమతిలేకున్న కర్మ జరుగదో యట్టి యనుజ్ఞనిచ్చుచు, చిత్తజ్ఞానముల నడుపుచుఁ దెలుసుకొనుచు, నానందజనకమగుచు నానందించుచు, జీవుని స్వాధీనము చేసుకున్నవాఁడు, స్వభావమునుఁ బొందువాఁడు, భరించువాఁడు, కనిపెట్టువాఁడు, తెలుసుకొనువాఁడు, ప్రభువగుచున్నాఁడు. స్వభావము స్థితిని దెలుపును. చిత్తమును నిర్వహించును. ఆత్మజ్ఞానమును సంతుష్టిచేయును. ఆనందదాయకమగును. స్థితి స్వభావానుసారముగా నేర్పడినప్రకృతి పురుషసంబంధములు మన కచ్చటఁగలవు. తనలోఁ దానొందుజీవుని పూర్ణానందము, దానిపై యాధారపడి స్వభావమందు జీవుఁడుపొందు పూర్ణానందములీ పురుషప్రకృతి సంబంధముయొక్క దివ్యసంసిద్ధులే.




30 అధ్యాయము.

## జీవుఁడు - జీవన్ముక్తి.



పురుషప్రకృతిసంబంధముల నంగీకరించుటచే మనకేమి సంభవించునో మనమిప్పుడు కొంచెము యోచించవలసియున్నది. అనగా మనమిప్పు డవలంబించుచున్న యోగప్రయోజనము సాధారణ మానుషోద్దేశ్యములలో నేదియుఁగాదు. అది ప్రపంచములోని మనస్థితినున్న దాని నున్నట్లంగీకరింపదు. నైతికపూర్ణముతోఁగాని, మతావేశముతోఁగాక, పైనున్న స్వర్గముతోఁగాని, స్థితివల్లగలుగు చిక్కులనన్నిటిని దీర్చు నేదోయొక లయముతోఁగాని, యది తృప్తి జెందదు. మనయుద్దేశము వేఱగుచున్నది. అనంతునియం దీశ్వరుని యందు దేవునియందు నివసించుటే యాయుద్దేశ్యముకాని యహంకారమందు క్షణభంగురమందుంటకాదు. కాని తత్కాలమందు స్వభావమును, మన తోటిపాటిజీవులను, మనభూమిని, భూలోకవాసము నీశ్వరుఁడెట్లు ప్రపంచమును విడిచియుండఁడో యట్లే విడువకుండవలయు. అతఁడు ప్రపంచముతో స్వభావముతో భూతములతో

సంబంధముకలిగియుఁ బరిపూర్ణస్వాతంత్ర్యశక్తితో నాత్మజ్ఞానముతో నున్నాఁడు. మన విమోచనము పరిపూర్ణత్వమనగా నజ్ఞానబంధమునే బలహీనతను విడిచి ప్రపంచస్వభావ సంబంధములయందు దివ్యశక్తి స్వాతంత్ర్యముతో నాత్మజ్ఞానముతో నతనియందు నివసించుటే. కారణమేమనగా జీవునకుఁ బ్రపంచమునకుఁ గల సంబంధము పురుషునకుఁ బ్రకృతిపైఁగల స్వాధీనమువంటిది. అజ్ఞానములేక స్వభావమునకు లోఁబడక సృష్టినిమించి తెలుసుకొని యనుభవించి నడుపఁగలిగి తన యావిర్భావమెట్లుండవలెనో స్వేచ్ఛావిపులత్వములతో నిర్ణయించఁగలిగినపుడిది సంభవించుచున్నది.

విశ్వమందుఁ దాజనించుటకు విశ్వముగా నగుటకు జీవుఁడు స్వభావముతో నెట్టి యాటలాడుచున్నాఁడనగా తన ద్వైతగుణ వివిధత్వమందేకత్వమును గనిపెట్టుటే. సర్వవ్యాపకుఁడై, స్వయంభువై, యనంతుఁడై, బహుళత్వానంతత్వములచే నశించని యైక్యతగల యద్వితీయ సచ్చిదానందమే మొదటిస్థితి. దానిని మనజ్ఞానమన్వేషించుచున్నది. దానిని తుదకు మనము పొందెదము. ఆస్థితి నుండి యితరసత్యములు పుట్టుచున్నవి. దానిపై నిలిచియున్నవి. దానివలన ప్రతిక్షణము సాధ్యములగుచున్నవి. దానియందు తుదకవి యొకటినొకటి తెలుసుకొని పరస్పరభేదములేక సమాధానపడి సమన్వయమొందుచున్నవి. వెలికెంత భేదములుగా కనుపించినను బ్రపంచక విషయములన్నియు సర్వవ్యాపకమైన తన నిత్యత్వముతో నేదో సంబంధముచే. అవి సంబంధములేకయే కాలవశమునఁ దమంతటతాము కలుసుకొనునవి కావు. కాబట్టి యీనిత్యైక్యమును మరలనొందుటే మన యాత్మజ్ఞానమునకు ముఖ్యము. దానియందు నివసించుటే మన యంతరస్థితి వశీకరణము. ప్రపంచముతో మన

నిజమైన సంబంధముల వశీకరణము. కాబట్టి మనము మొదట పట్టుదలతో నీయేకత్వమే జ్ఞానయోగమునకు ముఖ్యోద్దేశమని నిర్ణయించవలసియున్నది.

ప్రతిస్థలమునఁ బ్రతిలోకమందీయైక్యము ద్వైతకార్యనిర్వాహకత్వముచేఁ దనకుఁ దాఁబనిచేయుచున్నది. నిత్యత్వమద్వితీయానంతజ్ఞానస్థితి. పురుషుఁడవ్యక్తము జడముకాదు. ఐక్యమువల్లఁగలిగెడి స్థిమితముచే నేర్పడినదను వ్యక్తిఁగలస్థితి శక్తియొక్క యానందమందు నిత్యమై యది యున్నది. బ్రహ్మాండమందు నిర్మింపఁబడిన వివిధానుభవనాటకమాడు తన జ్ఞానస్థితి శక్తియొక్క యానందమందుసహితమిది నిత్యమైయున్నది. మనమెట్లు కాలాబాధ్యనామరహిత నిత్యాత్మయని తెలుసుకొనియు, మనము చేయు యోచించు నిర్మించు సర్వానుభవముల వ్యక్తి కలిగియుంటిమో యట్లే ప్రపంచమందీపురుషుని యాత్మవ్యక్తియున్నది. మనము ప్రస్తుతమహంకారబద్ధులమై మానసవ్యష్టిరూపులమగుటచే నాత్మయందుండక నప్పుడప్పుడందుఁ బ్రవేశించుటచే నజ్ఞానమందీ యనుభవము మనకుఁ గలుగుచున్నది. కాని నిత్యుఁడు తన యనంతాత్మజ్ఞానమందు దీనిఁ గలిగియున్నాఁడు. ఎల్లప్పుడీయాత్మ యగుచున్నాఁడు. ఆత్మస్థితి పరిపూర్ణత్వమువలన నీసమస్తాత్మానుభవమును వీక్షించుచున్నాఁడు. మానసముచే బంధింపఁబడిన మనవలెనతఁడు తన్నవ్యక్తసముదాయమనికాని స్వానుభవవిరుద్ధయునిగాని తెలుసుకొనువాఁడు కాఁడు. భూతమునకును (Being) భవ్యమునకును (Becoming) గల ప్రాచీన వేదాంతవాదము నిత్యాత్మజ్ఞానమునకు సరిపడదు.

వివిధమార్పులతో భేదములతోఁ జేరికలతోఁ విఘాతములతో నిర్మాణములతో నిండియున్నయాత్మను భావశక్తులందు జ్ఞాన

శక్తులందు చిత్తమందు నాత్మానంద మందాత్మనిర్మాణమందు వెల్లడగుచున్న జ్ఞానస్థితియొక్క క్రియాశక్తియే ప్రకృతిస్వభావమనంబడుచున్నది. అది మనలో బ్రహ్మాండములోనున్నది. కాన భిన్నరూపమైన యీశక్తికివెనుక నీశక్తియొక్క నిత్యస్థిమితము కలదు. అది సర్వసమత్వము. అది భిన్నమునుసృజించినట్లే నిష్పక్షపాతబుద్ధితో నాభిన్నత్వమునుగాపాడి పరిపాలించుచున్నది. పురుషుఁడు దేనిని తనజ్ఞానముచే నిర్ణయించునో యట్టి యాత్మానందప్రయోజనము కొఱకు భిన్నత్వమును నడుపుచున్నది. అదే దివ్యస్వభావము (Devine Nature). మన యాత్మజ్ఞానయోగమువలన మనమైక్యమొందవలసినదీ దివ్యస్వభావముతోనే. మనము పురుషుఁడు కావలెను. వ్యష్టియందే ప్రకృతియొక్క దివ్యవశీకరణముచే నానందించు సచ్చిదానందుఁడు కావలెను. అహంకారమునకు వశులగు మానవులము కాఁగూడదు. అతఁడే నిజమైన మనుజుఁడు. వ్యష్టిమానవుని యుత్తమపరిపూర్ణాత్మ యదియే. అహంకారము మన యావిర్భావములోని హీనభాగము. దానివలన నొకవిధమైన సాధనరూపముగ ననుభవమురాఁగలదు. అట్టి యనుభవము కొంతకాలముండుచది యే. కాని యీహీనానుభవమే మనకు ముఖ్యమైనదనరాదు. ఈ ప్రపంచమందుసహితము మానుషస్థితిఁ జెందినందులకిదే ముఖ్యానుభవముకాదు.

ఈవ్యష్టిరూపమువలననే యాత్మజ్ఞానముగల మానసమునకు జ్ఞానము సాధ్యమౌచున్నది. ఈవ్యష్టిరూపమువలననే విజ్ఞానమొంది మోక్షమొందుటకు దివ్యామృతత్వానుభవమునకు సాధ్యమౌచున్నది. నిత్యుఁడు తన యతీతత్వమందుఁగాని తన విశ్వాత్వమందుఁగాని యీయమృతత్వ మొందువాఁడుకాఁడు. ఆత్మజ్ఞానమొందువాఁడు

వ్యష్టిమానవుఁడే. వ్యష్టిమానవునిచే నాత్మజ్ఞానము పొందఁబడి ఫలదాయకమౌచున్నది. విజ్ఞానమయాన్నమయ మనోమయజీవితమంతయుఁ దన స్వభావబంధములతో జీవుఁడాడునాటకమే. ఈనాటకము లేకున్న నాత్మావిర్భావమే లేకుండును. సమస్తము మన విపులాత్మగా దెలుసుకొన్నప్పుడును దేవునితో నితరములతో నేకత్వమొందినప్పుడును యీనాటకముండఁగలదు. ఉండకఁదప్పదు. సమస్తావిర్భావమును మాని యంతర్గతమై యోగనిద్రఁజెందిన యాత్మజ్ఞానమును గోరినతప్ప లేకున్న నీనాటకముండకఁదప్పదు. కాని వ్యష్టిమనుజుఁడుజునందే యీయోగనిద్రయు విముక్తినొందిన నాటకము తెలియఁబడుచున్నది. యోగనిద్రయనగా నీమానవపురుషుఁడు కేవలమైక్యానుభవమందే నిమగ్నమౌట. విముక్తిగాంచిన నాటకమనగా స్వేచ్ఛలతో నేకత్వముదెలుసుకొని యానందించుటకు తన మానసమును విజ్ఞానములోనికి నధిరోహింపఁజేయుట. ఏలనన దివ్యస్థితియొక్క స్వభావమెట్టిదనగా సదా యైక్యమునుబొందియుండుట. అంతేగాక బహుముఖముల బహులోకముల నద్వితీయాజ్ఞానస్థితియొక్క వ్యష్టిరూపములైన బహుజ్ఞానశక్తి స్వస్వరూపముల నట్టియైక్యమును ననంతానుభవమందు నొందుటసహితమౌచున్నది. మనలోఁ బ్రతి మనుజుఁడీ వ్యష్టిరూపములలో నొకఁడు. అహంకారముతో దైవమునుండి వేరుగానుండుట మనలనుండి వైతొలఁగుటే. మన నిజమైన వ్యష్ట్యత్వమును బొందకుండుటే. అది యజ్ఞానమను మనశక్తియే కాని వేరుకాదు. దివ్యస్థితిలోని కధిరోహింపఁబడి, మనము నివసించునది సర్వవ్యాపకానంత విజ్ఞానమని తెలుసుకొనుట మన యుత్తమ పరిపూర్ణాత్మను బొందుటే. మన నిజమైన వ్యష్ట్యత్వమదియే. అదే మన యాత్మజ్ఞానశక్తి.

దేవుఁడు, స్వభావము, వ్యష్టిజీవుఁడనఁబడు నిత్యావిర్భావము యొక్క త్రివిధశక్తుల నిత్యైక్యము, వాని పరస్పరావశ్యకతయు మనము తెలుసుకొనుటవలన స్థితినే తెలుసుకొందుము. మన యజ్ఞానమును కల్లోలబెట్టు నీవెలిచోద్యమంతయుఁ దెలుసుకొందుము. మన యాత్మజ్ఞాన మీవిషయముల వేనిని నాశన మొనరింపదు. అహంకారనిర్ణయములకు వశపరిచి మనల బంధించు నజ్ఞానవిషయముల నజ్ఞానమును నాశముచేయుచున్నది. మన నిజస్థితిని మరలఁ బొందినపుడహంకారము మనలవిడిచి పోవుచున్నది. అట్టి యహంకారస్థానమందు మన యుత్తమ పరిపూర్ణాత్మ ప్రవేశించుచున్నది. అదే నిజమైన వ్యష్టిజీవుఁడు (individuality). ఇట్టి యుత్తమాత్మ సర్వభూతములతో నేకత్వమొంది తన యనంతత్వమందు సమస్త ప్రపంచమును స్వభావమును వీక్షించుచున్నది. దీని యర్థమేమనగా మనము వేరనుస్యక్తిపోయి భిన్నరహితానందజ్ఞానస్థితి కలుగుచున్నది. అట్టిస్థితియందు మనకు నామరూపబంధము లేనట్లు తోఁచుచున్నది. ప్రస్తుతజన్మయొక్క ప్రత్యేక స్థూలమానసనిర్ణయములుండవు. విశ్వమందున్న నెవనితోనైనను వేనితోనైనను వేరుభావము మనకుండదు. ప్రాచీనయోచకులు జన్మరాహిత్యము జన్మవినాశము లేక నిర్వాణమన్నదిదే. కాని తత్కాలమందుసహితము మన ప్రత్యేకజన్మయందుండి పనిచేయుచుందుము. కాని వేరుజ్ఞానముతో మరియొకవిధమైన యనుభవముతో విశ్వముసహితముండును. కాని మనయందే దానిని వీక్షింతుము. అది వెలిగానున్నదనికాని మనకన్న వేరైనదనికాని భావింపము. మననిజమైన పరిపూర్ణస్థితియొక్క యీ నూతనజ్ఞానమందు సదా నివసించ శక్తికలిగియుండుటే ముక్తి నొందుట. అమృతత్వమనుభవించుట.

అంతట నమృతత్వము మరణాంతర మితరలోకములందు మాత్రము సాధ్యమగుచున్నది. ఉత్తమలోకస్థితులయందుఁ గలుగుచున్నది ముక్తి స్థూలమానసిక జీవితమును పూర్తిగా నాశనముచేయును. నిర్గుణాంతత్వమందు సదా వ్యష్టిస్థితి వినాశమొందవలెనను భావము వచ్చుచున్నది. మనోజడబంధములఁ ద్యజించునపుడు జీవునకు గలుగు నొకవిధమైన యనుభవముచే నవసరముచే నీభావము బలపడుచున్నది. ఈబంధములఁ బ్రపంచజీవితమునుండి విడతీయ వలనుపడదు. మానసస్థితినుండి వేరుచేయ వీలుకాదని తోఁచఁబడుచున్నది. మరణమునకోఁబడి పాణమిచ్చుటనుండునట్లున్నది. తరుచు చచ్చుటచేతనే నిలుచుచున్నది. అమృతత్వము (Immortality) కష్టముమీఁదనిచ్చుట నొందవలసియున్నట్లున్నది. దానిస్వభావమునుబట్టి మృత్యువును దీసివేయుటచే సంభవించునట్లు కనుపించుచున్నది. కాబట్టి భౌతికప్రపంచములో సమస్తజన్మలను దొలగించుటచేఁగలుగుచున్నదని తలచబడుచున్నది. జడశూన్యమైన యేదోలోకమందు శరీరరహితమైన యేదోస్వర్గమందమృతత్వమునకు సాధ్యముకలదనఁబడుచున్నది. కాని యమృతత్వమునునహింతము దాటిపోగలవారు సమస్తలోకములు స్వర్గములంతముగల స్థితివిశేషములనియు ననంతాత్మ కివన్నియు లేవని తలచుచున్నారు. అట్టి వారనంతాతీతత్వమందు లీనమగుట యావశ్యకమనుచున్నారు. నిర్గుణుని యానందముతో జీవుని యావిర్భావమందుండు నానందమునుగలుప ననమర్థులై యున్నారు. ఇట్టి నిమజ్జనలీనత్వముల యావశ్యకతనుబోధించు వేదాంతశాస్త్రములఁ గనిపెట్టిరి. కాని నిజమునకు ముఖ్యతీర్మానమేమనగా నతీతునిపిలుపు. జీవునియావశ్యకత. ఈవిషయములో నిర్గుణస్థితియందు స్థితిశూన్యమందు జీవునియానందము. తీర్మానించునదేదనగా బురుషుని యానందము. ప్రకృతితో నతడేర్పరుచుకొనుట కిచ్చగించిన

సంబంధము. తన స్వభావమందున్న వివిధసాధ్యములందు తన స్వక్రియానుభవ వృద్ధికొఱకు నవలంబించిన పద్ధతియొక్క ఫలముగాఁ బొందు ననుభవము. మన తెలివిచే నిర్ణయించు తీర్మానములన్నియు నీయనుభవవిషయములే. జీవాత్మ త్రొక్కుచున్న మార్గమునకు మన మానసమును దిద్దుపాటకేర్పడిన సహకారులైనప్రక్రియలే.

మన ప్రపంచస్థితికిఁ గారణము మన ప్రస్తుతానుభవమును బట్టి నమ్ముచున్న యహంకారముకాదు. అహంకారము మన ప్రపంచస్థితివిధాన సంజనితవిషయమే యగుచున్నది. అది బహుజీవాత్మకమైనపురుషుఁడు వ్యష్టిమానసదేహముల కొకదానితో నొకటి కేర్పరచిన సంబంధము. తమ్మెదాఁగాపాడుకొని పరస్పరభిన్నత్వము నిలుపుకొనుటకీ సంబంధమేర్పడినది. ప్రపంచవస్తువు లొకదానిపై నొకటి యాధారపడియుండగా మానస స్థూలస్వతంత్రానుభవమునకై యీసంబంధమేర్పడినది. కాని పరిపూర్ణస్వాతంత్ర్య మీలోకములో నుండఁజాలదు. మానస స్థూలావిర్భావమును నిరాకరించునట్టి నిర్గుణత్వ మీప్రత్యేకవిధానమునకు సాధ్యపడునట్టి పరిపూర్ణత్వము. అందువలన పరిపూర్ణస్వాతంత్ర్యస్వానుభవము పొందఁబడును. అప్పుడు జీవాత్మ తనలోఁ దాపరిపూర్ణస్వాతంత్ర్యముకలిగియున్నట్లు కనుపించును. "స్వాధీనము" హిందూ శబ్దార్థాను గుణ్యమైనస్వేచ్ఛత కలిగియుండును. తనకుఁ దానాధారమై దేవునిపై గాని యితరభూతములపైఁగాని యాధారపడదు. కాబట్టి యీయనుభవమందు దేవుఁడు, సగుణాత్మ, యితరభూతములు, నిరాకరింపబడి యజ్ఞానజనితభేదములని త్రోసివేయఁబడుచున్నవి తన యసంపూర్తిని గ్రహించి తన్నుఁదనకు విరుద్ధమైనవానిని నాశనమొందించి తనకు ముఖ్యముగా స్వతసిద్ధమైన స్వతంత్రస్వక్రియానుభవ సంసి

ద్ధిగాంచునది యహంకారమే. ఏలననగా దేవునితో నితరములతో సంబంధముంచుకొని యట్టి సంసిద్ధినొందుటకుఁ దానుచేయు ప్రయత్నమందు భ్రిమశూన్యము డంబము చిక్కఁకలదని తెలుసుకొనుచున్నది. కాబట్టి యది వానిని యంగీకరించకున్నది. అంగీకరించిన తాను వానిపై యాధారపడవలసివచ్చును. తాస్థిరముగానుండుటకుసహిత మంగీకరించదు. అహంకారము స్థిరముగానుండుటయనగా నాత్మకాదని తాను నిరాకరించుదానిని యీబ్రహ్మాండమును నితరభూతముల నంగీకరించుటే. బౌద్ధుల యాత్మవినాశము మానసపురుషునకు దోఁచునట్టి సర్వమును బూర్తిగాఁ దొలగించుటే. అద్వైతుల పరిపూర్ణమంచాత్మ నిమజ్జనము మరియొకవిధముగా గ్రహింపఁబడిన యీయభిప్రాయమే. ఈరెండుమతములు జీవాత్మకుఁ బ్రకృతివిలక్షణమైన స్వాతంత్ర్యమున్నదని దృఢపరుచుచున్నవి.

వైతొలగుటయని మనమువర్ణించిన యొకవిధమైన సమీపమార్గమువలన మనకువచ్చెడి యనుభవ మీమనోవృత్తికి సహాయమాచున్నది. అది యహంకారమును పగులఁగొట్టుట. ప్రస్తుతము మనకుగల మానసికనైసర్గికముల నిరాకరించుట. మనకు ప్రస్తుతమున్న మానసికనైసర్గికము జడమునకు స్థూలేంద్రియములకు వశమై వస్తువులరూపములుగాను విషయములుగాను బహిరాకారములుగాను మనమారూపములకిచ్చిన నామములుగాను భావించుచున్నది. ఇతరభూతముల కర్తరిజీవితము (Subjective life) ప్రత్యక్షమున మనకుఁ దెలియుటలేదు. మనజీవితముతో పోల్చుకొనుటవలననో వానిభాషపై కార్యములపై బహిరంగచిహ్నములపై నాధారపడి మన కర్తరిజీవితానుగుణ్యముగా మానసముచేఁ గల్పింపఁబడెడి యనుభవసిద్ధ తీర్మానమువలననో తెలుసుకొనుచున్నాము.

మన మహంకారమునుచ్ఛేదించి స్థూలమానసమును త్యజించి యాత్మా నంతత్వమందుఁ బ్రవేశించినను బ్రపంచమును వెనుకటి వాడుక చొప్పున నామరూపములుగానే చూచుచుందుము. ప్రత్యక్ష యుక్తమాత్రయొక్క మన నూతనానుభవమందు మాత్రమే ప్రత్యక్ష కర్మణి సత్యమును (objective reality) మానసముచేఁ గల్పింపఁ బడిన యాయపరోక్ష కర్తరి సత్యత్వమును విడుచుచున్నాము మన మిప్పుడనుభవించు నిజసత్యమునకుఁ గేవలవిరుద్ధముగా నవి కాన్పించును. మన మానసికత్వము ప్రశాంత మొంది శ్రద్ధలేనిదై యామధ్యనున్న విషయములఁ దెలుసుకొనుటకుగాని సత్యములని నమ్ముటకుగాని ప్రయత్నముచేయదు. ఈమధ్యవిషయములు మనలోవలెనే ప్రపంచ వస్తుసముదాయమందు సహితముకలవు. వానిని దెలుసుకొనుట యాత్మకును ప్రపంచవైచిత్ర్యమునకును గల యంతరాయమును కలుపుటకుఁ బనికివచ్చును. స్వచ్ఛమైన విజ్ఞానస్థితియొక్క యనంతనిర్గుణానందముతో దృప్తిఁ జెందితిమి. ఇతరమేదియు మనకవసరమని తోచుటలేదు. స్థూలేంద్రియములు మనకు దేనిఁ దోపింపఁ జేయునో మానసము వానినేదిగా భావించి తత్కాలమున కసంపూర్తిగా నానందించుచున్నదో యదియసత్యమని ప్రయోజనశూన్యమని మనకిప్పుడు కాన్పించుచున్నది. ఆమధ్యతత్వముల మనము పొందనిత్సగించుటలేదు కాని తద్ద్వారముననే యద్వితీయుఁ డిందానదించుచున్నాఁడు. అతనియానందమే యీ బ్రహ్మాండమును సుందరమైన యావిర్భావముగా నెన్నఁబడుచున్నది. ఆమధ్యతత్వముల నిరాకరించుటచే విశ్వమందుఁబొందుచున్న యానందములోఁ బాలుగొనఁ జాలకున్నాము. అంతేగాక యనంతుఁడు తన నిర్మలత్వములోనికి జడమును స్వీకరించుటచేఁ బడిపోయినాఁడనియు, వ్యర్థమైన నామరూపముల భావించుటచేఁ దన నిజతత్వమం దసత్యారోపణము జేసుకొ

నెననియు మనకుఁ గాన్పించుచున్నది. ఒకవేళ మనమాయానందము ను గ్రహింపఁగలిగినయడల దూరస్థమైన ప్రత్యేకత్వమువల్ల భావింపఁగలము. అట్టి ప్రత్యేకత్వము మనల యానందములో ననత వశీకరణముతోఁ బాలుగొననియ్యదు. అంతర్గతమైన ప్రత్యేకాత్మానుభవజనిత యుత్తమానందముందుఁగల యాకర్షణచే నీబ్రహ్మాండమందెంత పాలుగొననగునో యంత పాలుగొనుచున్నాఁడు. అట్టి యాత్మానుభవము స్థూల దేహప్రాణము లెంతవరకు మనల బలవంతముపై నుండనిచ్చునో యంతకంటె యెక్కువకాల మీయధోస్థితుల యందుండనివ్వదు.

మన యోగాభ్యాసమందైనను లేక మన ముక్తాత్మ ప్రపంచములోనికితిరిగి స్వేచ్ఛతోవచ్చుటకు ఫలముగానైనను మనలోని పురుషుఁడు తన ప్రకృతిస్వేచ్ఛతోఁ దిరిగి స్వాధీనమొందుటకు ఫలముగానైనను శరీరములను శరీరబహిరంగవ్యాపారములను దెలుసుకొనుటేగాక వాని యంతరస్థితిని మానసములను జీవులనుదెలుసుకొనినయెడల మనమప్పుడు వానియందు నిజపురుషునిసహితము చూడఁగలము. మన యాత్మయొక్క యాత్మలుగా నెంతుమేగాని నామరూపమాత్రములుగా భావింపము. మనకవి యనంతుని సత్యములై కానుపించును. మనమానసముల కసత్యజనితభ్రమలుండవు. అల్పార్థతవల్లపుట్టి నభ్రమలుండవు. ఈస్థూలజీవితము తన ప్రాత విలువల విడుచుచున్నది. దివ్యపురుషునికొఱకుఁ దనకున్న గొప్పవిలువను కనిపెట్టుచున్నది. స్థూలజీవితము మన యావిర్భావమునకు ముఖ్యమని తలచఁబడక మనోప్రాణములకు సంబంధించిన కొంచపాటివిలువలు దానికున్నవని తలచఁబడినప్పుడిది యీలోపమువలన దనవిలువ పోగొట్టుకొనుటకు మారుగా వృద్ధిఁజెందుచున్నది. మన

స్థూలస్థితి ప్రాణము స్వభావము పురుషునకుఁ బ్రకృతితోఁగల సంబంధమువలన నేర్పడిన యొకనిలకడమాత్రమే యనఁబడుచున్నది. వాని నిజప్రయోజనము లాధిక్యతలు వానినిబట్టిగాక వానికాధార భూతములైన యుత్తమస్థితులపై నిలిచియున్నవనుకొనినప్పుడు తెలియఁబడుచున్నవి. ఆయుత్తమసంబంధములఁబట్టి వానియర్థములుండును. కాబట్టి వ్యక్తితో నాయుత్తమసంబంధములతో నైక్యమొంది తమ సర్వసంకల్పముల సంసిద్ధినొందించుచున్నవి. జీవితము సరియైనదని యప్పుడు మనకుఁ దోచగలదు. ముక్తిగాంచిన యాత్మానుభవప్రాప్తికది విరుద్ధమని తోచఁబడదు.

ఈవిపులమైన పరిపూర్ణజ్ఞానము తుదకుముక్తినిచ్చిమనసమస్తస్థితికి సంసిద్ధి కలిగించుచున్నది. మనకాజ్ఞానమొందినప్పుడు దేవుడు మనము ప్రపంచమను మూఁడువిషయములమధ్య మనజీవిత మేలవర్తించుచున్నదో తెలియఁబడును. అవి మనకింక విరుద్ధములు పరస్పరభేదములు యసంబద్ధస్వభావములుగాఁ గనుపించవు. తుదకు శుద్ధనిర్గుణయేకత్వమందు లయమగు నజ్ఞానవిషయములని మనమెన్నడు తలచము. మన యాత్మసంసిద్ధికవి యావశ్యకములని మనము గ్రహింతుము. ముక్తి నొందినతరువాతసహిత మాయాత్మసంసిద్ధి వానివిలువల నిలుపుచున్నది. లేక వాని నిజమైనవిలువలనప్పుడు కనిపెట్టుచున్నది. మన ప్రపంచానుభవ మితరస్థితులతో మన సంబంధములచే నేర్పడుచున్నదిగాన మన స్థితి యితరుల స్థితికంటె వేరను యనుభవము మనకికనుండదు. ఈనూతనవ్యక్తియందా స్థితులన్ని మనలోనుందురు. మనము వానిలోనుందుము. అవియు మనము ప్రత్యేకసంసిద్ధికై యాత్మాతీతత్వముకై పాటుపడుచు చివరకొక్క యుద్దేశ్యములేని భిన్నరూపములైన యహంకారజీవులము కాము.

అవన్నియు నిత్యుఁడే. ప్రతిదానిలోనియాత్మ తనలో రహస్యముగా సర్వము నాలింగన మొనరించుచున్నది. తన యేకత్వసత్యమును తన ప్రపంచస్థితియందుఁ గనుపరుచుటకుఁ బలువిధముల బ్రయత్నించు చున్నది. మనవ్యష్ట్యత్వముయొక్క దివ్యతత్వము పరస్పర ప్రత్యేకత్వము కాదు. పరస్పరసమ్మేళనత్వము. ఉత్తమధర్మము ప్రేమకాని ప్రత్యేకయాత్మ సంసిద్ధి కాదు.

మన నిజస్వరూపమైనపురుషుఁడు సదా స్వతంత్రుఁడు. ప్రకృతికధికారి. మన మీస్వాతంత్ర్య మొందుటకు సరియైన ప్రయత్నము చేయుచున్నాము. అహంకార విధానముయొక్కయు (egoistic movement) దాని నధిగమించుటయొక్కయు నుపయోగమిది. కాని దానిసరియైన సంసిద్ధి యహంకారవిషయమైన ప్రత్యేకత్వమును బరిపూర్ణ మొనరించుట కాదు. పురుషునకు బ్రకృతితోఁ గల యీయుత్తమస్థితి మొందుట. అచ్చట స్వభావమతిక్రమింపఁబడుచున్నది. కాని స్వభావము వశము చేసుకొనఁబడుచున్నది. మన వ్యష్టి పరిపూర్ణసంసిద్ధి నొందుచున్నది. విశ్వముతో నితరులతో నుండు మన సంబంధముల పరిపూర్ణసంసిద్ధిసహిత మచ్చట కలుగుచున్నది. కాబట్టి విశ్వమే మైపోయినపోనీ పైస్వర్గములందు వ్యష్టిముక్తి నొందుట మనకుత్తమయుద్దేశ్యము కాదు. ఇతరుల ముక్తియు వారి యాత్మసిద్ధియు మనకు సంబంధించినవే. మనముక్తి యట్టిదో యటిదే యనవచ్చును. అట్లుగాకున్నఁ బరులతో మన యైక్యైకరద్ధముండదు. ఈప్రపంచమునహంకార స్థిత్యాకర్షణం జయించుట మన మొందు మొదటివిజయము. పైస్వర్గములందు వ్యష్టి భోగాకర్ష

తుది మహాజవియము. అప్పుడే మానము వ్యష్టిప్రత్యేకత్వమును బొరం దరిమితిమి. పూర్ణవిజ్ఞానస్వాతంత్ర్యమును బొందితిమి.

ముక్తజీవునిస్థితి యెట్టిదనగా నెల్లప్పుడు స్వతంత్రుడైన పురుషునిస్థితివంటిది. ఆజీవుని జ్ఞానమతీతము. సర్వజ్ఞత్వముగల యైక్యము. అతనియాత్మజ్ఞాన మట్టియాత్మజ్ఞానమునకు సంబంధించినవిషయములం దోసిపుచ్చునదికాదు. అది సమస్తవస్తువులను దేవుని యందు దివ్యస్వభావమందు సమ్మేళనమొనరించి సమన్వయము చేయునది తీవ్రమైన మతపరవశము దేవుని మనలమాత్రమే తెలుసుకొనుచున్నది. ఇతరమును దోసివేయుచున్నది. అట్టి పరవశము భూతములందుండు దివ్యప్రేమానందాశ్లేషమందుం బాలుగొనుటకతనిం దయారుచేయుచున్నది. దేవుని మనల సదుష్టవంతులం గలుపు గొప్ప యానందమదృష్టహీనుల వారికష్టములగురించి యశ్రద్ధ చేయించినయడల యట్టి యానందము పరిపూర్ణజీవునకు సాధ్యముకాదు. ఈదురాదృష్టులుసహితమాపరిపూర్ణజీవుని యాత్మలే. అజ్ఞాన దుఃఖములనుండి విలక్షణుడుగానయతని విలక్షణత్వములోనికివారిని సహితము లాగుకొనవలెను. అద్వైవిధమున ద్వైతమును దోసిపుచ్చి తనకు నితరములకుం బ్రపంచమునకుగల సంబంధము లంతైక్యమంతమాత్రము సాధ్యపడదు. కాబట్టి ముక్తజీవుడు ప్రపంచమువల్లగాని మనుజునకు మనుజునకు గల సంబంధమువల్లగాని బంధింపంబడడు. అతనిపని యతనిపరిపూర్ణత్వ మితరులకొఱకుం దన్ను నిరాకరించి విసర్జించుకొనుటకాదు. దేవత్వస్వాతంత్ర్య దివ్యానందములందు తన్ను సంసిద్ధి పొందించుకొనుటకు. అట్టి తన సంసిద్ధి యందితరులుసహితము సంసిద్ధినొందవలెనని భావము. దేవునియందే దేవుని పొందుటవలనమాత్రమే జీవితముయొక్క పోరాటములు నశించుచు

న్నవి. దేవుని వైపునకు సమస్తజనుల లేవనెత్తుటే మనుష్యజాతికి ముఖ్యముగా సహాయముచేయుట యనఁబడుచున్నది. సమస్తమైనపనులకు మన యాత్మానుభవములకు బలప్రయోజనములుకలవు. కాని చివరకాపరీక్షదార్ఢ్య, ఏయేకాకిమార్గము తిరిగి తిరిగి ముక్తజీవుఁడు దేనివలన సర్వమున కతీతుఁడగుచున్నాఁడో, సర్వము నాశ్లేషించుచున్నాఁడో, యీశ్వరుని యావిర్భావస్థితియందు సమస్తసంసిద్ధియొక్కశక్తిని పొందుచున్నాఁడో యట్టి పరిపూర్ణమార్గ విపులత్వమునందుఁ బరివేచుచున్నవి.




31 అధ్యాయము.

## మనలోకములు.

మనలోనిపురుషుఁడు, జ్ఞాతప్రభువు ప్రకృతియొక్క భోక్త యనఁబడు దివ్యపురుషునితో నావిధమున నైక్యమొందవలసినయెడల నీలోకమందు నివసించుటచే నది సంభవించదనుట స్పష్టము. కారణమేమనగా మనము ప్రస్తుతమునివసించునది స్థూలలోకము. దానియందు ప్రకృతిప్రభుత్వము పూర్తిగానున్నది. అచ్చట దివ్యపురుషుఁడు ప్రకృతికార్యకల్లోలాంధకారమునదాని కార్యాడంబరమున పూర్తిగా మాటుపడినాఁడు. జడమందాత్మను బ్రకృతి చుట్టివేయునపుడావిర్భవించు (Involution) వ్యష్టిజీవుఁడు దాని కార్యనిర్వాహకమందు స్థూల ప్రాణోపకరణములకు లోనై దివ్యస్వాతంత్ర్య మనుభవించలేకున్నాఁడు. అధికారమని స్వాతంత్ర్యమని యతఁడనుకొనుచున్నది ప్రకృతిమానసముపొందిన సూక్ష్మవశీకరణమే. జంతువృక్షలోహములనఁబడు స్థూల ప్రాణవస్తువులకు వశమగుటకన్న నీవశీకరణము విమోచనకు సామీప్యముకలదై సులువైనది.

కాని నిజమైన స్వాతంత్ర్యాధికార మదికాదు. కాబట్టి మనవ్యక్తికి వివిధలోకములున్నవనియు మానసపురుషునకు విజ్ఞానలోకము లున్నవనియుఁ జెప్పవలసివచ్చెను. ఇవియే లేకపోయినయెడల శరీరధారియైనవానికి విమోచనమీలోకమందు సాధ్యపడదు. నాఁడు వేచియుండి యితరలోకములందు వేరువిధమై స్థూలోపాధికన్న సూక్ష్మమైన విజ్ఞానశరీరమందు ముక్తి సాధించవలసియుండును.

సాధారణమైన జ్ఞానయోగమున విజ్ఞానలోకమని స్థూలరూపమొందెన మానసికలోకమని రెండులోకములు మాత్రమే యంగీకరించుట ముఖ్యము. శుద్ధవివేచన (reason) యీ రెండులోకములమధ్య నిలిచి రెంటిని వీక్షించుచున్నది. స్థూలప్రపంచ వైచిత్ర్యమందుఁగల భ్రమలఁ దెంచి స్థూలరూపమొందిన మానసలోకమునతిక్రమించి విజ్ఞానముయొక్క సత్యత్వమును జూచుచున్నది. అంతట వ్యష్టిపురుషునిచిత్త మీజ్ఞానస్థితిలో నైక్యమొంది క్రిందిలోకమును విడిచి యుత్తమలోకములోనికిఁ జెరుచున్నది. అచ్చటనినసించి శరీరమానసములవిడిచి ప్రాణమును త్రోసివేసి యుత్తమపురుషునందైక్యమై వ్యష్టిస్థితిని బాయుచున్నది. మనస్థితియొక్క సంపూర్ణసత్యమిదికాదని తెలుసుకొనుచున్నది. విశేషబహుళత్వము కలదని గ్రహించుచున్నది. అనేక లోకములున్నవని తెలుసుకొనుచున్నది. కాని వానినది లక్ష్యపెట్టదు. ఈముక్తికవి యంతముఖ్యముకానందున వానినిగురించి స్వల్పశ్రద్ధయైన వహించదు. దానినవి చెడఁగొట్టుచున్నవి. అలోకములందు నివసించిన నూతన మనోహరమానసికానుభవములు మానసభోగములు మానససిద్ధులు కలుగుచున్నవి. వైచిత్ర్యముయొక్క వ్యక్తిగల నూతనలోకము సంభవించును. దానిననృేషించిన బ్రహ్మమందైక్యమున కభ్యంతరములు కలిగించును.

దైవమును జేరుట కేర్పడిన రాజమార్గమునకు పలువిధములైన ప్రక్కదార్లేర్పడును. కాని ప్రపంచస్థితిని మన మంగీకరించుచున్నాము. మనకన్ని లోకములు బ్రహ్మమే. దేవునితో నిండియున్నవే. కాబట్టి యీలోకములలో నెట్టిభయములు లేవు. విఘాతమొనరించు నెట్టి ప్రమాదమున్నను దానిని యెదిరించి జయించవలెను. ప్రపంచము మనస్థితిబహుళత్వమై యుండెనేని మన మాబహుళత్వములను స్వీకరించినకాని మన యాత్మజ్ఞానము, పురుషప్రకృతులకుగల సంబంధముల జ్ఞానము పూర్తికానేరదు. అనేకలోకములున్నయెడల మన యీ స్థూల ప్రాణ మానసముల నెట్లు విజ్ఞానమందుఁబొందిమార్చుటకుఁ బ్రయత్నించుచున్నామో యట్లే దైవము కొఱకు వానినన్నిటిని మనము పొందవలసినదే.

ప్రాచీనజ్ఞానము సర్వదేశములందు మనలో దాగియున్న సత్యముల వెతుకుచుండునది. ఐరోపాదేశమందు రహస్యవిద్య (Occultism) యనుపేరుతో విశేషముగా నభ్యసింపఁబడుచున్నది. మనదేశమందిట్టిపేరు పెట్టలేదు. ఈవిషయములు పాశ్చాత్యులకుఁ దోచినంతరహస్యములుగా మనకుఁ గనుపించలేదు. మనకివి సమీపస్థమైయున్నవి. స్థూలజీవితమునకు నావిపులజీవితమునకును మధ్యనున్న తెర మనకుఁ బలుచనై యున్నది. ఇండియా, యీజిప్టు, ఛాల్డియా, చైనా, గ్రీసు దేశములందు దానికి వివిధ యోగవిధానములేర్పడి సర్వత్ర నభ్యసింపఁబడినది. వాని యనుభవములు విషయములు సత్యములేయైనను, వానిధర్మములు ప్రపంచానుభవధర్మములవంటివేయైనను యాధునికమానసమునకు ఛాందసములుగా నగమ్యములుగాఁ గనుపించును. ఇచ్చట యనంతమైన కష్టములతో నిండిన యీమానసజ్ఞానమునుగురించి వ్రాయుట మాయుద్దేశ్యము

కాదు. విజ్ఞానవేదాంతవిషయముల గ్రహించకముందు వీనిని సమీపించిన ప్రమాదమున్నది. ఆవిద్యకు ముఖ్యమైన కొన్ని ముఖ్యాంశములమాత్రమే యిచ్చట దెల్పుట యావశ్యకము. వానిఁ దెలుపకున్న మన జ్ఞానయోగము పూర్తికాదు. వివిధవిధానములందుఁ జెప్పఁబడిన విషయములన్నియు నొక్కటే. సిద్ధాంతమందు నభ్యాసవిధానమందు మాత్రము భేదమున్నది ఇంతకష్టమైన పెద్దవిషయమున నట్లుండుట సహజము. ఒకదానియందు విడిచిపెట్టఁబడిన కొన్ని విషయములు మఱియొకదానియందు ముఖ్యములగుచున్నవి. ఒకదానియందుఁ దేల్చివేసినవిషయములు మఱియొకదానియందొత్తి చెప్పఁబడినవి. కొన్ని యనుభవవిధానము లొక యభ్యాసమందు స్వల్పప్రాముఖ్యతతో వర్ణింపఁబడినవి. మఱియొక యభ్యాసమందు వానికి విశేషప్రాముఖ్యత కల్పింపఁబడినది. కాని నేనుమట్టుకిచ్చట యుపనిషత్తులచే నిరూపింపఁబడిన వేదవేదాంతవిధానముల ననుసరించెదను. కారణమేమన నవి బహుసులభమై శాస్త్రసమ్మతమై యున్నవని నాయభిప్రాయము. అంతేగాక మొదటినుండి ముక్తికి వివిధలోకముల యుపయోగము వర్ణింపఁబడియున్నది. ఈవేదసమ్మతమైన విధానము, మన సర్వసాధారణస్థితియందున్న మనః ప్రాణ జడముల సచ్చిదానందుని త్రివిధతత్వముల నీరెంటినికలుపునట్టి స్వాంతర్జ్ఞానశక్తియైన విజ్ఞానమనఁబడు నూర్ధ్వమానసమున (super-mind) గ్రహించి సప్తలోకములక్రింద విభాగించుచున్నది. కొన్నివేళలఁ బంచలోకములనే చెప్పుచున్నారు. క్రిందియైదులోకములే మనము పొందుటకు వీలుకలదు. వృద్ధిజెందుచున్న జీవుఁడీ యేడులోకముల ద్వారా పరిపూర్ణత్వ మొందుచున్నాఁడు.

కాని మొదట మనము లోకములనగా నేమో తెలుసుకొనవలెను. పురుషప్రకృతుల సంబంధము జీవస్వభావసంబంధము స్థిరప

డిన సర్వసాధారణస్థిమితమే లోకము. సర్వవ్యాపకస్థితి తనలోఁ దా నేర్పఱుచుకొనిన సర్వసాధారణ సంబంధవ్యాపారముకంటె లోకమనునది వేఱుకాదు. అనగా దాని నిత్యత్వమనఁబడు యచలత్వమునకును దాని యావిర్భావశక్తులకును గల సంబంధమే లోకము. ఆవిర్భావముతో సంబంధానుభవములుగల స్థితియే జీవుఁడు. పురుషుఁడనఁబడుచున్నాఁడు. ప్రత్యేకమనుజునందు వ్యష్టిజీవుఁడు బ్రహ్మాండమందు సర్వవ్యాపకజీవుఁడు కలఁడు. ఆవిర్భవించుశక్తులే స్వభావము ప్రకృతియనఁబడుచున్నవి. స్థితినిర్మాణలక్షణములు సత్, చిత్, ఆనందములుగనుక లోకము యొక్క స్వభావము ప్రకృతి యీమూఁడుతత్త్వములతోఁ బనిచేయుటఁబట్టియు, వానికది యిచ్చురూపముల బట్టియు నుండును. కారణమేమనగా స్థితిసహితమావిర్భవించు పదార్థమే. శక్తిపనిచేయుటకు వీలైన పదార్థరూపమును స్థితిపొందవలెను. శక్తి యాపదార్థముతోఁ బనిచేయుబలమే. ఆపదార్థములతోఁ దన కార్యముల నెరవేర్చుచున్నది. శక్తినే మనము సాధారణము స్వభావమని పిలుచుచున్నాము. ఈలోకముల సృజించుటకుఁ బ్రయోజనము సర్వస్థితి శక్తివ్యాపారముల యంతర్గతమైయున్న జ్ఞానముచే నెరవేర్పఁబడవలసి యున్నది. ఆప్రయోజనము తన్నుఁ దాబొందుటే. లోకమందు స్థితి జనితానందమొందుటే. సర్వవిషయములు సర్వలోకస్థితి ప్రయోజనము దీనికిందికి రావలసినదే. అది సచ్చిదానందముల వృద్ధిజేయుచున్న స్థితి. ఈతత్త్వము లంతర్గతమైన (involved) వాని పరిణామమే (evolution). అవి మఱుగుపడిన తమంతట తామువెల్లడగుటే.

ఇచ్చట జీవుఁడు భౌతికప్రపంచమందు నివసించుచున్నాఁడు. అట్టి భౌతికప్రపంచమునే తెలుసుకొనుచున్నాఁడు. ఆవిశ్వమందు

తన యాంతర్గతశక్తులం దెలుసుకొనుటే వానికి సంబంధించిన సమస్య
మైయున్నది. జడమనగా నవ్యక్తమైన స్వశక్తియందు స్వయం విచ్ఛి
న్నమైన పదార్థరూపమందు జ్ఞానానందస్థితి పరివృత్తినొందుటే. కా
బట్టి భౌతికప్రపంచముయొక్క ప్రయత్నమంతయు బరివృత్తిచెంది
న దానిని నివృత్తినొందించుటే. వృద్ధికానివానిని వృద్ధిచేయుటే.
మొదటినుండి యీలోకములో సమస్తము బలముగాం బనిచేయు
చున్న జడశక్తియొక్క యవ్యక్తనిద్రయందు మునిగియున్నది. కాబ
ట్టి సమస్త భౌతికావిర్భావోద్దేశ మవ్యక్తమునుండి జ్ఞానమును మేలు
కొలుపుట. స్థూలావిర్భావ పరిపూర్ణత్వమేమనగా జడముపైనున్న
ముసుకు తొలగించుట. ఆవిర్భావమందు బంధింపంబడిన జీవునకు
నాత్మజ్ఞానపురుషుని వెల్లడించుట. మనుజుండిట్లు బంధింపంబడిన జీవు
డు గనుక నీప్రకాశమాన మైనముక్తి, యీయాత్మజ్ఞానసంప్రాప్తి తన
మహోన్నతప్రయోజనమై తన పరిపూర్ణత్వమై యుండవలెను.

కాని స్థూలదేహమం దుత్పన్నమైన మానసస్థితికి ముఖ్యో
ద్దేశమైన యీప్రయోజనము సంసిద్ధినొందుటకు భౌతిక ప్రపంచ
బంధములడ్డుగానున్నవి. ఇచ్చట ముఖ్యముగా స్థితి జడముగా నేర్ప
డినది. వస్తువుగా జేయంబడినది. స్వయముగా ననుభవించు తన జ్ఞాన
శక్తికి స్వయముగా భిన్నమౌచున్న స్థూలపదార్థరూపమందు ప్రత్య
క్షమున గోచరింపంజేసినది. ఈజడాధిక్యము వలన మనుష్యునకు ప్ర
త్యేక స్థూలదేహము నిర్మింపంబడినది. ఈదేహము వేరై స్వస్థిలేని
భౌతికస్వభావధర్మములకు లోనైయున్నది. అతని భవ్యశక్తిసహిత
ము జడనుందు పనిచేయుచున్న స్వభావమే యగుచున్నది. అది నె
మ్మదిగా నవ్యక్తములోనుండి మేలుకొని ప్రాణమైనది. సదా రూప
ముచే బంధింపంబడినది. దేహముపై నాధారపడియున్నది. తక్కిన

ప్రాణముకంటె నితరభూతములకంటె వేరుపడియున్నది. అవ్యక్తధర్మముచేతను శరీరధర్మముచేతను యాత్మ పరిపూర్ణత్వమునకు వృద్ధికి భంగకరముగా నున్నది. అదేవిధమున నతనివ్యక్తి శరీరముందును, సంపూర్ణముగా వ్యాప్తినొందిన ప్రాణముందు నుద్భవించిన మానసమాచున్నది. కాబట్టి దాని వ్యాపారసామర్థ్యములు హద్దులలోనున్నవి. ఆధిక్యతలేని శరీరావయములపై నమ్ముకొనియున్నది. స్వల్పమైన ప్రాణశక్తిపై యాధారపడియున్నది. అది తక్కిన విశ్వమానసమునుండి విడతీయఁబడి యితరమనుజుల భావములకు దూరమైయున్నది. ఇతరమనుజుల స్థూలమానసము దీని కగోచరమైయున్నది. వారి శరీరలక్షణములఁబట్టి వారుచేయు గుర్తులఁబట్టి తనమనస్సుననుసరించి తెలియఁజాలినంతమట్టుకే తెలుసుకొనుచున్నది. అతనివ్యక్తి సదా దేనియందు దాని యెక్కువభాగ మంతర్గతమైయున్నదో యట్టి యవ్యక్తములోనికి తిరిగి పడిపోవుచున్నది. అతనిప్రాణము మరణములోనికి తిరిగి పడిపోవుచున్నది. అతని స్థూలస్థితి భిన్నత్వములోఁ బడుచున్నది. అతనియానందము స్థూలేంద్రియములకు నింద్రియమానసమునకు మూలమైన చుట్టుయావరణముతో నీయసంపూర్ణవ్యక్తి గల సంబంధములపై నాధారపడియున్నది. అనగా నతని యానందము హద్దులలోఁ బనిచేయు శరీర ప్రాణావయవములతోఁ దనకు వెలియైన ప్రపంచమును వశపరుచుకొనుటకు ప్రయత్నించుచున్న మానసముపై యాధారపడియున్నది. కాబట్టి దాని వశీకరణశక్తి హద్దులలోనున్నది. దాని యానందశక్తి హద్దులలోనున్నది. దానికిగల శక్తిని మించినట్టియు దానిశక్తి సహించలేనట్టియు గ్రహింపఁజాలనట్టియు, భరించలేనట్టియు ప్రపంచముయొక్క ప్రతి సంబంధము బాధగా దుఃఖముగా నానందవ్యతిరేకముగా మారుచున్నది కాబట్టి దానిని భరించుట, స్వీకరించకపోవుటచేతనో, స్వీకరించినయెడల

నిరాకరించి పారదరుముటచేతనో కలుగుచున్నది. అంతేగాక దాని యందుఁగల స్థిత్యానందము సచ్చిదానందుని యాత్మానందమువలె నిత్యము పొందఁబడునదికాదు. అది కాలానుగుణ్యముగ ననుభవ స్వయంకృషులచే సంప్రాప్తమగుచున్నది. కాబట్టి మరలమరల నను భవించుటచేతనే నిలుపబడి దీర్ఘకాల ముంచఁబడుచున్నది. స్వభావ ముచే నిది నిత్యముకాదు.

దీనికంత కర్థమేమనగా జడవిశ్వమందుఁ బ్రకృతితోఁ బురు షునకుగల సంబంధములు, జ్ఞానపురుషుఁడు తన కార్యకరణమునకు జెందిన శక్తులలోఁ బూర్తిగా నిమగ్నుఁడగుటే. కాబట్టి యది పు రుషుని స్వకీయమైన పరిపూర్ణావ్యక్తము. స్వకీయమైన పరిపూర్ణా జ్ఞానము. ప్రకృతియొక్క పరిపూర్ణాధికారము. జీవుఁడు పూర్తిగా స్వభావమునకు లోఁబడుటే. జీవుఁడు తన్నుఁదా నెరుగఁడు. ప్రకృతి కార్యమును మాత్రమే తెలుసుకొనుచున్నాఁడు. మనుజునందు వ్యక్తి తో నావిర్భవించుచున్న జీవుఁడు తనకుఁదా నీయజ్ఞానసంబంధములఁ త్యజింపఁజాలఁడు. కారణమేమనగా నీజీవుఁడు భౌతికలోకమందు నివసించుచున్నాఁడు. అదియొక ప్రకృతిస్థిమితము. దానియందు జ డము ముఖ్యముగా నధికారము వహించియున్నది. వానిజ్ఞానము జ డముచే బంధింపఁబడినందున పూర్తిగా స్వతస్సిద్ధమైన జ్ఞానముకాదు. బ్రహ్మాండ జీవాత్మసహితము భౌతికధర్మముచే బంధింపఁబడెనేని పూర్తిగా నాత్మస్వాధీనము కలిగియుండదు. తన ప్రాణానందజ్ఞాన ము లెద్దానిపై నాధారపడుచున్నవో యట్టి యితర శరీర మానస ప్రాణబంధములే ముఖ్యమగు వ్యష్టిజీవున కాస్వాధీనము మరింత తగ్గి యుండును. ఈశక్తి ప్రాణానంద జ్ఞానబంధములే (Limitation) మనుష్యునకు విశ్వమందసంతుష్టికిఁగారణములు. భౌతికవిశ్వమే యీ

భౌతికలోకమేతప్ప వేరులోకము లేకున్న వ్యష్టిపురుషునకుఁ బరిపూర్ణత్వముగాని యాత్మసంసిద్ధిగాని కలుగనేరదు. జంతుజీవితముకంటె వేరుజీవితముండనేరదు. పురుషప్రకృతులకుంఁడు నీయసంపూర్తి యసంతుష్టి సంబంధములనుండి యతఁడు విముక్తిగాంచగల లోకము లుండవలెను. లేదా తనకుఁ బ్రత్యేకలోకములుండి వానిలోఁ బ్రవేశించుటవలన బంధముల కతీతుఁడు కాఁగలిగి యుండవలెను. లేదా యూర్ధ్వలోకములు లోకవాసులుండి వానినుంచి తనజ్ఞానశక్త్యానందములఁ బొందఁగలిగి యుండవలెను. లేకున్న వృద్ధి యసంభవము. ఈవిషయములన్ని కలవని ప్రాచీనజ్ఞానము చెప్పుచున్నది. ఇతర లోకము లూర్ధ్వలోకములున్నవనియు వాని నారోహింపవచ్చునని యు వానిసంబంధముచే వృద్ధికలుగుచున్నదనియుఁ జెప్పుచున్నది.

పురుషప్రకృతి సంబంధస్థిమితమందు జడాధిక్యతచే భౌతిక లోక మెట్లేర్పడుచున్నదో యట్లే దానికిపైన ప్రాణాధిక్యతచే మఱియొక లోకమేర్పడుచున్నది. అందుజడమున కాధిక్యతలేదు. ప్రాణశక్తికి నధికారమచ్చట యెక్కువ. ఈలోకమందు రూపముల ననుసరించి ప్రాణస్థితులుండవు. అచ్చట రూపమును బ్రాణము నిర్ణయించుచున్నది. కాబట్టి రూపములు భూలోకమందుకన్న నెక్కువ స్వేచ్ఛగాను, ద్రవముగాను విచిత్రముగా మారునవియై యున్నవి. ఈప్రాణశక్తి యవ్యక్తమైన జడశక్తికాదు. దాని హీనస్థితులందుఁ దప్ప భూతములకు సంబంధించిన యంతఃశక్తి (Subconcient) కాదు. అది వ్యక్తిగల శక్తి. నిర్మాణమునకొఱకుఁ బనిచేయుచున్నను, దన ప్రేరేపణాశక్తియొక్క యనుభవముకొఱకు స్వాధీనముకొఱకు సంతుష్టికొఱకు ముఖ్యముగాఁ బనిచేయుచున్నది. ప్రాణమే ముఖ్యమైన యీలోకమందు కోరిక, ప్రేరేపణయొక్క సంతుష్టి ముఖ్య

ధర్మమైయున్నది. భూలోకమందుకన్న నెక్కువ స్వాతంత్ర్య సామర్థ్యములతోఁ బ్రాణశక్తి పనిచేయగల జీవస్వభావముల సంబంధముల స్థిమితమిది. దీనిని కామలోకమనవచ్చును. దాని ముఖ్యలక్షణము కామము (Desire). స్థూలజీవితమువలె నది మార్పులేనియొక సూత్రము ననుసరించునదికాదు. అనేకమార్పు లొందఁగలదు. అంతేగాక స్థూలస్థితినంటి యందు మిళితమైపోవుస్థితి మొదలు స్వచ్ఛమైన యుత్తమ మానసలోకమునకంటి యందుఁ గలిసిపోవుస్థితివరకు వివిధస్థితులుగా విభాగింపఁబడియున్నది. కారణమేమనగా స్వభావమందెగిరి దుముకవలసిన గొప్ప విపులకందకములు గన్పట్టకనుపించవు. ఒకదానిలోనుండి మరియొకదానిలోనికి కరిగిపోవుచున్నవి. సూక్ష్మమైన సంవర్తనము కలదు. అట్టి సంవర్తనమునుండి (Continuity) స్వభావముయొక్క ప్రత్యేకానుభవశక్తి వివిధతరగతుల నేర్పరుచుచున్నది. వానివలన జీవాత్మ తనకుగల సాధ్యముల వివిధలోకములందుఁ బొంది తెలుసుకొనుచున్నది. ఏదోయొక విధమున యనుభవించుటే కామమునకు ముఖ్యాభిప్రాయముగనుక కామలోకమునకది స్వభావమై యుండకఁదప్పదు ఎచ్చట జీవాత్మస్వతంత్రుఁడుకాఁడో కామమునకు వశుఁడై స్వాతంత్ర్యమునొందఁడో యచ్చట విరుద్ధద్వంద్వానుభవములుండును. ఈలోకమందు హస్తములలోఁ బనిచేయు స్థూలమానసమున కసంభవములైదోచు గొప్ప మొదతెగని తీవ్రమైన భోగములుండును. అటులనే మొదతెగని తీవ్రమైన గొప్ప దుఃఖములుసహితముండును. చిరకాలమునుండి మానవులు వేనిని స్మరించి భయమోదము లొందుచున్నారో యట్టి నరకస్వర్గములిందమర్పఁబడియున్నవి. సమస్త మానుషయూహలకు సత్యములైన పోలికలు కొన్ని కలవు. కాని యవి స్థూలరూపములతోఁ గప్పఁబడి యుండుటచే స్థూలాతీతమైన సత్యముల నిజతత్త్వమును బోధించుటలేదు.

స్వభావమొకటితో నొకటి సంబంధములేని యద్భుతములచే రిగగాక బహుళయేకత్వము గనుక యీభూలోకమునకును గామలోకమునకునుమధ్య దాటనైక్యముకాని యంతరాయము లేదు. కానియొకయర్థమందవి యొకదానితోనొకట కలిసియున్నవని చెప్పవచ్చును. లేదా కొంతవరకు నొకదానిపై నొకటి యాధారపడి యున్నవని చెప్పవచ్చును. నిజమునకు భూలోకము ప్రాణమునుండి ప్రసారిత మనవచ్చును. ప్రాణము వెలికిఁద్రోసినట్టియుఁ బ్రాణలోకమున సాధ్యముకాని తనకున్న జడసంబంధమైన కోరికలఁదీర్చుకొనుటకు తనలోనుండి వేరుచేయబడిన లోకమని చెప్పవచ్చును. భూలోకజీవితము జడముపైఁ బ్రాణలోకముయొక్క యొత్తిడివలన గలిగినదని చెప్పవచ్చును. జడమనగా స్థూలప్రపంచముయొక్క యవ్యక్తస్థితి. ఆవిర్భావమొందిన మన ప్రాణమునహితము ప్రాణలోకమం దునికిగల విపులప్రాణముయొక్క పై వికారమగుచున్నది. అట్టి విపులప్రాణస్థితి మూలకమున ప్రాణలోకముతో సంబంధము కలిగియున్నాము. అంతేగాక ప్రాణలోకము సదా మనపైఁ పనిచేయుచున్నది. జడస్థితియందున్న ప్రతివస్తువునకు వెనుక బ్రాణలోకముయొక్క తదనుగుణ్యమైన శక్తులున్నవి. మిక్కిలి మొదటివైన (elementals) భూతలములకు సహితము వెనుక వానిని సంరక్షించుచున్న భూతములు భూతప్రాణశక్తులు కలవు. ప్రాణలోకముయొక్క బలములు సదా జడలోకములోనికిఁ బ్రవహించి ఫలములనిచ్చి శక్తులఁ బుట్టించ్చుచున్నవి. ఆఫలశక్తులు తిరిగి ప్రాణలోకమునుబొంది దానిని మార్చుచున్నవి. ఆలోకమునుండి మన ప్రాణభాగము, కామభాగము, స్పృశింపఁబడుచున్నవి అచ్చటసహితము మంచికోరికలు కలిగి మంచిచేయునట్టియుఁ జెడుకోరికలుకలిగి చెడుచేయునట్టియు శక్తులు కలవు. వానితో మనము సంబంధము పెట్టుకొనకున్నను, వానిని

మన మెరుగకున్న మనతో సంబంధము కలిగియున్నవి. ఈశక్తులు గుడ్డియలవాట్లుగాక జడమున కంచునదప్ప దక్కినచోట్ల నవ్యక్త శక్తులుగాక జ్ఞానముతోఁ బనిచేయుభూతములు. జీవించియున్నశక్తులే. మనకు నూర్ధ్వలోక ప్రబోధ కలిగినప్పుడు మనకవి స్నేహితులుగానో శత్రువులుగానో మనల వశముచేసుకొనునవిగానో మనము వశముచేసుకొని నిర్లక్ష్య పెట్టవలసినవిగానో మనకు వ్యక్తము కాగలవు. మనుజునకుఁ బ్రాణలోకముతోనున్న యీసంబంధమే యైరోపావారి రహస్యవిద్యకు హేతువై మధ్యయుగమున (Middle age) వారికిఁ బనికల్పించినది. పాశ్చమాతుల్య యక్షిణీవిద్యకు మంత్రశాస్త్రమునకిదే పని కలుగఁజేసినది. పూర్వకాలమున ఛాందసము విశేషముండెను. పిచ్చినమ్మకములు విపరీతభావము లుండెడివి. అట్టి ఛాందసమునకు లోనఁ గొంతనిజముకలదు. ముందు శాస్త్రము (Science) జడప్రపంచ పరిశోధనా పరత్వమువిడిచి తిరిగి దీనిని కనిపెట్టవచ్చును. కారణమేమనగా జడప్రపంచమందు మనుజుని నివాసమెంతసత్యమో కామలోకమంత సత్యమైనదే.

కాని మనకు వెనుకనున్నట్టియు మనపైనంత యొత్తిడిచేయుచున్నట్టియు దానిని మనమేల సాధారణముగాఁ దెలుసుకొనకున్నాము ? మన యిరుగుపొరుగువాని జీవితము మనజీవితమువంటిదేయై మనపై తెలియకుండనే సదా పనిచేయుచున్నను మనమేల తెలియజాలకుంటిమో యదే దీనికిఁగారణము. (మన భావములలో నెక్కువభాగము వెలినుండి యితరులనుండి వచ్చుచున్నవే). జాగ్రత్స్వప్నమందు మనకుఁ దెలియనట్టియు సదా మనబహిస్థితిని నిర్ణయించునట్టియు మన స్థూలస్థితియొక్క గొప్పభాగమెందుకుఁ దెలియుటలేదో యాకారణముచేతనే యిది తెలియఁబడకున్నది. సాధారణముగా

మనము స్థూలేంద్రియముల నుపయోగించుచున్నాము. స్థూలశరీర మందే నివసించియున్నాము. స్థూలప్రాణముతో స్థూలమానసముతోఁ బనిచేయుచున్నాము. వీనిద్వారా ప్రాణలోకము వెల్లడికాదు. మనలోని యితరకోశములకిది సాధ్యపడుచున్నది. ఉపనిషత్తులలో వీనిని కోశములనుచున్నారు. ఇటీవల దేహములని వాడుచున్నారు. మనోమయకోశము లేక సూక్ష్మదేహము. దీనియందు మానస పురుషుఁడు నివసించుచున్నాఁడు. ప్రాణమయకోశము లేక ప్రాణ శరీరము. ఇది యన్నమయ కోశముతో సంబంధించియున్నది. దానితోఁగలసి స్థూలదేహ మనిపించికొనుచున్నది. ఈమనోమయ ప్రాణమయ కోశములు రహస్యముగా మనలో సదాపనిచేయుచున్న శక్తులసామర్థ్యముల నింద్రియములఁ గలిగియున్నవి. స్థూలావయవముతో స్థూలజీవితమునకుఁ జెందిన నాడీసంఘముతో స్థూలమానసముతో సంబంధము కలిగియున్నవి. ఆత్మవృద్ధిచే వానిని మనము తెలుసుకొందుము. వానియందు నివసింతుము. వానిద్వారా ప్రాణలోకవ్యక్తి యితరలోకములవ్యక్తి పొందుచున్నాము. అవేగాక భూలోకసంబంధములైన కొన్ని సూక్ష్మానుభవముల విశేషజ్ఞానము మనకు పూర్తిగాఁ దెలుసుకొనుట కుపయోగించవచ్చును. ఈయాత్మ వృద్ధిచేత మనకిప్పుడు సర్వవిధముల ముఖ్యమైయున్న భూలోకము కంటె వేరగులోకములలో నెక్కువగానో తక్కువగానో నివసించవచ్చును.

ప్రాణలోకము విషయమేమి చెప్పఁబడెనో యదే కొన్ని యావశ్యకమైన భేదములతో విశ్వములోని పై లోకములవిషయమై వర్తించుచున్నది. ఈప్రాణలోకమునకు జాలదూరమున మానసిక లోకమున్నది. దానియందుఁ బ్రాణజడములుగాక మానసము నిర్ణయించు

చున్నది. అచ్చట మనస్సు జడముచేఁ బ్రాణశక్తిచే నిర్ణయింపఁబడక తానే నిర్ణయించి తనసంతుష్టికై వాని నుపయోగించుచున్నది. అచ్చట మానసమొక విధముగా స్వతంత్రత కలిగియున్నది. శరీర ప్రాణములచే బంధింపఁబడియున్న మనమానసమునకు గోచరము కాని తనసంసిద్ధి సంతుష్టులకొఱకు స్వాతంత్ర్యము కలిగియున్నది. పురుషుఁడచ్చట కేవల మనోమయుఁడై యున్నాఁడు. అతనికి ప్రకృతితోఁగల సంబంధములా పవిత్రమానసముచే నిర్ణయింపఁబడుచున్నవి. స్వభావమచ్చటఁ బ్రాణమయ స్థూలమయముగాక మనోమయమైయున్నది. ప్రాణలోకము భూలోకముసహితము దానిప్రసారమై యున్నవి. మానసపురుషుఁడు తనకవసరమైన రుచులసంసిద్ధికొఱకు నిర్ణయించుకొన్న ప్రదేశములే స్థితులే యీలోకములు. భూలోకమందలి వైచిత్ర్య వికారము మొదట ప్రాణలోకముపై తరువాత జడస్థితియందున్న ప్రాణముపై మానసలోకముయొక్క యొత్తిడిచేఁ గలుగుచున్నది. ప్రాణలోకమందు తనమార్పువలన మనలో కామమానసమును సృజించుచున్నది. తన స్వంతహక్కునుబట్టి మనలో పవిత్రమైన మానసికమేదో శక్తులను సృజించుచున్నది. మనకుఁగనుపించు మానసము మనోలోకమందు స్థానముగల విపుల మానసముచేఁ (Subliminal) గలిగినదే. ఈమానసలోకము సహితము మనపై మనలోకముపైఁ బనిజేయుచున్నది. దానియందు భూతములు కలవు. మన మనోమయకోశముద్వారా మనకు సంసంబంధించియున్నది. అందు మానసికస్వర్గము లేర్పడియున్నవి. ఈస్థూలదేహమును విడిచినప్పుడు పురుషుఁడందుఁ బ్రవేశించి భూలోకవాసమునకుఁ దిరిగి ప్రేరేపింపఁ బడునంతవరకందు నివసించియుండును. దీనియందుసహితము బహులోకములున్నవి. క్రిందిలో

కములోఁ గలిసిపోఁగల క్రిందితరగతి మొదలు విజ్ఞానలోకములోనికిఁ గరిగిపోఁగల యూర్ధ్వ తరగతివరకు నేర్పడియున్నవి.

మిక్కిలి పైనున్న యీయూర్ధ్వలోకము లూర్ధ్వమానసికములైయున్నవి. అవి యూర్ధ్వమానస విషయములై విజ్ఞానమునకు (బుద్ధికి) చెందినవి. సచ్చిదానందుని త్రివిధతత్వములతో సంబంధము గలవి. జీవుఁడు స్వభావముతో నాడు నాటయొక్క కొన్ని యల్ప విషయములలోఁ బురుషుఁడు తగులుకొనుటచే నీయధోలోకములు వానినుండి యేర్పడుచున్నవి. కాని యీలోకములు సహితముమన ముదాటలేని యంతరాయములు కలిగి యుండలేదు. విజ్ఞానమయ కోశ మానందమయకోశము లనఁబడు కారణశరీరము ద్వారా మన కవి వ్యక్తమగుచున్నవి. మానసదేహముద్వారా యంతగా మనకు వానితోఁ బనిజరుగుటలేదు. కాని ప్రాణస్థూలకార్యములందు వాని గూఢశక్తులు లేకపోలేదు. ప్రాణదేహములందున్న మానసపురుషునిపై నీయుత్తమలోకములయొత్తిడిచేతనే మనలో సహజస్ఫురయు నధ్యాత్మికవ్యక్తిప్రబోధయుఁ గలుగుచున్నవి. ఈకారణశరీరము జనసామాన్యమందు బహుస్వల్పముగా వృద్ధిజెందినది. దాని యందు వసించుటకుఁగాని యూర్ధ్వమానసలోకముల నధిరోహించుటకుఁగాని యనురూపమైన మనోమయమగు లోకములయంతర్వర్గముల విభజించుటకుఁగాని వ్యక్తితో నాలోకములందు నివసించుటకుఁగాని మనుజులకు బహుకష్టసాధ్యమైయున్నది. సమాధియం దట్లు చేయవచ్చును. కాని విశేషజనము తెలుసుకొనుటకైన నిష్పడని వ్యష్టిపురుషుని సామర్ధ్యములవృద్ధిచేయుటయను నూతనపరిణామ విధానముచే (evolution) నట్లుచేయవచ్చును. పరిపూర్ణాత్మజ్ఞానమువల్లనే పురుషుఁడు ప్రకృతిని వ్యక్తితోఁ బూర్తిగా వశముచేసు

కొనుచున్నాఁడు. అచ్చట మనస్సునిర్మయించదు. కాని యాత్మ యధోవిషయముల నుపయోగించి వానికి నుత్తమసామర్థ్యముల కలిగించుచున్నది. అదే ప్రవృత్తినొందినదాని నివృత్తినొందించుట. దానికొఱకే పురుషుఁడు స్థూలప్రపంచమందు మక్కలి కష్టములకు లోనగుచున్నాఁడు.






32 అధ్యాయము.

# అధో త్రివిధ పురుషుఁడు (త్రైలోక్య పురుషుఁడు)



విశ్వమునకు సంబంధించిన వివిధలోకములయొక్కయు, మనస్థితికిసంబంధించిన వివిధలోకములయొక్క నిర్మాణవిధానమట్టిది. అవినుచ్చైనవలె జడములోనికిదిగి యాత్మయొక్క యున్నతత్వములోనికి పై కెక్కుచున్నవి. విశ్వస్థితినుండి తప్పించుకొని విశ్వాతీతమైన యనంతములోనికిఁ జేరువర కున్నవనవచ్చును. బౌద్ధుల లోకనిర్మాణవిధానమిట్టిదన చెప్పఁబడినది. మనసాధారణ జడజ్ఞానమున కీసమస్తము కనుపించదు. భూలోకమందేదో యొకమూల మనస్థితియందే పని చేయుచు క్షణభంగుర జీవితానుభవములలో లగ్నమైయుండుటచే మనకవి తెలియుటలేదు. అట్టి వ్యక్తికీలోకము జడపదార్థశక్తి సమూహమైయున్నది. ఈజడపదార్థశక్తులు స్థిరమైన ధర్మములచే నాకారముల నిర్మించి నడుపుచున్నవి. ఆధర్మములకు మనము విధేయులమై యుండవలెను. వానిచేఁ బాలింపఁబడవలెను. పుటుకతో నారంభమై మరణముతో నంత్యమై తిరిగి పునర్జన్మలేని యీస్వల్పజన్మనుపయో

గించుకొని సాధ్యమైనంతజ్ఞానమును బొందవలెను. మనస్థితి యాదృచ్ఛికసంభవమో, సర్వవ్యాపక జడజీవితమందు స్వల్పవిషయమో, జడశక్తి వ్యాపారముయొక్క నిత్యవిచ్ఛేదకత్వమో యై యుండవలెను. ఏదోవిధముగా జీవుఁడు లేక మానసము శరీరమందున్నది. తనకు బాగుగాఁ దెలియని వస్తువులయందు శక్తులయందుఁ దారుమారు చెందుచున్నది. మొదట నది ప్రమాదములతోను నిరోధములతోను నిండియున్న యీలోకమందు నివసించుటకై కష్టపడుటలో లగ్నమైయుండును. తరువాత విశ్వధర్మములఁ దెలుసుకొని జీవితమున్నంతవరకు సౌఖ్యములకై ప్రయత్నము చేయుచు నాధర్మములనందు వినియోగించుటలో లగ్నమైయున్నది. జడమునందు వ్యక్తరూపమొందిన స్వల్పమానసవ్యాపారముకంటె మనము వేఱుకానియెడల మనజీవితమువల్లఁ బ్రయోజనమే యుండదు. అప్పుడు మనజీవితములో ముఖ్యభాగమంతయు నిత్యజడముతో జీవితమందున్న కష్టములతో క్షణభంగురమైన చిత్తముయొక్క బుద్ధియొక్క పోరాటమై యుండును. మతములు కళలు నిర్మించిన విచిత్ర పుక్కిటిసిద్ధాంతములచేతను మనోకల్పితములచేత నూహలచేతను విశ్రాంతి యాపోరాటమునకుఁ గలుగుచున్నది.

కాని యతఁడు కేవలదేహమేగాక జీవుఁడగుటవలన తెలియున్న యీజీవిత విషయములబట్టి న్యాయమని తోచునట్టి యీమొదటిభావమే నిజమని పూర్ణజ్ఞానమని తృప్తిచెంది యుండలేఁడు. అతని కర్తరిస్థితికి యతీతసత్యములయొక్క సూచనలు తోచుచుండును. దాని ననంత త్వామృతత్వజ్ఞానము కలుగుచుండును. ఇతరలోకములున్నట్లు దానికి నమ్మకము సులువుగాఁ బుట్టును. జీవాత్మకు విపులానుభవస్థానములైన యూర్ధ్వలోకము లున్నవని సులువుగా

నమ్మెను. శాస్త్రము (Science) స్థితియొక్క కర్మణి (objective) తత్వమును, స్థూలప్రాణములపై విజ్ఞానమును మనకు కలిగించుచున్నది. కాని మనకర్తరి (Subjective) స్థితికిఁ బరిశ్రమకలిగించి దానిశక్తులవృద్ధిచేయుటవలన పైనకొన్ని సత్యము లున్నవని మనకుఁ దెలియఁగలదు. ఈలోకజ్ఞానము మనకువచ్చినప్పుడు పైనున్న యితరస్థితులజ్ఞానము కొఱకు తప్పక వెతుకుదుము. అందుచేతనే జడనాస్తిక యుగములకుఁ దరువాత రహస్యవిద్యాయుగములు, దేవునివెతుకు మతయుగములు వచ్చుచున్నవి. పైపై మానసికజ్ఞానము స్థూలదేహధర్మజ్ఞానము చాలదు. మనపై విజ్ఞానము దేనికిపైతోడుగానున్నదో యట్టి యంతరకర్తరి స్థితియొక్క యద్భుతమైన రహస్య మది మనకుఁ గలిగించుచున్నది. మన స్థూలేంద్రియములకుఁ దోచునది విశ్వముయొక్క జడావరణమనియు మనవెలిమానసమునకుఁ దోచునది, కనిపెట్టఁబడని యంతరస్థిత గొప్పఖండముయొక్క తీరము మాత్రమేయనియు మనకుఁ గనుపించును. వానిఁ గనిపెట్టుట బౌతికమనోశాస్త్రజ్ఞానములకంటె వేరుజ్ఞానమునకు జెందినది.

తన్నధిగమించుటకు, తనజడస్థితి నధిగమించుటకు మతమే మనుజుఁడుచేయు మొదటి ప్రయత్నము. మతమునకు ముఖ్యమేదనగా మానసస్థూలస్థితులు దేనిపై యాధారపడియున్నవో యట్టియనంతునికర్తరివ్యక్తి తనకు స్థిరపరుచుకొనుట. అనంతునిజేరి యతనితో సంబంధము కలిగియుండవలెనను జీవుని ధ్యాసను సత్యమని స్థిరపరుచుకొనుట. దానిపని యేమనగా జీవుఁడు సదా కాంక్షించునట్టియు సాధారణజీవితము నమ్మకముపుట్టించునట్టియు స్థూలజీవితమునుండి పెరిగి మరణము నతిక్రమించి విజ్ఞానస్థితి యమృతత్వము పొందవీలుకలదని మతము నమ్మకము పుట్టించుటే. తనకు నంప్రా

ప్తించిన యీలోకమేగాక నితరలోకము లున్నవని దుఃఖప్రియాం సలు మరణము స్వభావముగాక నమృతత్వ యానందములే నిత్యము స్వభావముగాఁగల లోకములున్నవని మతము స్థిరపరచుచుటే మర్త్య జీవితధర్మమిచ్చి దానిచేతనే యమృతత్వమునకుఁ బ్రయత్నించమని మతము చెప్పుచున్నది. మనుజుఁడు జీవాత్మగాని దేహముకాఁడు. అతని ప్రపంచజీవితము ముందురానున్న విజ్ఞాన స్థితుల నిర్ణయించుటకు సాధనమగుచున్నదని చెప్పుచున్నది. ఇదంతయు సర్వమతములకు సమానమే. దీనికంటె పైనమతములవల్ల సమ్మతములుపుట్టదు. మతభావములు భేదించుచున్నవి. భూమిపై యొకజన్మే మనకుండునని, యాజన్మలోనే మనముందుస్థితి నిర్ణయింపఁబడునని కొన్నిమతములు చెప్పుచున్నవి. అవి జీవుని వెనుకటి యమృతత్వమును నిరాకరించి ముందటి యమృతత్వము నంగీకరించుచున్నవి. సన్మార్గము తప్పినవారికి నిత్యదుఃఖమని నమ్మశక్యముకాని మాత్రముచే భయపెట్టుచున్నవి. కాని మఱికొన్ని విపులమతములు జన్మపరంపరలుకలవనియు వానివలన జీవుఁడనంతుని జ్ఞానము పొందుచున్నాఁడనియు సర్వజనులకు సంపూర్ణసంప్రాప్తికలదనియు నమ్ముచున్నవి. కొన్ని యనంతుఁడు మనకంటె వేఱుపురుషుఁడనియు నతనితో మనము స్వయముగా సంబంధము పెట్టుకొనవచ్చుననియుఁ జెప్పుచున్నవి. మఱికొన్ని యతఁడు మనవ్యష్టిస్థితి లీనముకావలసిన నిర్గుణమని తెలుపుచున్నవి. కాబట్టి కొన్నిమతములు పైలోకములే మనకు గమ్యస్థానములనియు నందీశ్వరుని సాన్నిధ్యమందు నివసింతుమనియుఁ జెప్పుచున్నవి. మఱికొన్నిలోకనివాసము పూర్తికాఁగానే యనంతునియందు నిమజ్జనమగుటే మనగమ్యస్థానమనుచున్నవి. అన్నియు భూలోకజీవితము పరార్థమనియుఁ దత్కాలిక దుఃఖమనియు డం

బమనియు విడిచిపెట్టుమని ప్రేరేపించుచున్నవి. మనయోగల నూర్ధ్వ ముందుంచమనుచున్నవి. కొన్నిమతము లాత్మయొక్క భవిష్యద్విజయమును భూమిపైనే సర్వజనసమూహ జీవితమందు సూచించి ప్రత్యేకమనుజుని కాక కొలుపులేగాక జాతీయసమూహమందు సహిత మాకు పురికొలుపుచున్నవి. కాని మతము జ్ఞానము కాదు. అది నమ్మకము ధ్యాస. సాధారణజీవిత మధిగమించిన జీవులయనుభవములు వారి సహజజ్ఞానములు మతములు న్యాయమని రుజువు చేయుచున్నవి. ఆత్మయొక్క విపులసత్యములరహస్యముల తెలుసుకొనుటకు నమ్మకము మతము కలిగించుచున్నది. మతతత్వముల చిహ్నముల శిక్షల గట్టినిబంధనలుగా మార్చుచున్నామనుట మన మింకను బసితనములోనే యున్నామని యనంతుని తత్వశాస్త్రమునకింక దూరమందేయున్నామని సూచించుచున్నది.

ప్రతిగొప్పమతమునకు దాని నమ్మకములకు చిహ్నములకు సూత్రములకు వెనజల్లబడిన సత్యములకు నంతరార్థములు కలవు. వానివలన విజ్ఞానశక్తి కలిగి రహస్య తత్వములు తెలియఁబడి వశము చేసుకొనబడుచున్నవి. ప్రతిబహిరంగమతమునకు నంతరార్థయోగమున్నది. ఆయంతరయోగమునకు మొదటిమెట్టు నమ్మకము. దాని గుర్తులు చెప్పనలవికాని సత్యములఁ దెలుపు చిహ్నములు. దాని ఛాందససూత్రము లూర్ధ్వలోకస్థితిరహస్య సూచకములు. జడప్రపంచజ్ఞానముకొఱకు పదార్థశాస్త్రములు మొదటి యాకృతులకు బదులుగా రహస్యతత్వముల నెట్లు వెల్లడించుచున్నవో విపులానుభవము నమ్మకము మనకెట్లు కలిగించుచున్నవో యట్లే యోగమూర్ధ్వలోకముల వెల్లడించుచున్నది. కాబట్టి దెలియరానట్టియు మనుజుఁడు ప్రయత్నించిన సాధ్యమగునట్టియు నీసమస్తానుభవ సోపానములు

జ్ఞానయోగమునకు సంబంధించినవి. ఆజ్ఞానయోగము పరిపూర్ణుని వెతుకుటయందు తనలో నీశ్వరజ్ఞానమును వెతుకుటయందు వ్యష్టిమానవజీవునితో నీశ్వరునకుగల ప్రత్యేకసంబంధముల వెతుకుటయందు మాత్రమేలగ్నమై యుండలేదు. జ్ఞానయోగము పొందవలసినగో ప్పవిషయము పరిపూర్ణుని జ్ఞానము. దాని ముఖ్యోద్దేశ్య మీశ్వరుని పొందుటే. అల్పజ్ఞానముకొఱకు దాని నిర్లక్ష్యపెట్టుట మహాయోగమున కాధిక్యత తప్పించి దానిముఖ్యోద్దేశమునుండి పడిపోవుటే. కాని యీశ్వరుని నిజతత్వము తెలుసుకొన్నందున జ్ఞానయోగ మీశ్వరుఁడు మనతో నితరలోకములతో నెట్టిసంబంధముల కలిగి యున్నాఁడో తెలుసుకొనవలెను. మన యాత్మోద్ధరణ శిఖరమునం బడు శుద్ధాత్మ నధిరోహించినవు డాయున్నతప్రదేశమునుండి స్థూలముపరకు వ్యాపించియున్న యధోస్థితులంబొంది స్వభావము దాని యందెట్లు పనిచేయుచున్నదో గ్రహించవచ్చును.

మన మీజ్ఞానము వేరువేరు రెండుమార్గములం బొందవచ్చును. పురుషమార్గమున ప్రకృతిమార్గమున. పురుషప్రకృతి సంబంధములం బూర్తిగా నీశ్వర ప్రకాశమందుం బొందుటకు రెంటిని కలిపి నంగలుపవచ్చును. బ్రహ్మాండపిండాండములనంబడు విశ్వమానవు లందుం బంచవిధజీవుం డున్నాఁడని యుపనిషత్తు చెప్పుచున్నది. పురుషుం డాత్మయనంబడు స్థూలజీవుండే మొదట మనకు వ్యక్తమానేం డు. తనకు స్థూలమునకంటె వేరు స్థితిలేదనియుం బ్రాణమానసవ్యాపారము సహితము స్థూలదేహమును విడిచి స్వతంత్రముగానుండ దనియుం దలచునాత్మయిదియే. జడ స్వభావమందంతట యీస్థూల జీవాత్మయున్నది. అది శరీరమందు వ్యాపించినది. శరీరవ్యాపారము నది తెలియకుండ నడిపించుచున్నది. సమస్త శరీరానుభవమున కదె

మూలము. మనస్సునకు వ్యక్తముకాని సమస్తవస్తువులందది యంత ర్భూతమైయున్నది. కాని మనుజునందిస్థూలాత్మ ప్రాణత్వమొంది నదీ. మానసికత్వ మొందినది. అది ప్రాణమానసిక ధర్మములఁ గొంత స్వీకరించునది. కాని ప్రాణమానసముల నదిపొందుట దానికి స్వభావసిద్ధము గాక ప్రతిగ్రహింపఁబడినది. దాని నిజస్వభావము పై నధ్యారోపణ చేయఁబడినది. పైనుండి నియమింపఁబడినది. స్థూలోపకరణములకులోనై పనిచేయుచున్నది. మన మనఃప్రాణభాగము లపై నీస్థూలదేహాధికారము, మనఃప్రాణములు స్థూలశక్తి పర్యవసానములని చెప్పెడిజడవాదము (Materialsm) రుజువుచేయుచున్నది. నిజమునకు ప్రాణమానసములు దేహమునకు లోబడుట వృద్ధికాని మానవజాతికి లక్షణము. మనుష్యజాతికి క్రింది జంతువులందది మిక్కిలి యధికము. పునర్జన్మ సిద్ధాంతమునుబట్టి భూలోకజన్మయం దెవరీస్థితిని దాటజాలరో మరణానంతరము వారు మానసికలోకముల యుత్తమప్రాణలోకముల నొందరనియుఁ దరువాత భూలోక జన్మయందు మరల వృద్ధిజెందుటకై పెక్కు స్థూలలోక చరలనుండి తిరిగి వచ్చుచున్నారనియుఁ జెప్పబడుచున్నది. కారణమేమనగా వృద్ధిలేని స్థూలజీవుఁడు పూర్తిగా జడస్వభావమునకులోనై తధ్యాసలతో నిండియున్నాఁడు. పై కెక్కుకపూర్వము వానిని యుత్తమ ప్రయోజనార్థ ముపయోగించవలసి యున్నది.

మిక్కిలి వృద్ధిజెందిన మానవజాతి మానస ప్రాణలోకముల వలనఁ బొందఁదగిన యనుభవసామర్థ్యముల మిక్కిలి స్వేచ్ఛతోవిశేషముగా నుపయోగించుచున్నది. ఈదాగియున్న లోకముల సహాయ సంపత్తిపై యాధారపడి స్థూలమునకు లోనుగాక, స్థూలస్వభావమును, గామలోకమునుండివచ్చు గొప్ప ప్రాణశక్తులవల్లను మానస వి

జ్ఞానలోకములనుండివచ్చు సూక్ష్మమానస శక్తులవల్లనుమార్పు స్వాధీనము చేసుకొనుచున్నది. ఇట్టివృద్ధివల్ల మరణమునకును బునర్జన్మమునకును మధ్య నుత్తమలోక ప్రాప్తినొందుటకు నింతకంటె నెక్కువ మనోవిజ్ఞానవృద్ధికొఱకుఁ బునర్జన్మమును సాధనముగా నుపయోగించుటకుఁ దోడ్పడుచున్నది. అట్టి మనజాగ్రదావస్థను నిర్ణయించు స్థూలస్థితియందు మనకర్మకు మూలములైన లోకములఁ దెలుసుకొనకనే మనము పనిచేయుచున్నాము. నిశ్చయముగా స్థూలపురుషునకు మానసికలోకములవ్యక్తి కలిగేయున్నది. కాని యున్నతమైన ప్రాణలోక మనోలోకములగాని మన సాధారణవ్యక్తికిఁ దెలియరాక లోన దాగియున్న ప్రాణమానస పురుషులనుగాని మన మెఱుఁగము. వృద్ధియొక్క పై సోపానమందుమాత్రమే మనకు వాని జ్ఞానము కలుగుచున్నది. అప్పుడుసహితము మానసమొందిన స్థూలస్వభావకార్యమునకు వెనుకఁ దోచబడును. ఆలోకములలో మనము ప్రత్యక్షమున నివసించుటలేదు. అట్లు నివసించితిమేని త్వరలోనే స్థూలదేహమును వ్యక్తితోఁ బ్రాణశక్తిచే నడుపనేర్తుము. స్థూలమానసముల రెంటిని మానసముచే నడుపనేర్తుము. అప్పుడు మన స్థితి కష్టకాలమై చిత్తజ్ఞానములచేఁ బ్రాణదేహములపై సరాసరి మానసము నుపయోగించి ప్రాణజీవితముల విశేషభాగము నిర్ణయింపఁగలము. యోగముచే స్థూలజీవాత్మ నతిక్రమించుశక్తి, స్థూలజీవాత్మలుఁ బొందు శక్తి వృద్ధినొంది విపులతగాంచిన యాత్మజ్ఞాన యాత్మనిగ్రహముల వలనఁ బొందగలము.

పురుషుని మూలకమునకిది సంపాదింపవచ్చును. స్థూలము నుండి తన్ను వెనుకకు మరలించి స్థూలస్వభావముతో నింతవరకుఁ దాఁజేయుచున్న పనినుండి తన్నుమరలించి భావచిత్తములపై నేకా

గ్రితనొందించుటచే ప్రాణములోనికి తరువాత మానసములోనికి నధిరోహింపవచ్చును. అట్లు చేయుటచే మనము ప్రాణపురుషుండ గుదుము. ఈ నూతన వ్యక్తిలోనికి స్థూలజీవాత్మను చేదుకొందుము. మనకప్పుడు స్థూలదేహము, దానిస్వభావము, దానిపనులు ప్రాణజీవాత్మ విషయికములై జడప్రపంచముతో సంబంధముకొఱకేర్పడినవిగాఁ దోచబడును. స్థూలము వేఱనుభావము కలుగును. అంతట దానిపై నధికారము నహింపఁబడును. స్థూలదేహము సాధనమని పైకప్పని విడతీయవచ్చునను జ్ఞానము సంభవించును. మన జీవితావరణముపై స్థూలదేహముపై మనకోరికల యధికారమెక్కువగును. మనకుఁ బూర్తిగా వ్యక్తమాచున్న ప్రాణశక్తినుపయోగించుటకు నడుపుటకు శక్తికలుగును. స్థూలమునకు పైనున్న ప్రాణలోకము వ్యక్తమౌను. కామలోకవాసులతో సంబంధము సంభవించును. సిద్ధులు రాఁగలవు. ప్రపంచమందున్న ప్రాణజీవాత్మతో ననురాగము సంభవించును. ఇతరుల కోరికలు రాగములు ప్రేరేపణలు తనకుఁ దెలియుచుండును. యోగముచేరాబడిన నూతన జ్ఞానమునకివి లక్షణములు.

కాని యీసర్వము జ్ఞానానుభవమందు హీనతరగతులు. స్థూలస్థితికంటె విశేషము మించినవికావు. ఈవిధముననే మనమింకఁ బైకి వెళ్లవలెను. మానసజీవాత్మలోని కధిరోహించవలెను. అట్లగుటచే మనము మానసిక జీవాత్మయగుదుము. స్థూలప్రాణస్థితులనందులోనికి నాకర్షింతుము. ప్రాణదేహములంత ముఖ్యముగాక మానస జీవాత్మ స్థూలస్థితికి సంబంధించిన హీనప్రయోజనముల కొఱకు వినియోగించు సాధనములుగాఁ దోచును. ఇప్పుడు సహితము ప్రాణదేహములు వేరనిదోచును. మన నిజమైనస్వయునికి భూలోకమందు

గాక మరియొక లోకమందని తెలియవచ్చును. ఎక్కువ సూక్ష్మస్థితి
తో సంబంధము భూలోకజ్ఞానముకంటె నెక్కువజ్ఞాన ప్రకాశము
మిక్కిలి యరుదైన శక్తివిశేషము కలుగును. మానసలోకముతో
చెలిమికలుగును. మానసలోకవ్యక్తి రాఁగలదు. ఆలోకవాసులతో
సంబంధము సంభవించును. ఆలోకములందు నిలిచి భూలోక కామ
లోకముల హీనలోకములుగాఁ బరిగణింతుము. మన కిష్టమువచ్చిన
ప్పుడు విడువఁగలవిగా మానసిక లోకములలో నివసించుటకు మన
దేహత్యాగము చేసినప్పుడు విడువవలసినవిగాఁ దోచును. కానియిప్పు
మనము వెలియై స్థూలప్రాణలోకముల దాటి మనకువచ్చినను తన
పదవియందుండి వానిని స్వాధీనపరుచుకొని వానిచేఁబని చేయించు
కొనవచ్చును. స్థూలప్రాణశక్తులకంటె వేఱైనమానసశక్తి మనకు
సర్వసాధారణమౌను. వృద్ధిజెందని మనుజుఁడట్టిశక్తినియు సంపూర్తిగా
నుపయోగించును. కాని యిప్పుడు మనము స్వేచ్ఛతోఁ దెలిసి దాని
నే యుపయోగింతుము. కామికశక్తికి స్థూలకార్యమునకుఁ బ్రాము
ఖ్యత తగ్గును. మానసికశక్తి సాధారణమై వినియోగింపఁబడును. మన
మప్పుడు బ్రహ్మాండమందున్న మానసముతో ననురాగము కలవా
రమగుదుము. దానివ్యక్తి రాఁగలదు. భావములు, విధులు భావశక్తు
లు సర్వమునకుఁ గారణమైన సూక్ష్మశక్తుల పోరాటములు తెలియ
వచ్చును. సాధారణమనుజునకవి తెలియరావు. స్థూలకార్యములను
బట్టి యతఁడూహించును. కాని మనకవి యిప్పుడు ప్రత్యక్షమునఁ
గాన్పించును. స్థూలసంబంధమైన గుర్తుగాని ప్రాణసంబంధమైన
గుర్తుగాని తెలియఁబడకపూర్వమే ప్రత్యక్షమున మనకవి గానిపిం
చును. ఇతరుల మనోవ్యాపారము స్థూలప్రపంచమందుగాని తదు
పరి లోకములందుగాని మనకువ్యక్తమౌను. ఉత్తమసిద్ధులు సంభవిం

చును. ప్రాణలోకసిద్ధులకంటె మిక్కిలి సూక్ష్మమైన సిద్ధులు స్వతసిద్ధముగా మనలో నుద్భవించును.

ఈసర్వము పూర్వపురుషులు త్రైలోక్యమని పిలిచిన ముల్లోకములకుఁ జెందినవిషయములు. ఈలోకములందుండుటచే మన జ్ఞానశక్తి యెంతవృద్ధిజెందినను పురుషునిపై ప్రకృతికిగల ప్రభుత్వమునకు లోఁబడియుండును. నిజమైన స్వాతంత్ర్య మధికారము చెందవలెనన్న బహుసానువులతో నిండినసిద్ధి పర్వతోన్నత ప్రదేశమున కధిరోహించవలసి యున్నది.






33 అధ్యాయము.

## ఆత్మవిలక్షణత్వముయొక్క సోపానపంక్తి.

ఈయధో త్రైలోక్యమునకు త్రిలోకముల కతీతముగాఁబోయిన సాధారణమనుష్యులకుత్తమస్థితియందుసహితము సాధ్యముకాని విషయము వెల్లడించుచున్నది. వేదవిదులు దీనిని స్వర్గమర్త్యలోకముల దాటుటయనఁబడు పూర్వపరార్ధగోళముల భంగముచేయుటయనిరి. ఈవిభాగముచే మనుజుఁడు (పిండాండము) విభజింపఁబడియున్నాఁడు. లోకపురుషుఁడు (అండాండము) కూడ నట్లే విభజింపఁబడియున్నాఁడు. ఈరెంటికి నాల్గుస్థితులు కలవు అవి యధోర్ధ్వములనుండి వేరుచేయఁబడినవి. ప్రాచీనులు దీనినే పరార్ధజ్ఞానమని వ్రాసియున్నారు. ఉత్తరార్ధమందాత్మయొక్క బ్రహ్మత్వము సంపూర్ణముగా నున్నది. అచ్చట దాని యనంతత్వములు విరాజిల్లుచున్నవి. దాని యనంతస్థితి, యనంతజ్ఞానము, యనంతశక్తి, యనంతానందము ప్రకాశించుచున్నవి. క్రిందిభాగము సహిత మాత్మాధీనమైనదే. కాని యిచ్చట నాత్మ మనఃప్రాణదేహములచేఁ గప్పఁబడి వ్యక్తమౌటలేదు. ఆత్మ నామరూపములచే నావరింపఁబడినది. బహిరంతర

భేదముచేతను సమిష్టివ్యష్టులచేతను దానిజ్ఞానము భిన్నమైనది. దాని దృష్టిజ్ఞానములు బహిర్గతమైనవి. దానిశక్తి భిన్నత్వముచే బాధితమై హద్దులలోఁ బనిచేయుచున్నది. దాని జ్ఞానచిత్త శక్త్యానందములు భిన్నములై విరుద్ధగుణములైన యజ్ఞాన దుర్బలదుఃఖములకు వశమౌచున్నవి. మన దృష్టి లోనికిఁ ద్రిప్పుకొనుటచే సదా మనమా యాత్మవ్యక్తి కలవారమౌచున్నాము. బహిఃప్రపంచమందుసహితము నామరూపములద్వారా వానియందు నివసించుదానిలోనికి దిగుటచే నాత్మవ్యక్తి కలుగుచున్నది. అట్లు చేయుటవలన మనజ్ఞానము ప్రతిఫలించిన యాత్మయొక్క యనంతస్థితి జ్ఞానానందములఁ దెలుసుకొనుచున్నది. వాని యనంతశుద్ధప్రశాంత (సత్) స్థితియందుఁ బాలుగొనుచున్నది. కాని దాని జ్ఞానశక్తి యానందావిర్భావకార్యమందు స్వల్పముగాఁ బాలుగొనునేకాని పూర్ణానుభవము కలుగదు. ఇదిసహితము చాలాకాలమునకు విశేషప్రయత్నమువలన వృద్ధిఁజెందుచున్న యనేక జన్మఫలముగాఁ గలుగుచున్నది. మన సాధారణ జ్ఞానమీవిధముగాఁ గ్రిందిభాగమునకు బంధింపఁబడియున్నది. దానినతిక్రమించు విధానములఁ దెలుసుకొనవలెనన్న నీరెండు పదార్థములందుండులోకముల సంబంధముల విపులముగాఁ దెలుపవలసియున్నది.

సమస్త మాత్మవలన నిర్ణయింపఁబడుచున్నది. భూతము మొదలు జడపర్యంతము సమస్త మాత్మావిర్భమే. కాని యాత్మ తాను నివసించవలసిన లోకమును నిర్ణయించి యాలోకమందు బురుషప్రకృతుల సంబంధములలో నేదోయొక గుణమందు లగ్నమై జ్ఞానానందానుభవ మొందుచున్నది. జడమందు లగ్నమై స్థూలలోకమందు స్థూలాత్మయై స్థూలమునకు లోనగుచున్నది. ఆత్మ

జడానుభవమునకుఁజిక్కి స్థూలగుణమైన తామసముయొక్క యజ్ఞానమాంద్యములకు లోనైయున్నది. వ్యష్టిజీవునందది జడమయమైన జీవుఁడౌ (అన్నమయపురుషుఁడు) చున్నాఁడు. జడసంబంధమైన యజ్ఞానమాంద్యములలోనుండి యతని ప్రాణమానసములు వృద్ధిగాబడినందున నాయజ్ఞానమాంద్యబంధములకు లోనైయుండును. కారణమేమనగాఁ బ్రాణము దేహమునకు లోనై పనిచేయుచున్నది. మానసము ప్రాణమునకు నాడులకు లోనై పనిచేయుచున్నది. ఆత్మసహితము స్వస్వరూపజ్ఞానమునకు భిన్నమై బంధింపఁబడినది. ఈజీవుఁడు స్థూలశరీరమందు నివసించి స్థూలావయవేంద్రియ జీవనమానుషానుభవములకు లోనైయున్నాఁడు. ఈ స్వల్పవిజ్ఞానానుభవమే సమస్తమనుకొనుచున్నాఁడు.

మనుష్యుఁడుసహితము స్థూలస్వభావమును స్థూలదేహమందు నివసించు మానసికభూతమైన యాత్మయైయున్నాఁడు. ప్రప్రథమమున నతఁడు జడత్వమొందిన మానసికభూతముగాను జడత్వమొందిన జీవుఁడే (అన్నమయపురుషుఁడే) తన నిజస్వరూపమని తెలుసుకొనుచున్నాఁడు. ఉపనిషత్తు చెప్పుచున్నట్లు జడమే బ్రహ్మమనుచున్నాఁడు. కారణమేమనగా జడమునుండి సమస్తముత్పన్నమై దానిచేఁ బోషింపఁబడి దానియందే తిరిగి లీనమగుచున్నట్లు కనుపించును. అతని యుత్తమదృష్టికి నాత్మ స్థూలప్రపంచమందు నివసించు ననంతుఁడుగాఁ దోచును. అతనికిఁ దెలిసినది జడదే. దాని సాన్నిధ్యముచే సర్వరూపము లావిర్భవించుచున్నవని యతని యభిప్రాయము. అతని యుత్తమదృష్టికి తాను స్థూలజీవితానుభవములం దావిర్భవించి స్థూలమునకు బంధింపఁబడి యాస్థూలవినాశముకాగా ననంతములోఁ గలియునట్టి జీవాత్మగా దోచుచున్నది. కాని యతనికి స్వయముగా

వృద్ధికాఁగలశక్తి కలదుగనుక నన్నమయ పురుష సంబంధములైన నీ స్వభావసిద్ధాభిప్రాయముల విడిచి పైకెక్కఁగలఁడు. స్థూలమునకుఁ బైనున్న లోకములనుంచి వచ్చు నొకవిధమైన యనుభవముచే పై కెక్కఁగలఁడు. అతఁడు మానసమందుఁ దదేకాగ్రతనొంది మానసికమును వృద్ధిచేయును. సాధారణముగా ప్రాణస్థూలజీవిత వైభవమును త్యజించుటచే నీమానసికవృద్ధి కలుగుచున్నది. అట్టివృద్ధి ప్రబలమొంది యుత్తమలోకములఁ బ్రదర్శింపఁగలదు. ఆత్మయందుసహిత మిట్టే యేకాగ్రతనొందును. ఇచ్చటసహిత మతఁడు క్రమముగా స్థూలమానసికవైభవమును త్యజించును. విజ్ఞానజీవితము ప్రబలి భ్రాంతికాకర్షణ నశించువరకు నాత్మపై తదేకాగ్రత నొందించుచుండును. ఈకారణమువలన నతఁడితరలోకములందు (మానస ప్రాణస్వర్గములందు) నివసింపఁ గాంక్షించుచున్నాఁడు. భూలోకవాసము కష్టములతోనిండి యానందదాయకముకాదని తెలుచుచున్నాఁడు. అంతేగాక యతని యుత్తమదృష్టియందాత్మ ప్రశాంతుఁడుగాఁ దోఁచుటకవకాశముకలదు. ప్రకృతి వశముగాని పురుషునియొక్క యనంతసత్తే యతని యనుభవమునకుఁ గోచరమౌనది. అతనియందావిర్భవించిన శక్తి స్థూలస్వభావబంధముల నతిక్రమించఁజాలదు. అనంతక్రియాత్మకమైన నానందముకంటె నిశ్శబ్ద నిర్వికారాత్మ ప్రశాంతత్వము సులభసాధ్యమని యతనికిఁ దోఁచఁబడును.

ప్రాణత్వమందు స్థిమితమై యాత్మ ప్రాణలోకమందుఁ బ్రాణపురుషుఁడౌచున్నాఁడు. అతఁడే వ్యక్తితోనున్న ప్రకృతిరాజ్యమందుఁ బ్రాణశక్తియొక్క ప్రాణజీవాత్మ. అతఁడు వ్యక్తిగల ప్రాణవిలాసానుభవములందుఁ దగులుకొని ప్రాణమునకు సంబంధించిన రాజసగుణములనంబడు కామాదులలోఁ జిక్కుకొనుచున్నాఁడు.

వ్యష్టిజీవునందతఁడు ప్రాణజీవాత్మ (ప్రాణమయపురుషుఁడు) యనఁబడుచున్నాఁడు. అతనిస్వభావమందుఁ బ్రాణశక్తులు మానసికస్థూలత్వముల వశము చేసుకొనుచున్నవి. స్థూల మా కామాదులకనుగుణ్యముగా కర్మనిర్మాణముల నేర్పరుచుకొనుచున్నది. భూలోకమందున్న హద్దులవంటి హద్దులుండవు. అట్టికామాదుల వృద్ధికైతోడుపడుటకు మానసము హద్దుల మధ్యస్థమగుచున్నది. ఈప్రాణమయపురుషుఁడు స్థూలదేహముకంటె సూక్ష్మపదార్థముతో నేర్పడిన ప్రాణదేహమందు నివసించుచున్నాఁడు ఈప్రాణదేహము నేర్పరచినపదార్థము వ్యక్తితోనిండి భౌతికభూతములతో నేర్పడినజడమునకంటె మిన్నయైన సామర్థ్యములు భోగశక్తులుగలది. మనుష్యుఁడు తనలో స్థూలమునకు వెనుక నాస్థూలమునకంటె యీప్రాణజీవుఁడు ప్రాణస్వభావము ప్రాణదేహము ప్రాణలోకమునకు సంబంధించిన సమస్త ప్రాణమయము కలిగియున్నాడు. అందు శక్తులు పనిచేయుచున్నవి. సులభముగా వ్యక్తమగుచున్నవి.

స్థూలమందు లోకమునకుఁ జెందిన శక్తియొక్క వృద్ధిననుసరించి మనుష్యుఁడు ప్రాణశక్తితో నిండినవాఁడౌను. కామవృద్ధిగాంచును. రాగాదులందు దోకము కలవాఁడగును. తన కార్యకరణమందుఁ దీవ్రశక్తి గలవాఁడగును. వాఁడే రాజసపురుషుఁడు. ప్రాణలోకవ్యక్తి యట్టివానికి కలుగుటకు వీలుకలదని మనమిదివరకుఁ దెలుసుకొంటిమి. ప్రాణజీవుఁడు (ప్రాణమయపురుషుఁడు) కాఁగలఁడని ప్రాణస్వభావమొందునని ప్రాణదేహమందు స్థూలదేహమందు నివసించునని తెలుసుకొంటిమి. అతఁడిట్లుండుట సంపూర్తిగానేర్పడి పైకిఁబోయినయెడల నసురులలో హీనదశ నొందఁగలఁడు. అట్టివానియందు సామర్థ్యము ప్రాణశక్తిమాత్రమే యుండును. వాఁడు మనోములేని

భోగశక్తితో నిండియుండును. స్థూలమనుష్యునికంటె మిక్కిలి హెచ్చైన రాజసాహంకారము కలిగియుండును. ప్రాణలోకమందట్టివాఁడు మనస్సును మిక్కిలి వృద్ధిచేసి యాశక్తిని తన నిగ్రహమునకు తన సంతుష్టికి నుపయోగించెనేని యదియసురశక్తియుతుఁడై (తపశ్యము) రాజసాహంకారము నెక్కువ నియమముతో సంతుష్టిచేయుటకే. కాని ప్రాణలోకమందుసహితము భూలోకమందువలెనె కామజీవునకుఁ గామలోకమునకు సంబంధించిన శక్తిభానముల మించుటకు నుత్తమమానసమును వృద్ధిచేయుటకుఁ బ్రాణపురుషుని లక్షణములందు నతని రూపశక్తులకు వెలుపల నాత్మవిజ్ఞానమందే కాగ్రత నొందించుటకు సాధ్యముకలదు. ఇట్టి విజ్ఞానానుభవమందుఁ బ్రశాంతత్వమున కావశ్యకమంత ముఖ్యముకాదు. కారణమేమనగా సనంతుని శక్త్యానందముల తీవ్రసంసిద్ధికి విశేష వీలుకలదు. కాని యాసంసిద్ధి యెన్నటికిఁ బరిపూర్ణమునకు సమీపించదు. హేతువేమనగాఁ గామలోకపరిస్థితులు భూలోకపరిస్థితులవలెనే పరిపూర్ణ విజ్ఞానజీవితవృద్ధికిఁ బనికిరావు. ప్రాణపురుషుఁడు తన ప్రాణశక్తి కార్యసమృద్ధిని విడిచి యాత్మను వృద్ధిచేయవలెను. లేకున్న గామలోకాకర్షణలకు లొంగియుండవలసినదే. ఈలోకమందుసహితము పరిపూర్ణత్వము సాధ్యముకాదు. అంతమట్టుకే వృద్ధిగాంచిన జీవాత్మ విశేషానుభవముకొఱకు మిక్కిలి తన వృద్ధికొఱకు భూలోకమునకు మరల రావలసినదే.

మనోతత్వమందు స్థిమితమొందిన యాత్మ మానసికజీవాత్మయై మనోలోకమందు మానసస్వభావ ప్రకాశము కలిగి యుత్తమమేధాశక్తితో మానసస్థితికి స్వభావమైన సత్య సౌఖ్య నిర్మలాధిక్యతలతో నుండును. వ్యష్టిమనుజునందది మనోమయ జీవాత్మ (మనోమయ పురుషుఁడు) యనఁబడుచున్నది. అతనియందు నిర్మలప్రకాశ

మానమైన మానసశక్తులు ప్రభుత్వము వహించును. ప్రాణశక్తుల దేహరూపముల నిర్ణయించును. భూమియందువలె నది జడముచే నెదిరింపఁబడదు. ప్రాణముచే బంధింపఁబడదు. ఈమనోమయపురుషుఁడు మానసదేహములేక సూక్ష్మదేహమును నివసించును. ఆశరీరమునకు జ్ఞానసామర్థ్యములు, ప్రబోధలంకరాగములు, జంగమప్రభుత్వములు, స్థూలప్రాణస్థితులకన్న తక్కువవ్యాప్తులుగల విశేష గ్రహింపుశక్తులు గలవు. మనుష్యుఁడీ జాగ్రదవస్థను వెనుక నీకనుపించు స్వరూపమునకు లోన నీమనోమయపురుషుని, మానసస్వభావమును, మనోదేహమును మానసలోకమునుఁ గలిగియున్నాఁడు. అది జడత్వమొందక స్వతంత్రముకలదై యిచ్చటవలె నను విరోధియైన లోకముతోఁ బోరాటములేక తనమానసస్వాతంత్ర్యమునకు భంగములేక తన నిర్మలత్వ పరిశుద్ధత్వములకు లోపములేక యుండును. మనుజుని సమస్త యుత్తమసామర్థ్యములు మఱి మానసశక్తు లుత్తమరాగాదులీ మానసలోకము స్థూలమునుచేరించి యావిర్భవించినకొలఁది ప్రభవించును. వృద్ధిజెందును. ఈమనోమయలోకము స్థూలపురుషునకుఁగల మానసమును వృద్ధిజేసి తేజస్విగనకొలది మానవజాతియొక్క నిజతత్వమైన మనోమయపురుషునకు విశేష శక్తి కలుగుచున్నది.

ఈమహోన్నతమానసవ్యక్తి ప్రబోధకలుగుటకు, నీమానస పురుషుఁడౌటకు నీమానసస్వభావము వహించుటకు స్థూల ప్రాణ కోశములతోపాటు మానసదేహమందు నివసించుటకు మనుజునకు సాధ్యమే. ఈమార్పు పరిపూర్ణమైనకొలఁది సమున్నతమైన దివ్య జీవితమునకు వీలుకలదు. ఈసాధారణ ప్రాణదేహముల కలవిగాని స్పర్శల దృష్టుల శక్తులనొందఁగలఁడు. స్వచ్ఛమైన జ్ఞాననిర్మలత్వము

తో సమస్తమునుఁ బరిపాలించఁగలఁడు. రాగాదులు మనోమయ లోక పరిపూర్ణత్వమునకు లేవనెత్తఁబడును. ఇంద్రియజ్ఞానములు జడమాంద్యమునుండి విముక్తిగాంచఁగలవు. తెలివి స్వచ్ఛమై యపరిశుద్ధ జడప్రాణశక్తి జనితాభ్యంతరముల విడువఁగలదు. ప్రేమానురాగములచే నితరభూతముతో నైక్యమొందును. మానసికసుకంఠెనుత్తమమైన జ్ఞానానందములఁ బ్రతిఫలింప సమర్థుడైయుండును. ఊర్ధ్వమానసమునకు సంబంధించిన సహజజ్ఞానావేశములఁ బూర్తిగాఁ బొంది తదనుగుణ్యమైన పరిపూర్ణమనోస్థితి నిర్మించుకొనును. అతఁడాత్మను మిక్కిలి ప్రకాశమానమైన తీవ్రతతోఁ దనస్థితి సమరసత్వమందు దాని శక్త్యానందవిలాసముతో గ్రహింపఁగలఁడు.

భావప్రపంచమందు (idealism) మనుజుఁడొంద నిత్సగించునట్టి పరిపూర్ణమిదియేయని సామాన్యదృష్టికిఁ దోచును. మానసపురుషుని పరిపూర్ణమిదియని తప్పక గానుపించును. కాని విజ్ఞానపురుషుఁడొందవలసిన పరిపూర్ణ మదికాదు. కారణమేమనగా నిచ్చట సహితము విజ్ఞానానుభవము మానసహద్దునకు లోనై యుండును. అది రాశీభూతమైన ప్రకాశానందముగాక భిన్నత్వస్వభావముకలదై యుండును. పూర్ణతేజము నిజానందము, పైనున్నవి. కాబట్టి నిజపరిపూర్ణత్వముకొఱకుఁ బాటుపడుచున్న మానసపురుషుఁ డధోస్థితిని మించి శుద్ధాత్మయందుఁ బ్రవేశించినఁ బ్రవేశించవలయు. లేకున్న స్థూలజీవితమును తిరిగి పొంది యెక్కువసామర్థ్యమును సంపాదించిన సంపాదించవలయు. ఉపనిషత్తు యీతత్వమే బోధించుచున్నది. అట్లీ స్వర్గములకు సూర్యకిరణములచే మనుజుఁ డెత్తబడుచున్నాఁడని చెప్పుచున్నది. అనగా మానసాతీతమైన సత్యజ్ఞానముయొక్క భిన్నములై వ్యాపించు తీవ్రకిరణములచేఁ బైకెత్తబడునని యర్థము. ఈ

స్వర్గములనుండి తిరిగి రావలసియుందురు. కాని భూలోకజీవితమును త్యజించి సూర్యుఁడనెడు ద్వారమునఁ బైకెక్కువారికిఁ బునరావృత్తి లేదు. సర్వసాధారణముగా నీపూర్వార్ధమీవిధముగా దాఁటిన మానసపురుషుఁడు తిరిగి రాఁడు. కారణమేమనఁగా వాఁడు తన యుత్తరార్ధమునకు నిజగుణమైన యుత్తమస్థితిలోఁ బ్రవేశించుచున్నాఁడు. అట్టి యుత్తమపరార్ధముయొక్క విజ్ఞానస్వభావము నధస్త్రైలోక్యములోనికిఁ దిగఁజాలదు. అట్టి త్రైలోక్యమందు మానసపురుషుఁడే యాత్మావిర్భావముయొక్క యున్నతస్థితియై యున్నాఁడు. మానస స్థూల ప్రాణ దేహత్రితయము మన సామర్థ్య పరిపూర్ణత్వ మేర్పరుచుచున్నది.

విజ్ఞానాత్మలోఁ బ్రవేశించుటచేతను విజ్ఞానమయపురుషుఁడౌటచేతను, దాని యనంతసత్యస్వభావమును వహించుటచేతను కారణదేహమునకు సంబంధించిన విజ్ఞానమయకోశమందును మనోమయ ప్రాణమయాన్నమయ కోశములందును నివసించుటచేతను మనుజుఁడు పూర్తిగా తన భౌతికస్థితిలోనికి విజ్ఞానానంత పరిపూర్ణత్వమును దింపఁగలఁడు. లేదా విజ్ఞానలోకములోనికి తన సర్వమును లేవనెత్తఁగలఁడు. ఇది చాలా కష్టసాధ్యము. కారణమేమనఁగా పై లోకములవ్యక్తి సామర్థ్యము కలవడినట్టియుఁ బరార్ధస్థితికిఁ జెందినట్టియుఁ గారణశరీరమింకను తనయందావిర్భవించినదికాదు. స్వల్పముగా నావిర్భవించి యేర్పడియుండవచ్చును. విజ్ఞానమునకుఁ గారణమైన సత్యజ్ఞానలోకము, యనంతానందలోకము, యుత్తమపరార్ధమునకుఁ జెందినవి. అవి తమ సత్యానందముల వెలుఁగ్గి మనము విజ్ఞానము, పరిపూర్ణమనెడి సమస్తమునకుఁ గారణమైయున్నవి. కాని దట్టమైన ముసుకులోఁజొరఁబడి వచ్చుటచే భౌతికజడత్వమందుఁ

బూర్తిగాఁ గనుపించకున్నవి. ప్రాణమందు వికారమొంది చెడిపో వుచున్నవి. మన యుత్తమస్థితియొక్క శుద్ధతీవ్రతయందుసహితము కొంత చెడిపోవుచున్నవి. సమస్తస్థితులయందు వానితత్వము దాగి యున్నది. మిక్కిలి జడత్వమందుసహితము కలదు. దాగియున్న వాని శక్తిధర్మములచేఁ గ్రిందిలోకములు కాపాడఁబడి పరిపాలింపఁబడుచు న్నవి. కాని యాశక్తి ముసుకు వేసుకొనుచున్నది. స్థూల ప్రాణ మా నసధర్మముయొక్క బంధవికారములలో దాగి పనిచేయుచున్నది. కాని యధోస్థితులయందుసహిత మాపరిపాలనముండుట, సమస్త స్థితుల కేకత్వము కలుగుటచేతను ముసుకుల సామర్థ్యమా లెన్నియు న్న నాశక్తిధర్మముల ప్రబోధకలుగుటకు వాని పరిపూర్ణావిర్భావ మునకు సాధ్యముకలదని మనకు ధైర్యము పుట్టించుచున్నది.

జీవుని యీయూర్ధ్వస్థితుల స్వభావము నీవిజ్ఞానలోకములను గ్రహించుట కష్టసాధ్యమై యున్నది. వేదము లుపనిషత్తులు సహి తము వానిని యలంకారములచే సూచనలచే గుర్తులచే మాత్రమే తెలుపుచున్నవి. అయినను వాని తత్వమునుగురించియు ఫలముల గురించియు రెండుపదార్థములయొక్క హద్దున నిలచియున్న మాన నపురుషుఁడు తెలుసుకొనజాలినంత వ్రాయుట యావశ్యకము. కా రణమేమనగా హద్దుకు పైనున్న మార్గమే యాత్మజ్ఞానమువల్ల బుట్టి న యాత్మవిలక్షణమను యోగపరిపూర్ణత్వమని మనకుఁ దెలుపఁబ డినది. పరిపూర్ణమునుగోరిన జీవుఁడు స్థూలపురుషునిలోనుండి ప్రా ణములోనికి, ప్రాణపురుషునిలోనుండి మానసములోనికి, మానస పురుషునిలోనుండి విజ్ఞానమయపురుషునిలోనికి, విజ్ఞానమయపురుషు నిలోనుండి యానందమయపురుషునిలోనికి నెక్కుచున్నాఁడని యు పనిషత్తు చెప్పుచున్నది. ఈయానందపురుషుఁడే పరిపూర్ణ సచ్చి

దానందునకుఁ బునాది. దానిలోఁ బ్రవేశించుటచే నారోహణము సమాప్తమౌచున్నది. కాబట్టి జీవాత్మయొక్క యీమార్పుఁ పురుషుఁడీ రూపాంతరమొందుట యనగా నేదియో, మనము తెలిసికొనవలెను.





# యోగసంకలనము.

### 34 అధ్యాయము.

## విజ్ఞానము.



పరిపూర్ణాత్మాతీతత్వ మొందుటకు మనముపనిషత్తు చెప్పినట్లు మానసపురుషుని విజ్ఞానమయపురుషునందుఁ జేర్పవలెను. దివ్యజ్ఞానముతో నందు నివసించవలెను. అట్టి వేదపర్వతప్రదేశ మధిరోహించి మనమీ స్థూల ప్రాణ మనోమయ స్వభావమునకంటె వేరైన లోకమందుండుదుము. మనకు నూతనజీవస్థితి సంభవించును. నూతనస్వభావ మొందుదుము. కారణమేమనగా జీవాత్మయొక్క స్థితిననుసరించి ప్రకృతిస్థితియుండును. జ్ఞానజీవుఁ డుత్తమస్థితినొందిన కొలది స్వభావముసహిత ముత్తమకార్యకరణమునకు విపులవ్యక్తికి విశేషశక్తి తీవ్రమైన శుద్ధస్థిత్యానందమునకు లేవనెత్తబడును. కాని మానసపురుషుఁడుగా మారుట వేదకాలపు యోగమందు గొప్ప పరిపూర్ణమార్పుగా నెంచఁబడినది. మన స్వభావమందున్న విశ్వవిషయికాజ్ఞానముయొక్క యంత్యాంకురమును దీసిపారవేసి వస్తువుల యనంతసత్యమందు స్థిర మొందు చేయది. మన మెంతకాలము త్రివిధాత్మకమైన మనఃప్రాణస్థూలమందుండుదుమో యంతవరకు జ్ఞాన

ము జీవునిచేఁ బ్రతిఫలింపఁబడుచున్నను మన స్వభావమజ్ఞానముపై
నాధారపడి పనిచేయుచుండును. కారణమేమనగా జీవాత్మ వ్యక్తి
యందు జ్ఞానమును బ్రతిఫలింపఁజేయుచున్నను గార్యమందు సామ
ర్థ్యములేక యుండును. కార్యమందు సత్యత్వ మెక్కువగును. కాని
దానికి హద్దుకలదు. అనంతజ్ఞానశక్తులతోఁ బూర్ణముగాఁ బనిచేయ
నివ్వని భిన్నత్వమునకు లోనై యుండును. సామాన్యశక్తులతోఁ బో
ల్చగా దానిశక్తి మిక్కిలియెక్కువే. కాని యది యింక నసమర్థతకు
లోఁబడియుండును. దానిని ప్రేరేపించు భావప్రకాశనమును పని
చేయు చిత్తముయొక్క శక్తికిని పూర్తియైన పోలికయుండదు. అచ్చ
ట యనంతుని తేజోమహిమ (సత్) స్థితియందుండవచ్చును. కాని
మన స్వభావకార్యశక్తి యధఃప్రకృతికిఁ జెంది త్రివిధకార్యకరణ
విధానమునకు సంబంధించియుండును. కాని విజ్ఞానమనగా ననంత
దివ్యస్వభావకార్యమే. స్వేచ్ఛపరిశాశతలుగల యాత్మసంస్థితియొక్క
యానందమందు దివ్యచిత్తముతో నేకమైన దివ్యజ్ఞానమది. కాబట్టి
విజ్ఞానమువలన మన మానవత్వమును దివ్యస్వభావముగా మార్చు
చున్నాము.

ఈవిజ్ఞానమన నేమి? దానినెట్లు వర్ణించఁగలము? విజ్ఞాన
శబ్దమునుగురించి సాధారణ వేదాంతాభిప్రాయము రెండు పొర
పాట్లు పడినది. ఈ రెండుపొరపాట్లు విజ్ఞానతత్త్వమునకుండు రెండు
విరుద్ధాభిప్రాయములఁ జెడఁగొట్టుచున్నవి. ఒకదానియందు విజ్ఞాన
శబ్దము బుద్ధిశబ్దమునకుఁ బర్యాయపదముగా నుపయోగింపఁబడుచు
న్నది. హిందువులు బుద్ధిశబ్దమును వివేచన (reason) లేక విచక్షు
ణా మేధకుఁ బర్యాయపదముగా నుపయోగింతురు. ఈయర్థమంగీక
రించు విభాగములు శుద్ధమేధస్సునుండి సరాసరి శుద్ధాత్మలోఁ బ్రి

వేశించుచున్నవి. అవి యీ రెంటికిమధ్య శుద్ధవివేచనకంటె మఱి యొకశక్తి నంగీకరించవు. శుద్ధవివేచనాశక్తికంటె వేఱైనజ్ఞానముయొక్క దివ్యతరకార్యము నొప్పుకొనవు. మరియొక పొరపాటేదియన సమస్త భావనిర్మాణమునకు విలక్షణమైనట్టియు, లేక భావనిర్మాణముతోఁ గలిసి భావసారముగా గనీభవించి యుపనిషత్తు చైతన్యఘనమని చెప్పుచున్న యద్వితీయుని యవిచ్ఛిన్న యద్వితీయభావమందు లీనమైనట్టి యనంతజ్ఞానమివ్వగలవ్యక్తియే విజ్ఞానశబ్దార్థమని తలచఁబడుచున్నది. కాని విజ్ఞానమనగా గనీభవించిన యీయనంత వ్యక్తియేగాక యనంతుని విలాసముయొక్క యనంతజ్ఞానముసహితమై యున్నది. దానియందు సమస్త భావనిర్మాణములున్నవి కాని యవి భావనిర్మాణములచే బంధింపఁబడవు. ఈభావనిర్మాణలక్షణము (ideation) మేధస్సునకు సంబంధించిన భావనిర్మాణముకాదు. మన విచక్షణాత్కారము (reason) కాదు. మేధోభావనిర్మాణముయొక్క విధానము మూలము ఫలములు మానసికములై యున్నవి. కాని విజ్ఞానముయొక్క విధానమూలఫలము లూర్ధ్వమానసికములై యున్నవి. ఈ రెండుభావములకుసంబంధముకలదు. విచ్ఛిన్నమైనయొకవిధమగు నేకత్వముకలదు. ఒకదానివలన రెండవది కలుగుచున్నది. కాని యవి రెండు వేరువేరు లోకములందుఁ బనిచేయుచున్నవి. వాని విధానము భేదించుచున్నది. మిక్కిలి శుద్ధమైన వివేచనాశక్తిగాని మిక్కిలి ప్రకాశమానమైన మేధస్సుగాని విజ్ఞానమనఁబడదు.

విచక్షణాశక్తిలేక మేధాశక్తియనగా హీనబుద్ధియై యున్నది. దానికార్య మింద్రియజన్య విషయములపై మనోజన్యభావములపై నాధారపడియున్నది. నిశ్చయముగా నుత్తమబుద్ధికలదు. దానినే తరుచుగా స్మృతిమానసము స్మృతివిచక్షణమందురు. అది తనస్మృతి

జ్ఞానమువల్లను (Intuitions) యావేశమువల్లను (Inspiration) తీవ్రముగా వెల్లడించు దృష్టివల్లను ప్రకాశమానమైన యంతరదృష్టి విచక్షతవల్లను, వివేచనాతర్కముయొక్క పనిని మిక్కిలి శక్తితో కార్యతీవ్రముతో స్వయంప్రకాశతతోఁ జేయునట్లు కనుపించును. ఆసత్య మింద్రియవిషయముపై నాధారపడి యుండలేదు. మేథోశక్తిజనితముగాక ప్రత్యక్షజ్ఞానజనితమై యున్నది. ఈనిజమైన స్మృతిజ్ఞానమునుండి యీవిచక్షణకు గల మఱియొకశక్తిని విడఁదీయవలెను. ఆశక్తే కొన్నిసమయములందీస్మృతి జ్ఞానమని పొరపడుదురు. ఆశక్తి యేదనగాఁ గ్రమానుసారమైన విచారణ వల్లగాక సరాసరి పర్యవసానమునకుఁ జేరుట. తార్కికవివేచన గ్రమక్రమముగాఁ బ్రతిమెట్టుయొక్క దృఢత్వము కనిపెట్టుచు, బోలుగానుండుభూమిపై నడుచునట్టి మనుజుఁడు గంటికిఁ గనుపించు ప్రతిప్రదేశమును గాలితోఁ బరీక్షించి మరి నడుచునట్లు ముందునకు జరుగుచున్నది. వివేచనకుఁ గల మరియొకవిధానమొక దృఢమైన ప్రదేశమునుండి నమ్మకము గల మఱియొక ప్రదేశమునకు ధుముకు మనుజునివలె వేగమైన యంతరదృష్టికలిగి తీవ్రమైన విచక్షణతో నొక ధుముకు ధుముకునట్టి విధానమైయున్నది. తాను దాటినప్రదేశమునుబరీక్షించి విభాగించక దాని మెట్లను, జిహ్నములను బరీక్షించక మెరుపుకాలములో సమస్తము జూచుచున్నది.

ఈవిధానమునకు స్మృతిజ్ఞానశక్తిని బోలినశక్తి తీవ్రము, ప్రకాశము దృఢనమ్మకము కలవు. స్మృతి జానమని ప్రమాదవశమునఁ బొరపడుట కవకాశముకూడ కలదు. తరుచుగా నీస్మృతిజ్ఞానము దేనియందు సమస్త తార్కికమునోవిచారణ తెలిసియో తెలియకనో పూర్తిగానో యసంపూర్తిగానో త్వరితముగాఁ జేయఁబడుచున్న

దో యట్టి తీవ్రవిధానముకంటె వేఱుకాదని తలచఁబడుచున్నది. స్వభావమునుబట్టిజూడ నీవిధానము స్మృతిజ్ఞానముకంటె వేరై యున్నది. దానిదాటు జనము తుదకు జారిపడుటలో సమాప్తమొందవచ్చును. దానివేగము మోసము చేయవచ్చును. దాని దృఢనమ్మకము పొరపాటు కావచ్చును. దాని పర్యవసానవేగ మింద్రియవిషయ సాక్ష్యమునుబట్టి మేధోభావముల తర్కయుక్తముగాఁజర్చించుటపైఁ దరువాత సరిచూచుటపై నాధారపడకఁ దప్పదు. కాని స్మృతిజ్ఞానము దాని సత్యముయొక్క నమ్మకము తనలోనే కలిగియున్నది. ఎంత కాలము దానితో నింద్రియభ్రమ మేధోభావనిర్మాణము కలియక శుద్ధస్మృతి జ్ఞానముగా నుండునో యంతకాలమది తప్పనిది దృఢమైనది. తరువాతనది వివేచనచే నింద్రియ విషయములచే సరిచూడఁబడవచ్చునుగాని యాసరిచూచుటపై నది యాధారపడి యుండలేదు. తనయూహాపోహాలపై నాధారపడియుండు వివేచనము స్మృతి జ్ఞానమును నిషేధించినను విశేషజ్ఞానమువలనఁ దుదకు స్మృతిజన్య పర్యవసానమే సరియైనదనియుఁ దార్కికపర్యవసానము తప్పనియుఁ దేలుచున్నది. కారణమేమనగా నిజమైన స్మృతిజ్ఞానము వస్తువునకు స్వతస్సిద్ధమైన సత్యమునుండి జనించుచున్నది. అట్టి స్వతస్సిద్ధ సత్యమువల్లఁ గలుగుచున్నది. కాని వివేకప్రాప్తికై నొకదానిపై నాధారపడియుండు పరోక్షవిధానమువల్ల కాదు.

సహజజ్ఞానముసహితము (స్మృతిజ్ఞానము) విజ్ఞానముకానేరదు. అది విజ్ఞానముయొక్క ప్రకాశము. మానసములోనికి తేజోరూపమున మెరుపువలెఁ బ్రవేశించుచున్నది. దానియావేశములు సహజజ్ఞానము లావిష్కరణములు స్వయంప్రకాశమాన విచక్షణ లూర్ధ్వవిజ్ఞాన లోకమునుండివచ్చు వార్తలై యున్నవి. అవి మన మధోవ్య

క్తిలోనికిఁ బ్రవేశించుచున్నవి. సహజజ్ఞాన మానసముయొక్క వ్యాపారస్వభావమునకును స్వతసిద్ధమైన విజ్ఞానవ్యాపారస్వభావమునకును విశేష తారతమ్యముకలదు. అది స్వల్పప్రత్యేకప్రకాశములవలనఁ బనిచేయుచున్నది. దానిసత్యము తరుచుగా స్వల్పావరణమందున్నది. ఒకమెరుపుచేఁ బ్రకాశించు నొక జ్ఞానస్థానమునకుఁ జెందియున్నది. చతుష్పాతులందు సహజజ్ఞానవ్యాపారము గాంచుచున్నాము. అది యింద్రియమానసజన్యమై తనంతటఁబనిచేయు సహజజ్ఞానము. చతుష్పాదులు దానిపై నాధారపడియున్నవి. మానుషవివేచనకుఁగల ప్రకాశము దానికిలేదు. వివేచనకంటె మిక్కిలి నమ్మఁదగినదిగాఁ గనుపించు నీజడసహజజ్ఞానముయొక్క యద్భుతసత్యము నిర్ణయింపఁబడిన ప్రత్యేక ప్రయోజనముకొఱకైనది. మృగమానసమా హద్దు దాటి పనిచేయ నెత్నించినపుడు మానుషవివేచనకంటె మిక్కిలి యంధత్వముతో బహుప్రమాదములఁ జేయుచున్నది. ఇంద్రియానుభవపరంపరలవలన బహుప్రయాసపై నేర్చుకొనవలసియున్నది. మనుజులకు మనోమయ సహజజ్ఞానము ప్రత్యక్షప్రమాణముకలది. అది యింద్రియజనిత సహజజ్ఞానముకాదు. అది యింద్రియములకుఁగాక మేధకుఁ బ్రకాశతకలిగించును. అది స్వయంవ్యక్తి ప్రకాశములుకలది. సగమువ్యక్తిగల యంతరప్రకాశముకాదు. అది స్వయముగాఁ బనిచేయఁగలదు. తనంతటఁ బనిచేయు జడవ్యాపారము దానికిలేదు. కాని యదిసహితము జంతుసహజజ్ఞానమువలెనే బంధింపఁబడినది. చిత్తముయొక్క జ్ఞానముయొక్క ప్రత్యేకప్రయోజనముకొఱకు బంధింపఁబడినది. మేధ దానినుపయోగించుకొనుటకుఁగాని వృద్ధిచేయుటకుఁగాని బ్రయత్నించినయెడల తనకు స్వతసిద్ధమైన స్వభావానుసారముగాఁ దనచుట్టు సత్యాసత్యసంఘాతమును గల్పించుకొ

నుచున్నది. ఇంతేగాక నింద్రియజన్యభ్రమను భావజన్యభ్రమనందుఁ బ్రవేశపెట్టిగాని భ్రమ తోడుగుతొడిగిగాని దానిసత్యమును జలింపఁ జేయుటేగాక యసత్యముగా మార్చఁగలదు. కాబట్టి సహజజ్ఞానము మనకెంత మంచినివ్వఁగలదనఁగాఁ దీవ్రమైన కొద్దిపాటి ప్రకాశము నే కలిగించును. అది యెంతచెడుగు చేయఁగలదనఁగా మనము దానిని యక్రమముగా నుపయోగించినయెడలఁ గల్లోలము కలిగించును. ఈకల్లోలమును మేధోవిచక్షణము తప్పించుకొనఁ జూచుచున్నది. అది తన యప్రమాదకరమైన విధానభారముతో దృష్టివహించును. హీనప్రయోజనములకది యప్రమాదకరము.గాని వస్త్వంతఃసత్యము నకు దారిజూప నేరదు.

మేధోవివేచనపై నాధారపడుట తగ్గినకొలది సహజజ్ఞానము ను వృద్ధిచేసి ప్రబలముగా నుపయోగింతుము. ఇప్పుడు జరుగుచున్నట్లు ప్రత్యేకమైన ప్రతి సహజజ్ఞానమును ప్రకాశమును బట్టుకొని తక్షణము దానిచుట్టు మన భావమేధోవ్యాపారములు గనీభవించునట్లు చేయుటగాక నొకదానివెంటనొకటి వచ్చుచుండు సహజజ్ఞాన ప్రవాహముందు యోచించునట్లు మానసమును శిక్షించవచ్చును. మేధను శుద్ధిచేసినకొలది మనమీావిషయమున విజయము పొందఁగలము. వస్తుబహిరాకారమునకు లోఁబడియుండు స్థూలభావము తగ్గించి కోరికలకుఁ గామాదులకు స్థితిప్రేరేపణలకు దాస్యముచేయుఁ బ్రాణభావము తగ్గించి మన వెనుకటియుద్దేశ్యములకు స్థిరపడియున్న భావములకు మేధోవ్యాపారమునకు లోఁబడియున్న మేధో భావమునువిడిచి వాని ప్రత్యామ్నాయా వానిస్థానమందు సహజ జ్ఞానేంద్రియము సహజజ్ఞానచిత్తము సహజజ్ఞానభావకల్పనము స్థాపింపఁబడినకొలది మనకు విజయమురాఁగలదు. అన్నమయ ప్రాణమ

య మనోమయ త్రివిధబంధమునకు స్వతస్సిద్ధముగా బంధింపఁబడియున్న మన వ్యక్తికిది కష్టసాధ్యమైయున్నది. వేదమందు యూపస్తంభమునకు శునశ్శేపుఁ డూర్ధ్వమధ్యమాధమ బంధనములచేఁ గట్టఁబడినాఁడని చెప్పిన యితిహాసము బహిరాకార సత్యమిశ్రమమునకు జీవుఁడు బంధింపఁబడుటను సూచించుచున్నది.

కాని పూర్తిగానది తటస్థించినను సహజజ్ఞానముమాత్రము విజ్ఞానముకాదు (gnosis). అది విజ్ఞానముయొక్క ప్రతిబింబము. వీని తారతమ్యమిట్టిదని నిరూపించుట బహుకష్టము. వేదమందు దీనికొక యితిహాసము కల్పింపఁబడినది. అలంకారయుక్తముగాఁ జెప్పఁబడినది. విజ్ఞానము సూర్యుఁడుగా నాకాశము మనోమయముగా వాయువు ప్రాణమయముగా భూమి యన్నమయముగా వర్ణింపఁబడినది. భూమియందు నివసించునప్పుడు వాయువు నధిరోహించినప్పుడాకాశమున నెగురునప్పుడు మనోమయపురుషుఁడు సూర్యకిరణములందే నివసించునుగాని సూర్యునందుఁగాదు. వాఁడు వస్తుసముదాయమును దనదృష్టికి గోచరించినరీతి దృష్టిజనితదోషముల ననుసరించి చూడఁగలఁడు. కాని విజ్ఞానమయపురుషుఁడు సూర్యునందే నివసించుచున్నాఁడు. జ్యోతిలో జ్యోతియొక్క ప్రకాశములో నివసించుచున్నాఁడు. స్వస్వరూపప్రకాశమందుండుటచేత తన స్వరూపతేజముగా నాసూర్యుని గ్రహించుటేగాక సూర్యకిరణములందుండు సమస్తమును యథోత్రివిధాత్మకసత్యమును దానియందుండు ప్రతి విషయమును జూచుచున్నాఁడు. వాఁడు దానిని తన మానసేంద్రియ ప్రతిబింబముచేఁ దెలుసుకొనక జ్ఞానసూర్యుఁడే తన నేత్రముగా జూచుచున్నాఁడు. సూర్యుఁడు దేవతలకు నేత్రమని వేదము చెప్పుచున్నది. మనోమయపురుషుఁడు సహజజ్ఞానమందుసహితము సత్య

ముయొక్క ప్రతిబింబమునే మానసదృష్టికిఁగల స్వల్పసామర్థ్యహద్దునకులోఁబడి గాంచుచున్నాఁడు. విజ్ఞానమయపురుషుఁడు విజ్ఞానమువల్లనే సత్యమును జూడఁగలఁడు. సత్యముయొక్క కేంద్రస్థానమునుండే దాని స్వస్వరూపమందు స్వయంప్రకాశమానమగు యకారణవిధానముచే సత్యమును గ్రహించుచున్నాఁడు. విజ్ఞానము దివ్యపరోక్షజ్ఞానము. అపరోక్షమానుషజ్ఞానముకంటె వేఱైనది.

విజ్ఞానముయొక్క స్వభావమెట్టిదో మనస్సుతో గ్రహించవలెనన్న మేధోమానసముతో దానిని పోల్చుటవల్ల గ్రహించవచ్చును. అప్పుడుసహితము కొంత యనుభవములేకున్న మాటలతోఁ దెలుపుటకు వీలులేదు. వివేచనవల్లనేర్పడిన యేభాష వివేచనాయూర్థ్యమును వెల్లడించఁగలదు ? మానసవివేచన యజ్ఞానముతోఁ బ్రారంభించి సత్యమునకుఁ జేరుచున్నది. విజ్ఞానమున సత్యము ప్రత్యక్షమునఁ గాన్పించుచున్నది. వివేచనపై పైవికారములతోఁ బ్రారంభించి వానితో సంబంధము కొద్దిగా విడిచియో విడువకనో లోనున్న సత్యమును జేరఁ బ్రయాసపడుచున్నది. విజ్ఞానమైతే సత్యమునుండి ప్రారంభించి వికారాకారముల నన్నింటిని సత్యప్రకాశమందుఁ జూపించుచున్నది. వివేచన పర్యవసానము నూహించుచున్నది. విజ్ఞానము ప్రత్యక్షమునఁజూచి తెలుసుకొనుచున్నది. స్థూలనేత్రము వస్తువులఁ బ్రత్యక్షమున నెట్లు చూచుచున్నదో యట్లు విజానము వస్తుసత్యమునుజూచి గ్రహించుచున్నది. వస్త్వేంద్రియసంయోగమువలన విషయజ్ఞానము జనించునట్లు విజ్ఞాన మేకత్వమువలన వస్తువుతో నైక్యమగుచున్నది. మనుజుఁడు ప్రత్యక్షమున తనస్థితిని తెలుసుకొనుచున్నట్లు విజ్ఞానము సమస్తవస్తువులఁ బ్రత్యక్షమున గాంచుచున్నది. ఇంద్రియజనితమే వివేచనకుఁగల ప్రత్యక్ష

జ్ఞానము. మిగిలినసత్యము పరోక్షమునఁ గలుగుచున్నది. విజ్ఞానము నకు సమస్తము ప్రత్యక్షజ్ఞానమే. కాబట్టి మేధోజన్యసత్యము ప్రయత్నసంసిద్ధమై యనుమానమునకు నసంపూర్ణమునకు నపరిపూర్ణ జ్ఞానమునకు నజ్ఞానాంధకారమునకు నాస్పదమౌచున్నది. జ్ఞానాభివృద్ధినొందినకొలది మారుచున్నది. విజ్ఞానజనితసత్యమున కనుమానము లేదు. ప్రత్యక్షప్రమాణము ప్రత్యక్షస్థితికలది.

వివేచనకు సాధనము శోధన. అది సాధారణశోధనము, వికలనశోధనము, సంకలనశోధనమని త్రివిధము. పోల్చుట తారతమ్యము కనిపెట్టుట సంబంధము గ్రహించుటవలన వివేచన వృద్ధిగాంచుచున్నది. తార్కికవిధానముచే నూహించుటవలన వ్యాకరణమువలన (Duduction) ప్రతిష్ఠాపనమువలన (Induction) యనుభవము నుండి ప్రత్యక్షజ్ఞానమిచ్చుచున్నది. జ్ఞాపకశక్తి దానికాధారము. కల్పనాశక్తివలన తన్నతిక్రమించి తీర్మానించుకొనుచున్నది. ఇదియంతయుఁ బ్రయత్నపూర్వకవిధానము. విజ్ఞానము ప్రయత్నించదు. తనలో స్వతసిద్ధముగాఁ గలది. అది ప్రబోధించఁ దలచినప్పుడుసహితము ప్రయత్నముచేయదు. కాని వెల్లడిచేయుచున్నది. మానసము నుండి విజ్ఞానమున కధిరోహించుచున్న వ్యక్తియందు కల్పనాశక్తికి బదులు క్రమక్రమముగా సత్యావేశము (truth-inspiration) కలుగుచున్నది తీర్మానమునకుబదులు స్వయంప్రకాశమానమైన వివేకము కలుగుచున్నది. తర్కవిధానమునకు మారుగా తక్షణమే యొకసారిగాఁ బర్యవసానమునకు రాఁగల తీవ్రసహజజ్ఞానవిధానము వచ్చుచున్నది. శోధనకుబదులుగా వస్తుప్రత్యక్షమేగాక దానిసత్యత్వ ప్రత్యక్షము కలుగుచున్నది. నమ్మరాని జ్ఞాపకశక్తికిబదులు ప్రియు

త్నపూర్వకముగాక వ్యక్తికి స్వతస్సిద్ధమైన జ్ఞానప్రకాశ సంసిద్ధి కలుగుచున్నది.

వివేచన కాలభేదములు కలది. ఒకవేళ ఫలసంసిద్ధినొందును. మరియొకతరి ఫలశూన్యమాచున్నది. విజ్ఞానమో ? భూతభవిష్యద్వర్తమానముల నొకేసారివీక్షించి వానిసంకలనదృష్టిగలది. విజ్ఞానము మొత్తముతోఁ బ్రారంభించి భాగములకు మొత్తమునకుఁగల సంబంధములఁ గనిపెట్టుచున్నది. మానసవివేచనమైతే మొత్తమెట్టిదో యెఱుఁగదు. భిన్నభాగముల సంకలన వికలనములవలనఁదప్ప మొత్తమును బూర్తిగా గ్రహించనేరదు. లేకున్న సమస్తము దానికిఁ గల్లోలముగా నసంపూర్తిగానుండును. వివేచనము వస్తువిధానముల గుణములఁబరికించి విమర్శించి వస్తుతత్వమునుఁ దెలుసుకొనుటకు వృథాప్రయత్నము చేయుచున్నది. విజ్ఞానము వస్తువునే దర్శించుచున్నది. ఆవస్తువుయొక్క యనంత నిజస్వభావమును దర్శించుచున్నది. విధానగుణముల దానిస్వభావముయొక్క యావిర్భావనముగాఁ దెలుసుకొనుచున్నది. వివేచన విభాగమందుఁ బనికలది. వేరువేరు వస్తుస్థితులతో సంబంధించినది. కాలస్థలవిభాగములఁ బరిగణించినట్లు వస్తుభిన్నత్వముతోఁ బనిచేయును. అది మొత్తముమీద నేకత్వమును గనిపెట్టును. భిన్నత్వము తీసివేయుటచేతనో లేక సగటుమీద యభిప్రాయముచేతనో యేకత్వమును గ్రహించఁగలదు. విజ్ఞాన మేకత్వమందు నివసించి యేకత్వమునుండి నిర్గమించి భిన్నములనన్నింటిని నైక్యదృష్టితోఁ జూచుచున్నది. అది భిన్నభావము నంగీకరించదు. మొదటి యేకత్వమునకంటె వేరైన స్వతంత్రస్థితులు వస్తువులకున్నవని తలచదు. వివేచన యాది యంత్యములుగల వస్తువులతోఁ బనిచేయఁగలదు. అనంతమందు చేతకానిదాచున్నది. ఆయనంతమనగా

నాదియంత్యములుగల దాని యనంతవిపులత్వమని గ్రహించును. అనంతమిట్టిదని కష్టమువిూద నూహించునేకాని దాని నిజతత్త్వ మెరుగఁజాలదు. విజ్ఞానమైతే యనంతమందు నివసించుచున్నది. అనంతము నుండి నిర్గమించి యాదియంత్యములుగల వస్తువుల యనంతముతో వానికిఁగల సంబంధములనుబట్టి గ్రహించుచున్నది.

వివేచనతోఁబోల్చి యసంపూర్తిగా విజ్ఞానమిట్టిదని వర్ణించుటకుమారుగా నదియెట్టిదో చెప్పఁబూనినప్పు డలంకారములతో గుర్తులతోఁ జెప్పనేర్తుమేగాని వేరువిధములేదు. విజ్ఞానస్థితి మనవ్యక్తియొక్క పరమోన్నతస్థితిమాత్రము కాదని మనము జ్ఞాపకముంచుకొనవలసియున్నది. అనంతములైన సత్, చిత్, ఆనందములనఁబడు కేవలయాత్మయొక్క త్రివిధప్రకాశమునకును మన యధోత్రివిధస్థితికిని మధ్యనిలిచి రెంటినిగలుపులంకె విజ్ఞానము. సూర్యమండలములోనికి ననంతమైన తేజస్సు పోగుచేయఁబడి సూర్యునిపై నాధారపడియున్న సమస్తములోనికి వ్యాపింపఁజేయఁబడునట్టుల సచ్చిదానందుఁడు తన తేజస్సును విజ్ఞానములోనికిఁబోగుచేసి దివ్యజ్ఞానచిత్తానందరూపమున జీవునియందుఁ బ్రవేశపెట్టుచున్నాఁడు. విజ్ఞానము తేజమేగాక శక్తిసహితమైయున్నది. అది సృజించుజ్ఞానము. క్రియారూపమునఁ దనంతటఁదాఁ బరిణమించు నీశ్వరభావముయొక్క సత్యము. ఈభావము సృష్టిముఖమైన యేదోయొక కల్పనాశక్తి (Imagination) కాదు. వ్యర్థముగాసృజించు నేదోయొక విషయముకాదు. సత్యమైనశక్తితోనిండిన సత్యప్రకాశము. అది తనలో లీనమైయున్న దానిని వెలిఁబుచ్చును. ఇదివరకెన్నడులేని యసత్యమును సృజింపఁజాలదు. భావమెట్టిదో భావకల్పనమట్టిదై యుండును. విజ్ఞానముయొక్క భావకల్పనము జ్ఞానముయొక్క తేజోపరివర్తనమైయున్నది. ప్రతికిరణ

యొక సత్యమే. దానిచిత్తమే వ్యక్తిగలశక్తి. ఆవ్యక్తిగలశక్తి పదార్థవ్యక్తుల ననంతరూపములుగాఁ బరిణమింపఁజేయును. ఆయనంతరూపములందాభానముండి తన స్వభావానుగుణ్యముగాఁ బనిచేయుచున్నది. దివ్యభావము సృజించుశక్తిని కలిగియుండుటచే విజ్ఞానచిహ్నమైన ప్రభువైన సూర్యుఁడు సమస్తమునకు జనకుఁడైన తేజముగాను (సూర్యసావిత్రి-జ్ఞానప్రకాశత) స్థితిని కల్పించువానిగాను వర్ణింపఁబడినది. దానిసృష్టి యానందపేరితమై యున్నది. సృష్టియందుఁగల తనసత్యమువలన శక్తివలనజనించిన యానందముతో నిండియున్నది. కాబట్టి విజానలోకమేదియన రితంభరా. సత్యమై సుఖమగుసృష్టి. దానియందు సమస్తము పూర్ణానంద మనుభవించుచున్నది. దివ్యజ్ఞానచిత్తానందముల స్వీకరించి యేకాగ్రతనొందించి జ్ఞానచిత్తానంద కార్యరూపమునఁ బరిణమింపఁజేయుటే విజ్ఞానజీవుని స్వభావము లేక ప్రకృతి.

ఇట్లు విజ్ఞానమునకు మూఁడుశక్తులు గలవు. (1) అది యనంతస్థితిజ్ఞానానందములఁ దెలుసుకొని తనలోనికి స్వీకరించుచున్నది. దాని యుత్తమస్థితియందనంత సచ్చిదానందజ్ఞానమై యున్నది. (2) అది సమస్తమును చైతన్యఘనము లేక చిద్ఘనము (Dense luminous consciousness) గా నేకాగ్రత పొందించుచున్నది. దివ్యపురుషుని సమస్తవిషయములతో దివ్యవ్యక్తిభావముయొక్క సమస్త సత్యములతో దాని స్వభావములతోనిండిన దివ్యవ్యక్తికి బీజమదే. (3) దివ్యజ్ఞానచిత్త శక్త్యా (will-force) నందములయొక్క క్రియారూపకమైన భావనిర్మాణమువలన నది బ్రహ్మాండ సమరసత్వముగాఁ బరిణమించుచున్నది. కాబట్టి మనోమయపురుషుఁడు విజ్ఞానములోని క ధిరోహించినపు డీమూఁడుశక్తుల నొందుచున్నాఁడు. తనశక్తుల వి

జ్ఞానశక్తులుగా మార్చుచున్నాడు. మనోమయపురుషుడు తనమానసికభావనిర్మాణమును దివ్యజ్ఞాన చిచ్ఛక్త్యానందములుగా మార్చుచున్నాడు. తన మానసస్వభావమునకు సంబంధించిన వ్యక్తిపదార్థమును భావనిర్మాణమునకు మూలమైన చిద్ఘనముగా మార్చుచున్నాడు. తన వ్యక్తిస్వరూపమును విజ్ఞానస్వరూపము లేక ననంత సచ్చిదానందముయొక్క సత్యస్వరూపముగా మార్చుచున్నాడు. సమస్త విజ్ఞానమయ స్వభావకార్యములు తన్మూలకమున జనించుచున్నవి. ఈమూడువిధానము లీశోపనిషత్తునందిట్లు వర్ణింపఁబడినవి. వ్యూహా సమూహా తేజములని వర్ణింపఁబడినవి. సత్యజ్ఞానానుసారముగా విజ్ఞానసూర్యకిరణముల నమర్చుటే వ్యూహామనఁబడును. సమూహామనగా విజ్ఞానసూర్యమండలములోనికిఁ గిరణములన్నింటిని పోగుచేయుట. అన్నిటికన్న నుత్తమస్వరూపమైనట్టియు దేనియందు జీవాత్మ యుత్తమపురుషునితో నైక్యమొంది సోహామని కేకవేయుచుండునో యట్టి వి నసూర్యదర్శనమే తేజము. దేవుఁడు పైన నుండగా జీవాత్మ దేవునితో నైక్యమైయుండుట. దేవుని యనంతశక్తి సత్యములు తేజోమయమైన జీవాత్మ స్థితియందే కాగ్రితనొందుట. పరావర్తనమొంది వ్యాపించుచున్న దివ్యజ్ఞాన చిత్తానందములు పూర్తిగా ప్రకృతికార్యమొందుట—విజ్ఞానమందున్న జీవాత్మానుభవమిదియే. దీనినే వేదము "రితంసత్యంబృహాత్" యని వర్ణించినది.




35 అధ్యాయము.

# విజ్ఞానలక్షణములు.

విజ్ఞానమునకు ముఖ్యలక్షణము జ్ఞానము. కాని దానికింక ననేకశక్తులుగలవు. ఇతరలోకములవలెనే దానికిఁ బ్రత్యేకలక్షణములున్నవి. ఆలోకమందది సర్వకార్యములకు నుపకరణమగుచున్నది. అది యితరశక్తులసహితము స్వీకరించి వానిస్వభావమును దన కనుగుణ్యముగామార్చి సరిచేయుచున్నది. ఉదహారణగానకు మానసలోకమందుఁ దెలివిలేక మానసవ్యక్తి ముఖ్యధర్మము. మనోమయపురుషునకు ముఖ్యగుణము తెలివి. తెలివికతఁడు కేంద్రస్థానము. ఘనీభవించిన తెలివియే యతనివిధానము. గ్రహించుటకును దెలుపుటకును శక్తిగల మేధ. వానికి స్వకీయస్థితి పరిజ్ఞానముకలదు. తనకంటె నితరస్థితి పరిజ్ఞానమున్నది. తన స్వభావకార్యపరిజ్ఞానము పరుల స్వభావకార్యపరిజ్ఞానము సహితముకలదు. చేతనాచేతన పరిజ్ఞానము తనకు వానికిఁగల పరస్పరసంబంధ పరిజ్ఞానముకలదు. ఇంతటితో నతని స్థిత్యానుభవము సమాప్తమొందుచున్నది. ఇతరములైన స్థితిజ్ఞానమత

నికిలేదు. తన తెలివిచే గ్రహింపసాధ్యమై తనకుఁ దోచునంతవరకే గాని జడప్రాణములయొక్క యితరజ్ఞానమతనికి లేదు. అతనికి గోచరింపక వ్యక్తముగాకున్న దంతము లేనిదే. మనుష్యుఁడు మనోమ్మయపురుషుఁడు. కాని జడమతనికి తోఁచుగు. స్థూలజ్ఞానమునకు సాధనములైన బహిరింద్రియకార్యములతో నతఁడు ప్రారంభింపవలెను. మానసవ్యక్తితో మొదటఁ బ్రారంభించఁడు. బహిరింద్రియములతోఁ బ్రారంభించినను మానసజ్ఞానము వానియందుఁ బ్రవేశించకున్నఁ దెలివికనుగుణ్యమైన విలువలు వానికివ్వకున్న స్థూలేంద్రియవ్యాపారమతఁడు వినియోగింపఁజాలఁడు. క్రిందిసర్గములం వేది ప్రాణనాళకార్యమనబఁడుచున్నదో యది మనుష్యునందు శక్తికామచిత్తముల వ్యక్తిగాఁ బరిణమించును. తెలివితోఁగూడిన చిత్తవ్యాపారవ్యక్తిగాఁగాని శక్తివ్యాపారముయొక్క మానసికవ్యక్తిగాఁగాని పరిణమించును. స్థిత్యానందము సుఖదుఃఖవ్యక్తిగాఁ బరిణమించును. ఇష్టాయిష్టజ్ఞానమదియే. ఆనందవ్యక్తియదియే. అనంతరహితత్వమదియే. ఇదియంతయు మనోకల్పితమై చిత్రము. తనకు పరిభాగమున తన్నుచుట్టి వ్యాపించినదియుఁ దానివసించునదియు సర్వవ్యాపక దేవుడతనికిలేనివారే. అనంతుఁడు మానసికజ్ఞానమందు గోచరుఁడౌవరకు పరామాత్మవ్యక్తి తెలివియందుఁ దోచువరకు వారందఱు కల్లగాఁ గనుపింతురు

కాబట్టి విజ్ఞానమయపురుషుఁడు స్వభావముచే సత్యజ్ఞానమైయున్నాఁడు. వస్తుసత్యత్వదృష్టి చక్రమునకు కేంద్రస్థానముపరిధియైయున్నాఁడు. విజ్ఞానమునకు గనీభావవిధానములేకఁ గారణశరీరమైయున్నాఁడు. అంతర ధర్మానుసారముగా వస్తువుల సత్యశక్తిని స్వీక

రించి ప్రసరింపఁజేయు కార్యమైయున్నాఁడు. విజ్ఞానమందు మనకు గలుగు వస్తుసత్యత్వమైక్యమునకు నేకత్వమునకు భిన్నత్వజనితమైన హైక్యమునకు బహుళత్వమందైక్యమునకు సత్యత్వమాచున్నది. సదా యది హైక్యమే, సత్యత్వమే. కాబట్టి విజ్ఞానస్థితిలక్షణమనగా సమస్తవస్తువులతో మనమైక్యమొందుట. బ్రహ్మాండమందంతట సర్వవ్యాపకమౌట. బ్రహ్మాండమందు సమస్తపరిజ్ఞానమొందుట. సాధారణముగా విజ్ఞానమందు పురుషుఁడు తనది యనంతస్థితియను వ్యక్తియుఁ దనలోఁ బ్రపంచమంతయుఁ గలదనువ్యవ్యక్తియుఁ గలవాఁడు. ప్రపంచములోనివాఁడనను వ్యక్తితో బంధింపఁబడిన మానసపురుషునివంటివాఁడు కాఁడు. కాబట్టి విజ్ఞానస్థితినొందుటకు మొదటి సోపాన మహంకారవిమోచనమే. మన మహంకారమందున్నంతవర కాయున్నతసత్యము నొందఁగోరుటవ్యర్థము. అహంకారభావమహంకారవ్యాపార మహంకారచిత్తముల మరల నెంతమాత్రము కలిగినను బొందఁబడిన విజ్ఞానసత్యమునుండిజారి భిన్నమానసముయొక్క యసత్యవ్యక్తిలోనికిఁ బడిపోవుటే. క్షేమకరమై ప్రమాదరహితమైన సర్వసమత్వమే యీయుత్తమవ్యక్తికి మూలము. సమస్త వస్తుభూతములు మనమేనని తోఁచవలెను. వానితో మన మేకత్వమొందవలెను. అవి మనమేననియు వానిస్థితి మనదేననియు వాని జ్ఞానము మనదేననియు వానిశక్తి మనదేననియుఁ దెలియవలెను. సమస్తముతో నేకాత్మమై యుండుటెట్లో మనము నేర్చుకొనవలెను.

వ్యష్టి మానస ప్రాణదేహములందు బంధింపఁబడిన వ్యక్తే మనమని యెంతకాలము తలుచుచుందుమో యంతవరకు నీసర్వసమత్వము పూర్ణముగానొందుట సాధ్యముకాదు. స్థూలమునుండి మానసమునుండి సహితము విజ్ఞానమయశరీరములోనికి పురుషుఁడు

కొంతమట్టుకు లేవనెత్తబడవలెను. మనయోచనకుఁ గేంద్రస్థానము మేధస్సు కాఁజాలదు. తదనురూపమైన మానసకమలము కాఁజాలదు. హృదయముగాని తదనురూపమైన కమలముగాని రాగాదుల్కుఁ గేంద్రస్థానము కాఁజాలదు. స్థితి భావక్రియావ్యక్తులకుఁ గేంద్రస్థానము దేహమానసములవిడిచి పైన స్వతంత్రస్థానమాచున్నది. ఇక మనము దేహమందుంటిమనుభావముండదు. మనము దానికి ప్రభువని స్వాధీనముచేసుకొన్న యీశ్వరుఁడని భావించుచు స్థూలవ్యక్తికంటె విపులమైనవ్యక్తిని దానికిఁ గలిగింతుము. జీవుఁడు శరీరమునుధరించినాఁడు, శరీరమందులేఁడు, జీవునియందు శరీరమున్నదని ఋషులు చెప్పినప్పుడు వారిభావమేదియో దానిని సర్వసాధారణముగా సదా ప్రత్యక్షమునఁ దెలుసుకొందుము. మెదడులోనుండిగాకఁ బైనుండి మన భావకల్పనలు చిత్తవృత్తులు పుట్టఁగలవు. మేధోవ్యాపారము పైనుండికలిగెడి భావశక్తి చిత్తశక్తిప్రహారములకు స్థూలయంత్రమిచ్చు ప్రత్యుత్తరవిధానమైయున్నది. సమస్తము పైనుండి యుత్పన్నమాచున్నది. మన ప్రస్తుత మానసవ్యాపారమునకు సరిపోలిన సమస్తము విజ్ఞానమందుఁ బైన జరుగుచున్నది.

ఈకేంద్రస్థానమీ కార్యము స్వాతంత్ర్యముకలిగి బంధింపఁబడక ముఖ్యముగా దేహమందుఁగాని ప్రత్యేక వ్యష్టిపురుషునందుఁగాని చిక్కుకొనియుండలేదు. కారణమేమన మనవ్యక్తి సర్వవ్యాపకమై సర్వాంతర్గతమైయుండును. ప్రత్యేక కేంద్రస్థానము వ్యష్టికార్యమునకు సాధనమాత్రమే. వ్యక్తియుక్తమైన మనకార్యములు సర్వవ్యాపకములు. సర్వవ్యాపకునితో నైక్యముకలవి. సర్వవ్యాపకత్వమునుండి జనించి చంచలవ్యష్టిని బొందుచున్నవి. దానిశక్తుల వ్యష్టిరూపమొందించుటకుఁ దీవ్రతకలిగియున్నప్పటికి నదిసర్వసమత్వముతోఁ

బనిచేయు ననంతునివ్యక్తియే. అదిమనమిప్పుడు వ్యష్ట్యత్వమని దేనిని గ్రహించితిమో యదికాదు. ఈజ్ఞానస్థితి యెంతవిపరీతమైనదనగా వివేచనగల ప్రతిమనుజునకది యసంభవము వెలిబెట్టబడినస్థానమని తోచకమానదు. మానసవ్యక్తికిసహితమది శాంతస్వాతంత్ర్య తేజోశక్తి కార్యనిర్వాహక భావనిర్మాణరూపమున వెల్లడియగుచున్నది. కారణమేమనగా నది బంధవిముక్తిగాంచిన యుత్తమమానసస్థితులందుఁ బ్రారంభమై విజ్ఞానమందుమాత్రము పరిపూర్ణాత్మ స్వాధీనమునకు లేవనెత్తఁబడుచున్నది.

ముఖ్యవిషయము మన కనంతమైయుండవలెను. ముఖ్యమైన యనంతవ్యక్తికంటె యంతము వేరనుభావము మనకసాధ్యమని తోచవలెను. దానియందే యంతమునిలిచి రూపమొంది యేమైనను సత్యముఁ గలిగియుండవలెను. ఎంతవరకంతము మనకు ముఖ్యమనితోచునో మన భావవ్యక్తికి చిత్తవృత్తికి మూలమనితోచునో యనంతభావము దానివలన నప్పుడప్పుడు కలుగుచున్నదని తోచునో యంత వరకు విజ్ఞానము మనకుఁ గడుదూరము. కాని యనంతమే మనకు సర్వసాధారణవ్యక్తి కావలెను. అంతములు సర్వము దానినుండి యేర్పడినట్లు మన భావచిత్తయానందములకది ఘనాదియైనట్లు తోచవలెను. ఏయనంతమందు సమస్తరూపము లేర్పడుచున్నవో సమస్తసంభవములు పుట్టుచున్నవో యట్టిసర్వవ్యాపకము విస్తృతత్వముమాత్రమే యనంతముకానేరదు. దానివెనుక స్థలశూన్యమై యనంతము విజ్ఞానమయునకుఁ దెలియఁబడుచుండును. అదే సచ్చిదానందుని ముఖ్యస్థితి. మన యుత్తమాత్మయదే. ఈయనంతము మొదట మనపైనుండి మనమధిరోహించ ప్రయత్నించవలసినదిగా మన చుట్టునుండి దానియందు మన భిన్నత్వమును లీనముచేయఁ బాటు

పడవలసినదిగాఁ దోఁచఁబడును. తరువాత మనము దుఁ బ్రవేశించవ
లెను. అహంకారభంగమొనరించి దాని విపులత్వమొందవలెను.
అంతటనదిసహితము మన యధోస్థితిని విశేషముగా వశముచేసుకొని
హీనకార్యముల దుష్కార్యముల సహితము విజ్ఞానసత్యములోనికి
మార్చుచున్నది.

ఇదేమూలము. దానిని బొందినప్పుడే యూర్ధ్వమానసభావ
నిర్మాణ సర్వసాధారణత్వమును బొందఁగలము. అది యుత్తమ తే
జోవిలాసము. విజ్ఞానమయములోనికిఁ బ్రవేశించకమునుపే దీనిని
మనము స్వీకరించినప్పటికి నుత్తమ తేజోపురుషులము కాకముందు
మనవ్యక్తి విజ్ఞానముగా మారకముందు దానిని బూర్తిగా వశపరు
కొనఁజాలము. కారణమేమనగా మనవ్యక్తి స్వభావముననుసరించి
భావనిర్మాణ సర్వసాధారణత్వముండును. విజ్ఞానమునకు సంబంధిం
చిన భావనిర్మాణమెట్టిదో యిదివరకే చెప్పఁబడినది. కాని యది
యుత్తమభావమునకుఁగాని యొకవిధమైన దివ్యవివేచనాకార్యమున
కుఁగాని చెందినదికాదని గట్టిగా యొత్తిచెప్పవలసియున్నది. బంధిం
పఁబడి యంధత్వమందున్న మన యిప్పటి జ్ఞానేంద్రియ కర్మేంద్రియ
సాధనముల గ్రహించి వానిని విజ్ఞానముయొక్క తీవ్రయుత్తమవ్యా
పారముగా మార్చుచున్నది. గనుక నది మన యింద్రియజ్ఞానమును
స్వీకరించి దాని సాధారణస్థితియందుసహితము ప్రకాశమునిచ్చి వ
స్తునిజతత్వమును గ్రహించునట్లు చేయుచున్నది. అంతేగాక మానస
జ్ఞానమును స్వీకరించి యంతర్బహిర్వైచిత్ర్యముయొక్క ప్రత్యక్షజ్ఞాన
మిచ్చుచున్నది. ఏవస్తువునైపునకది తిరిగిన నావస్తువుయొక్క భావము
లరాగములస్పృహలఁ దెలుసుకొని యనుభవించుటకుఁ బ్రత్యక్షజ్ఞాన
దృష్టిని మానసవ్యక్తికిఁ గలిగించుచున్నది. ఈశక్తివస్తువుపై సన్యమము

వల్లఁ గలుగుచున్నదని పతంజలి చెప్పినాఁడు. అది మానసవిషయ ము. సన్యమముతో విజ్ఞానమునకుఁ బనిలేదు. దానికది స్వతసిద్ధగుణ ము. అది సూక్ష్మేంద్రియముల స్థూలేంద్రియములసహితమునుప యోగించి వానిని పొరపడనివ్వకఁ గాపాడుచున్నది. సాధారణమా నస మజ్ఞానముచేనమ్ముకొనియున్న స్థూలమునకంటె వేరగులోక ముల జ్ఞానానుభవముల నిచ్చుచున్నది. మనలోకముకు విపులముచే యుచున్నది. ఇదేవిధముగా విజ్ఞానముల మార్చుచున్నది. వానికిఁ బూర్ణమైనతీవ్రత బూర్తిగాభరించుశక్తి కలిగించుచున్నది. సాధారణ మానసత్వమునకుఁ బూర్ణతీవ్రత్వ మసాధ్యము. ఏలననగా నొక పరిమితమునకుమించిన ధారణాశక్తి దానికిలేదు. మనోదేహములు దె బ్బకు పరిశ్రమవృద్ధికిఁదాళకఁ జెడిపోవుచున్నవి. అది మన యనురా గములందుండు జ్ఞానవిషయమునుసహితము స్వీకరించుచున్నది.— (మనరాగములుసహితము జ్ఞానశక్తి కార్యశక్తి కలిగియున్నవి. కాని యీశక్తిని గ్రహింపఁజాలక దానిని వృద్ధిజేయుకుంటిమి)—స్వీకరిం చుటేగాక వాని పొరపాట్లను దొలగించుచున్నది. అన్నివస్తువులకు విజ్ఞానమే సత్యము, వ్రతము, త్తమధర్మమనఁబడుచున్నది. (దేవా నాం ఆడద్ధానివ్రతాని).

జ్ఞానము మఱియు శక్తి లేక చిత్తము (సమస్త జ్ఞానశక్తి చిత్త మనఁబడుచున్నది) వ్యక్తి కార్యమునకుఁగల రెండువైపులు. మన మానసత్వమందవి విభాగింపఁబడినవి. మొదట సంకల్పము వచ్చుచు న్నది. తరువాత చిత్తము తడఁబడుచూవచ్చి విరోధపడి యసంపూ ర్ణసాధననుగా నుపయోగింపఁబడి యసంపూర్ణఫలముల నిచ్చుచు న్నది. లేదా చిత్తమధోసంకల్పములతోఁ బ్రారంభమై కల్లోలమం దేదో కొంతపనిచేయుచు తరువాత మనకు సరియైనబోధ కలిగించు

చున్నది. ఆరెంటికి నేకత్వముగాని పరస్పరప్రబోధగాని లేకున్నది. మొదటి ప్రారంభసంకల్పమునకును గార్యసిద్ధికిని పోలిక లేకున్నది. అంతేగాక వ్యష్టిచిత్తమునకును బ్రహ్మాండచిత్తమునకును సమరస ములేదు. బ్రహ్మాండచిత్తము నతిక్రమించుటకో దానికిఁ దీసిపోవుట కో దానితో విరోధించుటకో ప్రయత్నించుచున్నది. సత్యముయొ క్క సంగతిసందర్భములు కాలనిర్ణయములు దానికిఁ దెలియవు. సత్యముయొక్క ప్రమాణాధిక్యతల నది యెఱుఁగదు. విజ్ఞానము చి త్తమును గ్రహించి యూర్ధ్వమానససత్యముతో మొదట సమరస మొందించును. తరువాత దానితో నేకత్వ మొందించును. ఇట్టివిజ్ఞాన మందు వ్యష్టిపురుషుని సంకల్పము బ్రహ్మాండసంకల్పముతో నేకీభవిం చును. కారణమేమనగా నుత్తమజ్ఞానచిత్తముల సత్యము నీరెండు తిరిగి పొందింపఁబడుచున్నవి. విజ్ఞానమన మేధోచిత్తమును స్వీకరిం చుటేగాక మనకోరికల మనయాశల నధోకామములఁ బ్రేరేపణల విషయజ్ఞానముల నింద్రియజ్ఞానములసహితము స్వీకరించి మార్చు చున్నది. వానికి తమవనుబంధములేక తృష్ణయనగా మనకుదోచు నసంప్రాప్తవస్తువును బొందవలెనను వికారములేక నవి కామాను రాగములు గాకుండును. సహజజ్ఞానజన్యమైన మేధోజ్ఞానజన్యమైన బుద్ధిసగముబుద్ధి సంసిద్ధులుగా నికమీదనుండక సత్యచిత్తము యొక్క వివిధకార్యములుగా మారును. అట్టి సత్యచిత్తము తాను తీర్మానించుకొనిన కార్యక్రమముయొక్క స్వతసిద్ధజ్ఞానముతోఁ బని చేయును. కాబట్టి మనమానసస్వేచ్ఛకుఁ దెలియనట్టిసంసిద్ధి దానికిఁ గలదు. గనుకనే విజ్ఞానచిత్తవ్యాపారమందుఁ బాపములేదు. సమ స్తపాపము చిత్తజన్యప్రమాదమై యున్నది. అదే కామము. అదే యజ్ఞానకార్యము.

కోరిక పోయినవెంటనే యావత్తుదుఃఖము నశించును. విజ్ఞానము మన జ్ఞానచిత్తములభాగముల స్వీకరించుటేగాక మన యనురాగసంతోషముల భాగములసహితము స్వీకరించి దివ్యానందకార్యముగా మార్చుచున్నది. శక్తిజ్ఞానములు వ్యక్తికార్యమునకు రెండు వైపులైనట్లే సంతోషమని మనము దేనిని బిలిచెదమో దానికంటె యుత్తమమైన యానందము వ్యక్తికి ద్రవ్యము (పదార్థము). చిత్తజ్ఞానముల పరస్పరకార్యఫలమాచున్నది. ఆత్మవ్యక్తి శక్తుల పరస్పరకార్యమాచున్నది. సుఖదుఃఖములు మనశక్తి వ్యక్తుల చిత్తజ్ఞానముల పరస్పర సమరసత్వభంగమువల్ల నేర్పడుచున్నవి. వాని యేకత్వము భంగమై యేస్థితియందలి హద్దులఁగాంచినవో భిన్నత్వమొందినవో తమ నిజశక్తికార్యములఁ గోల్పోయినవో యితరశక్తులతో నితరవ్యక్తులతో నితరజ్ఞానములతో నితరచిత్తములతో విరోధము కల్పించుకొనినవో యట్టి యధోస్థితిలోనికి దిగుటచే సుఖదుఃఖము లేర్పడుచున్నవి. ఏకత్వ సమరత్వములఁ దిరిగి పూర్తిగాఁ బొందించుటచేత నుత్తమధర్మముచేత తన నిజసత్యముచేత విజ్ఞాన మీసుఖదుఃఖముల సరిచేయుచున్నది. మనరాగముల నన్నింటిని స్వీకరించి విజ్ఞానము ప్రేమానందముల వివిధరూపములుగా మార్చుచున్నది. మన క్రోధముల ద్వేషముల దుఃఖములసహితము ప్రేమానంద రూపాంతరములుగా మార్చఁగలదు. మనము పొరపడినట్టియుఁ బొరపడుటచే విపరీతములై దోచునట్టి నానియర్థమును విజ్ఞానము వెల్లడించుచున్నది. అది మన యావత్తుస్వభావమును నిత్యశ్రేయస్సుగా (Eternal Good) మార్చుచున్నది. అట్లే మనవిషయజ్ఞానముల నింద్రియజ్ఞానముల స్వీకరించి యవిపొందఁ బ్రయత్నించునానందమును భ్రమప్రమాదములులేని తన నిజసత్యమందు వెల్లడించుచున్నది. మన హీనప్రేరేపణసహితమవి పొందుచున్న వికారములందీశ్వరుని

యనంతుని గ్రహించునటులఁ జేయుచున్నది. ఇదంతయు నథోస్థితికి గల విలువలతో నేర్పడక మానసస్థూలప్రాణముల నవిచ్ఛిన్న పవిత్రతలోనికి స్వతసిద్ధతీవ్రతలోనికి లేవనెత్తుటచేఁ గలుగుచున్నది. అది యిది యననేల ? వివిధమైన నేకమగు నెడతెగని దివ్యానందావేశములోనికి లేవనెత్తుటచేఁ గలుగుచున్నది.

ఇట్లు విజ్ఞానపురుషుఁడు తన వివిధకార్యములలో నహంకార వ్యష్టి పురుషునిత్యజించి సర్వసమత్వమొంది సర్వవ్యాపకమై మనః ప్రాణదేహస్థితినిమించిన పరిపూర్ణజ్ఞానచిత్తానందశక్తి విలాసమై యున్నాఁడు. కారణమేమనగా నది యుత్తమాత్మ వ్యక్తుల విలాసమై యున్నది. కాబట్టి యది యుత్తమదివ్యపురుషుని సత్య ధర్మ పవిత్రతలందుజనించు నుత్తమశక్త్యానందవిలాసమే. దానిశక్తులు సాధారణముగా యోగులచే సిద్ధులనఁబడుచున్నవి. వానినే యైరోపావారు రహస్యశక్తులనుచున్నారు. చాలామందిభక్తులు యోగులు వానిని బంధములని యభ్యంతరములని యీశ్వరుని దెలుసుకొనుటకు విఘాతములని నిరాకరించుచున్నారు. కారణమేమనగా నవి యథోస్థితి యందుఁ బొందఁబడుటకుఁ బ్రియత్నింపఁబడుచున్నవి. అహంకార సంతుష్టికై యహంకారపురుషునిచేఁ బొందఁ బ్రియత్నింపఁబడుచున్నవి. విజ్ఞానమందలి రహస్యములుకావు. సిద్ధులుకావు. సాధారణములై రహస్యములుకాని విజ్ఞానవిలాసములు. విజ్ఞానము దివ్యపురుషుని దివ్యస్వభావమందుండు శక్తివ్యాపారము. విజ్ఞానస్థితికి లేవనెత్తబడిన వ్యష్టిపురుషునిద్వారా యది పనిచేయునపుడు విరుద్ధములేక పొరపాటులేక యహంకారప్రతీకారములేక నీశ్వరప్రాప్తికి భంగములేకఁ దాను సంసిద్ధిఁగాంచుచున్నది. అచ్చట వ్యష్టిపురుషుఁ డహంకారపురుషుఁడుకాఁడు. దివ్యస్వభావముతోనున్న జీవాత్మ. (పరాప్రి

క్రితిర్జీవభూతా). అది యుత్తమమై సర్వవ్యాపకమైన యాత్మ. అనేక వ్యష్టిరూపవిలాసమందుఁ గానుపించుచున్నను దన నిజశక్తి తత్త్వమందాత్మజ్ఞానముతోనున్న సర్వవ్యాపకయుత్తమాత్మయే.

విజ్ఞానమందుఁ బురుషప్రకృతులకుండు సరియైన సంబంధము తెలియఁబడుచున్నది. పురుషప్రకృతులచ్చట నైక్యమౌచున్నవి. దేవునకు ముసుకు తొలిగిపోవుచున్నది. సమస్తమతనికార్యమే. ఇక జీవుఁడు నేను యోచించుచున్నాను, నేనుచేయుచున్నాను, నేనుకోరుచున్నాను, నేననుభవించుచున్నానని యనఁడు. ఐక్యమునకై ప్రయత్నించుచు నట్టియైక్య మొందకపూర్వము సాధకుఁడు “నాహృదయమంగుండిన నీవు నిర్ణయించునట్లు నేచేసెద” నని చెప్పినట్లు చెప్పఁడు. కారణమేమనగా మానసవ్యక్తికి స్థానమైన హృదయమిక నిర్వాణమునకు స్థానముగాక తత్సాధనమౌచున్నది. సర్వమునకుఁ బ్రభువై యధిష్ఠితుఁడై పైనఁ దనలోనున్న యీశ్వరుని వాఁడెరుగును. ఆయుత్తమపురుషునందుఁ దానధిష్ఠితుఁడై (పరార్ధి పరమస్యాం పరానతి) ధైర్యముతో నిట్లు చెప్పఁగలఁడు. “దేవుఁడు తనకుఁదాఁ బ్రకృతివలనఁ దెలుసుకొనుచున్నాఁడు. పనిచేయుచున్నాఁడు, ప్రేమించుచున్నాఁడు, పైకిఁగనుపించు నావ్యష్టిరూపముచే నానందించుచున్నాఁడు. అట్టి వ్యష్టియందనంతుఁడు సర్వవ్యాపకుఁడై యాడుచున్న బహుముఖలీల నుత్తమజీవత్వముచే సంసిద్ధిపొందుచున్నాఁడు.”






36 అధ్యాయము.

# విజ్ఞానము - ఆనందము.



విజ్ఞానాధిరోహణము విజ్ఞానమయవ్యక్తిసంసిద్ధి మానుషజీవుని యీలోకమందతని జీవితమందు తేజోశక్త్యానందాసంపూర్ణవైభమునకు లేవనెత్తుచున్నవి. ఆవైభవముసంపూర్తియై మానసకార్యముతో హృద్గులోనున్న మానసవ్యక్తితోఁ బోల్పఁబడుచు పరిపూర్ణముయొక్క స్థితిశక్తులిట్టివని తోపింపఁజేయుచున్నది అది పరిపూర్ణత్వమే. వెనుక నంతటిదేదియులేదు. మానసలోకమందు స్వనుజ్ఞానానుభవముసహితమొక ప్రత్యేకత్వమొకవైపు తెలిపికలది. విపులమైనదిసహిత మాత్రావిర్భావజన్యమైన యసమాపకశక్తిచే వికారమొందింపఁబడినది. కాని దానికంటె పై దానితోఁ బోల్పనప్పుడది నిజమైన పరిపూర్ణత్వముగాక నొకవిధముగాఁ బరిపూర్ణమునకుఁ బోలియున్నది. అదిమనకు తుదిసోపానమునవచ్చును. అవతరించుచున్న యాత్మ కాదియంత్యములైన పరిపూర్ణానంతత్వాలలోని కాసోపానమునుంచి యెక్కవచ్చును.

జ్ఞానాత్మను పొందినతరువాత తక్కిన క్రిందియాత్మల నన్నిటిని దానిలోనికి తీసుకొన్నతరువాత నన్నిటికన్న తుదిసోపానము జ్ఞానాత్మనుసహిత మానందాత్మలోనికి స్వీకరించి యిచ్చుట యారోహణము సమాప్తమొందించుటయని యుపనిషత్తు చెప్పుచున్నది. కాని యిదే తుదిమెట్టా? లేక ననుభవమునకుమాత్ర మంత్యసోపానముగాఁ దోచునట్టిదా? లేక మనకది ప్రస్తుత మనవసరమా? అని కొందఱడుగవచ్చును. అనంతమాత్మకు ముఖ్యమైనస్వభావము. అందది తన నిజస్వరూపమును ముఖ్యవ్యక్తిని పరిపూర్ణశక్తిని పొందుచున్నది. కాబట్టి యబాధిత పరిపూర్ణానందములోనికి జీవుఁడు ప్రవేశించుటే యనంతపరిపూర్ణత్వము. అదే యనంతముక్తి. క్రిందిలోకములైన స్థూల ప్రాణ మనోమయలోకములందును విజ్ఞానమయ సత్యజ్ఞానలోకములందుసహితము పురుషుఁడు మార్పులొందిన తన ప్రకృతితో నాడుకొనుచు నీయానందమనుభవింపఁగలఁడు. కారణమేమనగా నీతత్త్వములలోఁ బ్రతిదానియందు తక్కినయారుతత్త్వములు లీనమైయున్నవి. ఈలోకములోఁ బ్రతిదానియందీతత్త్వముల పరిపూర్ణత్వము లోకస్థితినిబట్టి కలుగుచున్నది. మనుష్యుని స్థూలజీవుఁడనగా నన్నమయపురుషుఁడు సచ్చిదానందస్వరూపమును బ్రతిఫలించి యందుఁ బ్రవేశించఁగలఁడు. స్థూలస్వభావమందు జీవాత్మ తన యానందశక్త్యానంతత్వములఁ బ్రతిఫలించుటచేతనో యాత్మయందు లీనమగుటచేతనో యిట్లగుచున్నది. దీనిఫలమేమనగాఁ దేజోనంతమైన మానసనిద్ర. అట్టి మానసికసుషుప్తియం దన్నమయపురుషుఁడు తన్ను దామరచును. లేక స్వభావము చేతికీలుబొమ్మవలె (జడవత్) గాలిలోని యాకువలె కర్తృత్వశూన్యుఁడై దివ్యబాలునివలెను (బాలవత్) సంచరించును. కాని పైలోకములందదే స్థితికిఁ జెందిన జ్ఞానా

నందయుత్తమమైవైభవములేకనే యిది సంభవించుచున్నది. ఇది యంత ర్ముఖమైన సచ్చిదానందపరిజ్ఞానము. అందుఁ బురుషునిచేఁ బ్రకృతి జయింపఁబడలేదు. అట్లే మనుష్యునియందున్న ప్రాణజీవుఁడనఁగా ప్రాణమయపురుషుఁడు సచ్చిదానందస్వరూపమును ప్రతిబింబించి యందు ప్రవేశించఁగలఁడు. జీవాత్మ బ్రహ్మాండప్రాణమునందుఁ బ్రతిఫలించుటచేతనో లేక నంతర్ముఖమున జీవాత్మలోఁ దాను లీన మాటచేతనో సంభవించును. ఇచ్ఛాసహితము పర్యవసానమేమనగా స్వకీయమైన యవ్యక్తస్థితి సంప్రాప్తియో లేకఁ బ్రపంచశక్తియొక్క నాట్యవిలాసమందుఁ గర్తృత్వశూన్యమగు ప్రాణముచే ప్రేరేపింపఁ బడి బాధ్యతలేని కార్యమాచున్నది. అప్పుడు మనుజుఁడు ప్రపంచ మునుగూర్చి శ్రద్ధలేకయే దివ్యోన్మాదముతో (యున్మత్తవత్) పని చేయును. లేక సరియైన మానుషకార్యము మానుషభావమనుమా టలేక (పిశాచవత్) దివ్యోన్మత్తునివలె దయ్యమువలె సంచరించును. ఇచ్ఛాసహితము స్వభావము స్వాధీనముగా లేదు. ఇది యంతరమున నాత్మచేఁ బొందఁబడిన యొకవిధమైన యానందస్థితి సంసిద్ధిమాత్రమే. బహిర్ముఖమున స్థూలప్రాణములచేఁ బొందఁబడిన క్రమము లేనిశక్తి సంసిద్ధిమాత్రమే.

అట్లే మనుష్యునందున్న మానుషజీవుఁడనఁగా మనోమయ పురుషుఁడు సచ్చిదానందస్వరూపమునుప్రతిఫలించి యందుఁబ్రవేశిం చఁగలఁడు. స్వచ్ఛమైన బ్రహ్మాండ మానసస్వభావమందు జీవాత్మ ప్రతిఫలించుటచేతనో యంతరాత్మయందు లీనమాటచేతనో యిది సంభవించుచున్నది. ఈస్థితియందు మనస్సుకర్మలు లేకుండును. లేక కామరహితమైన బంధశూన్యమైన కర్మయుండవచ్చును. మానుష

బంధముల త్యజించిన సన్న్యాసియొక్క-గాని శుద్ధ ప్రేమానందములతో సంచరించు సిద్ధునికర్మగాని యుండవచ్చును. మానసపురుషుఁడీ మూఁడులోకములయందున్న యాత్మనొకసారిగా గ్రహించవచ్చును. అంతట నతఁడొకసారిగాని యొకటివెంటనొకటిగాని, యొకటితరువాత మరియొకటిగాని సర్వమూచున్నాఁడు. లేక నాఁడు త్రిమస్థితు లనఁబడు బాధ్యతలేని బాలత్వముగా గుణముల ధర్మసూత్రముల లక్ష్యపెట్టని యున్మాదముగా నానందావేశముతో నిండిన సన్న్యాసముగాఁ గ్రిందిస్థితుల మార్చఁగలఁడు. ఇచ్చటసహితము ప్రపంచస్వభావమును జీవుఁడు జయించలేడు. కాని రెండువిధముల నధికార మొందినాఁడు. అనంతుఁడైన యాత్మయొక్క- జ్ఞానస్వాతంత్ర్యములు లోనఁ గలిగినవి. వెలుపల మానసస్వభావముయొక్క- క్రియాశూన్యమైన యానందవిలాసము కలిగినది. మానసపురుషుఁడు మానసానుగుణ్యమైన జ్ఞానముతో స్థూల ప్రాణజీవులు స్వీకరించఁజాలని విజ్ఞానము నొకవిధముగా స్వీకరించఁజాలియుండుటచేత బహిరంగవ్యాపారము తేఁడు కొంతవరకావిజ్ఞానముచేఁ బాలించఁగలఁడు. కాని మానసమంతరమందున్న యనంతమునకు వెలినున్న యంతరమునకు సమాధానముమట్టుకే తేఁగలదు. అంతరస్థితియొక్క- యనంతత్వ శక్త్యానందముల స్వీకరించుట కసమర్థమైన బహిరంగ వ్యాపారమందుఁ బూర్ణముగాఁ బ్రవహింపఁజేయఁజాలదు. కాని యది యంతటితో సంతుష్టి స్వాతంత్ర్యములఁ గలిగియుండును. కారణమేమనగా నంతరమందున్న ప్రభువే కార్యకర్తృత్వమును నిర్వాహకమును దాని ఫలమును వహించుచున్నాఁడు.

విజ్ఞానమయపురుషుఁడు తన క్రియలయందు పరిపూర్ణ దేవత్వభావవ్యక్తులుకలవాఁడు. అనంతుని స్వతంత్ర దివ్యమార్గము కలవాఁ

డు. సమస్తజీవితమును నిత్యప్రకాశము నిత్యాగ్ని నిత్యామృతమనఁబడు జ్ఞానశక్త్యానందములు కల గుర్తుగా మార్చఁగలఁడు. అది యాత్మయొక్క యనంతత్వమును స్వభావముయొక్క యనంతత్వమునుగలది. అది యాత్మస్థితియందుఁ దనస్వరూపస్వభావమును దెలిసికొనునేగాని పోఁగొట్టుకొనదు. కారణమేమనగా నితరమానసస్థితులెట్టివనగా మనుష్యుఁడు తనలో దేవుని దేవునియందు తన్నుకనిపెట్టునవి. కాని విజ్ఞానము మానుషవిగ్రహమందాత్మ స్వాధీనముపొందిన దేవుఁడే. కాబట్టి విజ్ఞానజీవుఁడు సత్యస్వభావమందు జీవాత్మనుబొంది దానితో నైక్యమొందునుగాని ప్రతిఫలించఁడు. విజ్ఞానమందుఁ బురుషప్రకృతులకుండు పరస్పరద్వైతభావ మర్ధనారీశ్వరమై కనుపించదు. ఈద్వైతభావము సాంఖ్యమతమునకు బ్రస్తుత మతేవ్యక్తికిని సత్యముగానే కనుపించుచున్నది. హిందువుల లక్షణశాస్త్రమందు వర్ణింపఁబడిన హరగౌరీమునసేమో సత్యపురుషుఁడు తెలుసుకొనుచున్నాఁడు. సత్యాత్మ యనంతమందున వ్యక్తస్వరూపమొందదు. కాని యనంతమందు నిత్యాత్మ స్వాధీనమొందుచున్నది. దాని వ్యాపారము క్రమమైనదికాదు. అనంతస్వాతంత్ర్యమందుఁ బరిబూర్ణమైన యాత్మాధికారమది. అధోస్థితులందు సాధారణముగా జీవుఁడు స్వభావమునకు వశుఁడై యున్నాఁడు. నడిపించువిషయముప్పుడధోస్వభావమందుండును. కాబట్టి సమస్త నియామకమనంతముకాని దాని ధర్మమునకులోఁబడి యుండవలసివచ్చును. అట్టి జీవుఁడనంతమందుఁ బ్రవేశించినంతమాత్రమున నిదివరకు సమస్తమును నడుపుచున్న తన స్వతస్సిద్ధమైన స్థానమును గోల్పోవునేకాని మఱియొకస్థానమును బొందనేరఁడు. ప్రకృతి బ్రహ్మాండశక్తియందివ్వేరై కల్లోలములో నాట్యమాడును. లేక కర్తృత్వశూన్యమై యానందపరవశ

ముందు దారితప్పిన తప్పవచ్చును. అట్లుగాక వ్యష్టిమానిజుని యంతనం తుఁడు తనవ్యాపారమును వ్యక్తితో నడుపఁగల యధికారస్థానమది కనిపెట్టఁజాలినయెడల నట్టియధికారస్థాన మిదివరకేయున్న విజ్ఞానమును సమీపించుచున్నదగును. అది విజ్ఞానముఁజేరినపుడే పురుషుఁడు స్వభావమున కధికారియగుచున్నాఁడు. కారణమేమనగా నచ్చట శక్తిలేక చిత్తము దివ్యజ్ఞానమునకు సరియైన రెండవప్రతి యౌచున్నది. అజ్ఞానము సాక్షియొక్క చూపుమాత్రమేగాక సర్వశక్తి కార్యనియామకుఁడైన యీశ్వరుని బలవత్తరమైన వీక్షణముసహితమౌచున్నది.

విజ్ఞానము క్రిందిలోకానుభవమును నిరాకరించదు. దానిని తన స్థిత్యానుసారముగా వశముచేసుకొనుచున్నది. విజ్ఞానపురుషుఁడు బాలుఁడనఁబడుచున్నాఁడు. కాని యీబాలుఁడు బాలరాజు. అతఁడాడుకొనుపనిముట్లు బ్రహ్మాండములు. ఈసమస్త స్వభావ మతని యాటతోట. ఆబాలుఁడు దివ్యతమస్సును స్వీకరించుచున్నాఁడు. ఈశ్వరుని నిశ్వాసమైన ప్రకృతిచేఁగల్పింపఁబడిన బద్ధజీవుని తమస్సువంటిదిగాక నధికారపురుషుని యానందముచేఁ గల్పింపఁబడిన స్వభావజీవుని తమస్సనఁబడును. ద్విమూర్త్యాత్మకమైన పురుషప్రకృతి స్వరూపమందది ప్రజ్వరిల్లుచున్న సూర్యునివలెను బ్రహ్మాండముతో నైక్యమొందిన స్వకీయాంతరజ్ఞానశక్తులచేఁ గ్రమముగా నడుపఁబడు దివ్యతేజోమూర్తిగా నాపిల్లవాఁడుడుండును. వాని యున్మాదము దివ్యజీవితవ్యాపారతీవ్రతతో స్వాతంత్ర్యానంతవ్యక్తితోఁ బనిచేయుచున్న యుత్తమజ్ఞానశక్తిపారవశ్యతే. అతని కార్యకరణము విచక్షణకతీతమైనది. కాబట్టి రహస్యము తెలియలేని వివేచనామానసమునకు గొప్ప మితిమీరిన యున్మాదముగాఁ గనుపించును. కాని యీ

యున్మాదము లోకేశుని క్రమవిధానమే. అది మానసవ్యక్తి కగోచరము. అదియొక నృత్యవిశేషము. గొప్ప శక్తులసుడి. కాని నటేశ్వరుఁడు తనశక్తులహస్తములఁ బట్టుకొని తన రసలీలానుగుణ్యమైన చక్రగతులందు నడిపించునది. అథోస్వభావముయొక్క ద్వైతభావములతో విరుద్ధవిషయములతో నభ్యంతరములతోఁ జిక్కులతో సరిపుచ్చుకొని విజ్ఞాన మేమానుషధర్మములకుఁ గట్టుబొట్లకు లోఁబడుచున్నదో యవి దివ్యయున్మత్తు నెంత బాధించునో విజ్ఞానపురుషుని సహితమంతే బాధించును. ఆవిజ్ఞానపురుషుని జీవితమసాధారణమైనది. స్వభావముతో నిర్లక్ష్యముగా నిర్భయముగా సంచరించుజీవునకు సంభవించెడు కష్టములులేనిది. అయినప్పటికి సత్యధర్మముచేఁ బాలింపఁబడునది. ఆధర్మము స్వయంప్రాప్తమైన జ్ఞాన ప్రేమానందమేకత్వములుగల ధర్మమే. అది యసాధారణమని యేలఁ దోచుననగా దాని మాధుర్యము పొరఁబడుమానసమునకు గోచరించునది కాదు.

ఆశ్లిష్టమైన నింకఁ బైమెట్టుతో నేమియనవసరము? విజ్ఞానమయపురుషునకు నానందమయపురుషునకు భేదమేమి? సారాంశమునకు భేదములేదు. కాని భేదము లేకపోలేదు. అన్నిలోకములందానందము కనుపించుచున్నది. ఎందుకన నన్నిచోట్ల నదియున్నది. అన్నిచోట్ల నది సమానమే. కాని క్రిందిలోకములందు శుద్ధమానసము ప్రాణవ్యక్తి దానియందు మిశ్రమమైయున్నవి. వానియందది మిళితమై కలిసియున్నది. విజ్ఞానమునకైతే చిద్ఘనరూపమొందిన జ్ఞానతేజము కలదు. దానియందానంద పరిపూర్ణత్వము పొందఁబడుచున్నది. ఆ చిద్ఘనరూపమందానందములోఁ గలిసిపోయినప్పుడు మార్పునొందుచున్నది. ఆమార్పులవలన జీవుఁడు తుది పరిపూర్ణస్వాతంత్ర్యము

ను బొందుచున్నాఁడు. అప్పుడు జీవుఁడు పరిపూర్ణాత్మస్థితినొంది స్వతసిద్ధమైన యాత్మానందమొందును. నిజమునకు విజ్ఞానము తనసమస్తవ్యాపారములకీ యానందమే వ్యక్తిగలమూలముగాఁ గలది. విజ్ఞానమున కాధారమానందమే. కాని తనకార్యనిర్వహణమందు మాత్రమానందమునకంటె వేరై దానిపనియొనరించుచున్నది. విజ్ఞానమనగా దివ్యవ్యక్తిగల శక్తియొక్క దివ్యజ్ఞానచిత్తమే. అదే ప్రకృతిపురుషుఁడు. దానియందు దివ్యపురుషుని యానందము నిండియున్నది. కాని యానందమందు జ్ఞానము స్వకీయమైన శుద్ధవ్యక్తిలోనికిఁ దిరిగి ప్రవేశించుచున్నది. నిర్మలమైన శుద్ధశక్తి చిత్తములో మిళితమైపోవుచున్నది. జ్ఞానచిత్తములు రెండు శుద్ధానందములోనికి లేవనెత్తఁబడుచున్నవి. జ్ఞానపురుషున కేదిమూలమో యదే యానందమునకు స్వతసిద్ధము.

ఇది యేల సంభవించుననగా నిచ్చటఁ బరిపూర్ణైక్యమునకుఁ గావలసినమార్పు నెమాప్తమొందుచున్నది. అట్టి యైక్యమునకు విజ్ఞానము నిర్వివాదమైన సోపానముకాని తుది విశ్రమస్థానముకాదు. విజ్ఞానమందు జీవుఁడు తన యనంతత్వము నెరుగును. అందు నివశించును. కాని యనంతుని వ్యాప్తివిలాసమునకొఱకుఁ గార్యస్థానమందునహితము నివసించును. అతఁడు సమస్తేతరభూతములతో తనయైక్యమును దెలుసుకొనుచున్నాఁడు. కాని భేదరహితమై యొకవిధమైన ప్రత్యేకత్వము కలిగియుండును. దానివలన నితరభూతములతో స్పర్శ సంబంధముసహితము కలిగియున్నాఁడు. అట్టిస్పర్శ సుఖమున కేర్పడిన యాప్రత్యేకత్వము మానసమునకు భేదభావము కలిగించుటగాక స్వకీయానుభవమున కితరభూతములు వేరని తోపింపఁజేయు

చున్నది. అధ్యాత్మికస్థితియందు మనలో నితరులలో నేకమైయున్న యాత్మనుగోల్పోయి దానికై చేయు ప్రయత్నమాచున్నది. జీవితమందహంకార నిమజ్జనమునకును గోల్పోయిన యైక్యమునకై చేయు మూఢప్రయత్నమునకును సమాధానపరచుచొచున్నది. తనయసంతవ్యక్తియందుసహితము విజ్ఞానపురుషుఁడొకవిధమైన బుద్ధిపూర్వకమైన ప్రత్యేకత్వము కల్పించుకొనుచున్నాఁడు. అతఁడు ప్రత్యేకప్రకాశముగల ప్రభతో నిర్మింపఁబడిన స్థితి కలిగియున్నాఁడు. అట్టి ప్రభకు వెలినున్న సర్వముతో నేకీభావ మొందుచున్నను ప్రత్యేకప్రభతో నుండకపోలేదు. కాని యానందమందిదియంతయుఁ దలక్రిందుగా మారుచున్నది. ప్రత్యేక కేంద్రస్థానము గానుపించదు. ఆనందస్వభావమునకుఁ బ్రత్యేక కేంద్రస్థానములేదు. బుద్ధిపూర్వకముగానిర్మించుకున్న పరిధికాని బలవంతముపై నెత్తిపైఁబెట్టిన పరిధికాని లేదు. సమస్తము సమానమైనయేకస్థితి. ఆనందజీవుఁడు తానుప్రతిచోటనున్నానని యనుకొనుచున్నాఁడు. అతనికి రయొకభవనములేదు. అతఁడనికేతుఁడు. సమస్తమతని భవనమే. ఇష్టపడిన సమస్తవస్తువు అతనికనేక భవనములౌచున్నవి. ఇతర సమస్తజీవులతనికి స్థితియందు వ్యాపారమందు స్వంతజీవులే. ఏకత్వమందున్న స్పర్శసుఖము సమస్తము పరిపూర్ణైక్యసుఖమాచున్నది. స్థితియననట్టిదో యిక జ్ఞానసంబంధమైన పదములతో నిర్ణయింపఁబడదు. కారణమేమనగా జ్ఞానము జ్ఞేయము జ్ఞాత పూర్తిగా యొక యాత్మయాచున్నది. జ్ఞానమని మనము పిలుచుదానితో నికఁబనిలేదు. సమస్త వ్యక్తిస్థిత్యానందమునకు నంబధించినదే. సమస్త శక్తియానందమునకు నంబంధించినశక్తే. సమస్తాకారకార్యము లానందమునకుఁజెందిన రూపకార్యములే. ఇట్టి పరిపూర్ణసత్యస్వరూపమందు జీవాత్మ నివసించుచున్నది. ఇహాముః

ము విరుద్ధవిషయములతో వికారమొంది పరమందు వాని నిజసత్యములఁ బొందుచున్నది.

జీవాత్మ నిలిచియుండును. అది నశించదు. మన ప్రతిలోకస్థితియందీధర్మమే రుజువగుచున్నది. జీవాత్మ తనలోఁ దాలీనమగుటవలన నిద్రయందుఁబడవచ్చును. తన స్వకీయలోకప్రకాశమందుండిన నుండవచ్చును. ఆనందమునకది యానందలోకము, బ్రహ్మలోకము, వైకుంఠము, గోలోకము. వివిధహైందవమతముల వివిధలోకములు. లేక జీవుఁడు తన తేజోశక్తులతో నింపుటకై క్రిందిలోకములవైపునకుఁ దిరిగినఁ దిరుగవచ్చును. ఆనందలోకమందున్న దేవునకుఁ బ్రపంచవిలాసము సాధ్యము కాకపోలేదు. అట్టి విలాసమునుండి యతఁడు బహిష్కరింపఁబడి యుండలేడు. కాని యుపనిషత్తానందమే నిజమునకు సృజించునదని దృఢముగాఁ జెప్పుచున్నది. ఇట్టి దివ్యానందమునుండి సమస్తముత్పన్నమగుచున్నది. కాబట్టియే యానందలోకము జనలోకమనఁబడుచున్నది. దాని యందుత్పత్తి సంతోషము లీరెండుండుటచేతనే జనలోకమనఁబడినది. ఆలోకమందు సర్వమిదివరకే పరిపూర్ణసత్యస్వరూపముగా నున్నది. దానిని విజ్ఞానము బహిర్గతమొనరించి భావానుసారముగా నాభావధర్మానుసారముగా బుద్ధిపూర్వకమైన హద్దునకు వశముచేయుచున్నది. కాని యానందమందు సమస్తధర్మములు నశించి పరిపూర్ణస్వాతంత్ర్యము కలుగుచున్నది. అది సమస్త తత్వములకు మీరినదికాని యేకకాలమున సమస్త తత్వానుభవమొందునది. సమస్తగుణముల కతీతమైనదికాని సమస్తానంతగుణానుభవముకలది. అది సమస్తరూపములు మించినది కాని సమస్త రూపానుభవమొందునది. సర్వాతీతమై సర్వవ్యాపకమైన యాత్మయేదో యదే యానందము. జీవుఁడు సర్వాతీత సర్వ

వ్యాపకముతో నేకమైయుండుట యదియగుటే. అంతకంటె తగ్గుట కాదు. ఇచ్చోట పరిపూర్ణము పరిపూర్ణవిలాసము లుండుటవలన మనసంకల్పములచే నాసంకల్పముల రూపములైన యీప్రపంచవికారములచే బాధింపఁబడదు. ఈప్రత్యక్షవికారములు పరిపూర్ణమును సూచించు గుర్తులుమాత్రమే. గుర్తులు వస్తువుయొక్క భావమును కలిగించునుగాని మనకు వస్తువులే ప్రత్యక్షమైనప్పుడు భావములను భావనిర్మాణముల నతిక్రమింతుము.

మనము ప్రస్తుతమేదై యుంటిమో దేనిని తెలుసుకొనుచుంటిమో దానికంటె పూర్తిగా వేరైనదానిని తెలుసుకొని దానిచే బలముగా నాకర్షింపఁబడినప్పుడు మనకుండెడి ముఖ్యప్రేరేపణ మేదనగా ప్రస్తుతవిషయమును విడిచి యీయుత్తమసత్యమందుఁ బ్రవేశించవలెననుటే. అట్టి యాకర్షణయొక్క తీవ్రరూపమే క్రిందిస్థితిని భ్రమయని నిరాకరించుట. పైనున్నదానియందు లయమగుటయందు నిర్వాణమొందుటయందపేక్ష. అదే లయమునకు నిమజ్జనమునకు వినాశమునకుఁ గలకోరిక. కాని నిజమైనలయము నిర్వాణమనగా నధోస్థితికి తప్పనిస్వభావమైన సమస్తమును విడిపించి యుత్తమసత్యములోనికి విఫలతనొందించుటే. ఉత్తమసత్యము సమస్తేతరమునకుఁ గారణమగుటేగాక తదేతరమునందుండి సర్వము నాలింగనమొనరించుచున్నదని తుదకుఁ దెలుసుకొందుము. అట్లు దానిని వశముచేసుకొనుటచేతనే మనజీవానుభవమందు సమస్త ముత్తమవిలువగా మార్చఁబడుచున్నది. తుదకు మనము పరిపూర్ణమొందుదుము. పరిపూర్ణములైన దాని యుత్తమవిలువల నొందుదుము. అంతవరకు మనలఁ బ్రేరేపించుచున్న ముముక్షుత్వము బంధవిమోచనాపేక్ష విడిచిపోవును. కారణమేమనగా సదా స్వాతంత్ర్యముగల దానిని

పొందితిమి. మనలనిప్పుడేదిబంధించినదో దాని యనుబంధవాసనలచే నాకర్షింపఁబడము. ఇట్టికోరిక నాశమొందకఁ బరిపూర్ణముక్తిరాదు. ఈశ్వరుఁడు జీవులకుఁ బలువిధములైన యెరలఁబెట్టి యాకర్షించుచున్నాఁడు. ఆసమస్తమైన యెరలతని యానందభావ రూపాంతరములే. ఈసమస్తములానందాన్వేషణమందు జీవుని వివిధమార్గములు. స్థూల మానస నైతిక దేహములకు సంతోషదాయకములైన భౌతిక పారితోషికరూపమున నీయెర మొదటఁ జూపఁబడుచున్నది. తరువాత నీయైహిక పారితోషికములకంటె నుత్తమమైన స్వర్గభోగాపేక్షరూపమున యెర పెట్టఁబడుచున్నది. కాని స్వర్గభావము విపులమగును. శుద్ధమగును. వృద్ధిగాంచి నిత్యసాన్నిధ్యముగా నానందభరితమైన యీశ్వరునందైక్యముగా మారుచున్నది. తరువాత నెరలకన్నిటికంటె సూక్ష్మమైనది వచ్చుచున్నది. ఇహపర సుఖదుఃఖములనుండి తప్పించుకొనుట, సమస్తవైచిత్ర్యములనుండి వైతొలగుట నిర్వాణమనఁబడు పరిపూర్ణమందు లీనము ప్రశాంత స్థిమిత జనితానందము మూఁడవయెర. కాని తుదకు మనస్సును బట్టుటకేర్పడిన యీ యెరలు సర్వము నశించవలసినవే. జన్మవలనఁగలిగెడు భయము జన్మనుండి తప్పించుకొనవలెననుకోరిక పూర్తిగా మనల విడువవలసినదే. ఉపనిషత్తు చెప్పినట్లేకత్వమెరిగిన జీవాత్మకు దుఃఖము భయము లేదు. బ్రహ్మానందమెరిగిన జీవాత్మ దేనికి భయపడవలసినయవసరములేదు. భయ కామ దుఃఖములు భిన్నత్వ ప్రత్యేకత్వ వ్యక్తిజనిత మానసరోగములు. కాని యానందమునకిట్టి రుగ్మతలులేవు.

ఆనందమయపురుషుఁడు జన్మచేఁగాని జన్మలేకపోవుటచేఁగాని బంధింపఁబడియుండలేదు. జ్ఞానాపేక్షతోఁగాని యజ్ఞానభయముచేఁగాని బంధింపఁబడి యుండలేదు. అతఁడిదివరకే జ్ఞానముకలవాఁడు.

దాని కతీతుఁడై యున్నవాఁడు. అతఁడజ్ఞానముతో నాడుకొనఁగలఁడు కాని దానిచే నావరింపఁబడఁడు. జన్మమెత్తఁగలఁడు కాని స్వభావ చక్రభ్రమణమందు బంధింపఁబడఁడు. అట్లు బంధింపఁబడకపోవుటే గాక జన్మపరంపరల ప్రయోజనము తద్ధర్మములసహితము మెఱుగును. ఆధర్మము జీవునకేలయనగా జీవుఁడొకలోకమునుండి మఱియొకలోకమున కెక్కుట కేర్పడినది. స్థూలమువఱకు నధోవిలాసధర్మమునకు బదులు తమవిలాసధర్మమును గూర్చుటకీధర్మము పనికివచ్చును. ఆనందజీవుఁడు పైనుంచి యట్టి యూర్ధ్వారోహణమునకు సహాయముచేయుటకు వెనుకతీయఁడు. స్థూలజన్మలోనికి దేవుని మెట్లవెంబడి దిగి వచ్చి దివ్యశక్తులయొక్క యూర్ధ్వాకర్షణమునకుఁ దన యానందశక్తిని తోడుచేయఁగలఁడు. సాధారణముగా మనుజుఁడింక నానందస్వభావము నధిరోహించలేఁడు. అతఁడింక నుత్తమ మానసస్థితులందు స్థాయి గాంచవలసియున్నది. కాని యీయానందశక్తిని తనలోనికి కొంచమో గొప్పయో స్వీకరించఁగలఁడు. ఇంతకంటె యతని కెక్కువ సామర్థ్యములు లేవు.

మనుష్యునందానందస్వభావ మెట్టిది? (1) మొదటిది. ఆనందస్థితియందు సమస్తభూతములతో నేకత్వమొందుట. ఈయానందైక్యమునకుగుర్తు ప్రేమ. కాబట్టి సర్వవ్యాపక ప్రేమమార్గమున నీయేకత్వమును సమీపించుట. మొదట నీప్రేమ మానుషప్రేమయై యుండవలెను. తరువాత దివ్యప్రేమయైయుండవలెను. (2) రెండవది. సమస్త బ్రహ్మాండవిలాసముతో నానందమందేకత్వమొంది దుఃఖముల భయములనారాటములఁ గష్టములఁ బారఁదరుమవలెను. (3) మూఁడవది. దేనియందు మనవిరుద్ధతత్త్వములు వానిపరిపూర్ణవిలువలలో నైక్యమొందుచున్నవో యట్టి యానందస్వాతంత్ర్యశక్తిని బొం

దుట. అప్పుడు సమస్తచెడులు మంచిగామారును. సర్వసుందరుని సర్వవ్యాపకసౌందర్యము సంభవించును. ప్రీతియంధకారము తేజోమయమైన సంపత్తుగామారును. సత్య శ్రేయ సౌందర్యములకును శక్తి ప్రేమ జ్ఞానములకును మానసముచేఁ గల్పింపఁబడిన పరస్పరభేదము లేకత్వశిఖరమందడఁగును.

మనః ప్రాణ దేహములందుండు పురుషుఁడు స్వభావమునకంటె వేరై దాని ద్వంద్వగుణములకు వశమగుచున్నాఁడు. విజ్ఞానమందతఁడు దాని ద్వంద్వగుణములకు వశమగుచున్నాఁడు. విజ్ఞానమందతఁడు దానితోఁ జంటఁగూడి యధికారియై యాగుణములచేరికచే వాని సమాధానము సమరసము కనిపెట్టుచున్నాఁడు. ఆనందమందతఁడు ప్రకృతితో నేకత్వమొందును. దానిజంటఁ గూడియుంటమాత్రమే కాదు. ఇకముందు జీవునితో స్వభావమాడు యాటలేదు. సమస్తము తన యానందస్వభావమందు జీవుఁడు తనతోఁ దానాడుకొనుటయే. ఇదే మహోన్నతమైన యద్భుతము. ఉత్తమరహస్యము. సులభమైనదే కాని మనదృష్టికిఁ గష్టసాధ్యమై యగోచరమైనది. అది సచ్చిదానందుని యాత్మానందముయొక్క స్వతంత్రమైన యనంతత్వము. దివ్యబాలకుని యాట, ప్రియుని రాసలీల దానిరహస్యచిహ్నములు.






37 అధ్యాయము.

# ఊర్ధ్వాధోజ్ఞానములు.



మనమిప్పటికి జ్ఞానయోగమార్గము పూర్తిజేసితిమి. అదియిచ్చుఫలమును కనిపెట్టితిమి. జ్ఞానయోగమునకు మొదటిప్రయోజనమేమనగా దైవవశీకరణము. అది వ్యక్తిద్వారమునవో ధ్యానముచేతనో దివ్యసత్య ప్రతిబింబముచేతనో దేవునివశము చేసుకొని యా దేవుని వశమగుట. మన ప్రస్తుతస్థితికి దూరస్థమైన యేదో ప్రత్యేకత్వముండేగాక నిచ్చటసహితము వశము చేసుకొనుటే. కాబట్టి తనలోనున్న దేవుని ప్రపంచమందున్న దేవుని లోనున్న దేవుని సమస్తభూతాంతర్యామియైన దేవుని స్వాధీనము చేసుకొనుట. అదే దేవునితో నేకత్వమొందుట. దానిమూలకమున బ్రహ్మాండముతో సమస్తస్థితులతో నేకమగుట. కాబట్టి యేకత్వమంగనంత బహుళత్వమొందుట. కాని యేకత్వముమీద యాధారపడవలెను కాని భిన్నత్వముపైగాదు. మూర్తివంతమందు మూర్తిరాహిత్యమందు సవంతమైన గుణములందు గుణములులేని శుద్ధత్వమందు

కాలమందు కాలాతీతమందుఁ గ్రియయందు నిష్క్రియయందు సంతమందనంతమందు దేవునిఁ బొందుట. కేవలయాత్మయందే యతనిఁ బొందుటగాక సమస్తాత్మలయందుఁ బొందుట. ఆత్మయందేగాక స్వభావమందుసహితము పొందుట. ఆత్మయందేగాక సూక్ష్మమానసమందు మానసమందుఁ బ్రాణమందు దేహమందుసహితము దేవుని పొందుట. ఆత్మతోను మానసముతోను బ్రాణముతోను స్థూలవ్యక్తితో నతని స్వాధీనముచేసుకొనుట. వీనినన్నిటిని యతనిచేఁ బొందింపఁబడుట. మన సమస్తస్థితి యతనితో నేకమై యతనితోనిండి యతనిచేఁ బాలింపబడి నడిపింపఁబడుట కతనిచే నన్నియు వశముచేసుకొనఁబడుట. దేవుఁడనగా నేకత్వమే. కాబట్టి మన స్థూలవ్యక్తి బహిఃప్రపంచస్వభావముతో స్థూలజీవాత్మతో నేకత్వమొందుట, ప్రాణము సమస్తప్రాణముతో నేకత్వమొందుట, మానసము బ్రహ్మాండమానసముతో నేకత్వమొందుట, యాత్మబ్రహ్మాండాత్మతో నైక్యమౌట. పరిపూర్ణమందతనిలోఁ బ్రవేశించి సమస్తసంబధముల యందతనిఁ గనుగొనుటే.

రెండవది దివ్యస్వభావస్థితుల నొందుట. దేవుఁడుసచ్చిదానందుఁడు గనుక మనస్థితిని యీశ్వరస్థితిలోనికి మనశక్తిని యీశ్వరశక్తిలోనికి మన స్థిత్యానందము నీశ్వరస్థిత్యానందములోనికి లేవనెత్తుటే యది. ఇట్టి యుత్తమవ్యక్తిలో మనము ప్రవేశించుటేగాక మన సమస్తస్థితియందు విపులత్వమొందించవలెను. మన మనః ప్రాణస్థితులు పూర్తిగా నీశ్వరస్వభావముతో నిండునట్లు మనసమస్తస్థితులవయవములు దివ్యత్వమొందవలెను. తెలివిగల మన మానసము దివ్యజ్ఞానచిత్తవిలాసము కావలెను. మన మానసపురుషునిజీవితము

దివ్యప్రేమానందవిలాసము కావలెను. మనప్రాణము దివ్యప్రాణవిలాసముకావలెను. మనస్థూలము దివ్యపదార్థముయొక్క యచ్చుకావలెను. దివ్యజ్ఞాన దివ్యానందములనొంది మనలోని యీ దేవకార్యమును దెలుసుకొనవలసియున్నది. మనము స్థూలోపాధియుతులము న భౌతికప్రపంచమున నివశించినను సాధారణ బహిర్వ్యాపారమందు జీవమానసములు భౌతికస్థితితోఁ బనికల్పించుకొన్న నీబహిస్థితియొక తప్పని బంధము కానేరదు. ప్రకృతిపురుషులకుఁగల సంబంధానుగుణ్యముగా నంతరవ్యక్తిని యొకలోకమునుండి మరియొక లోకమునుఁ బొందించఁగలము. స్థూల జీవ స్వభావములకు మానసములోఁబడి యుండుటకుమారుగా విజ్ఞానస్థితినిగాని యానందాత్మనుగాని పొంది విజ్ఞానానంద స్వభావములఁ గలిగియుండుము. ఇట్లంతర్జీవితమును బైకెత్తుటచే మన సమస్తబహిస్థితిని మార్పఁగలము. జడమునకు వశవర్తియైన జీవితమునకుమారుగా నాత్మచే వశీకరణమొందిన జీవితము కలవారమౌదుము. ఆజీవితవిషయములన్నియు స్థితిపరిశ్రమచే నిర్మింపఁబడి యంతమందుసహిత మనంతవ్యక్తికలవై యాత్మయొక్క దివ్యశక్తి దివ్యానందముల నొందుచున్నవి.

ఇది గమ్యస్థానము. విధానమునకు ముఖ్యవిషయములెట్టివో మనము తెలుసుకొంటిమి. కాని మనమిప్పుడు లోగడ విడిచిపెట్టిన విధానవిషయమును స్పష్టముగా మొదట యోచించవలెను. సమస్త జీవితము యోగములో భాగమనువిషయము పరిపూర్ణ యోగవిధానమునకు తత్వము. కాని మనమిప్పుడు వర్ణించుచున్న జ్ఞానము సాధారణముగా మనకుఁదెలిసిన జీవితజ్ఞానము కాదనియు జీవితమునకు వెనుకనున్న విషయమనియుఁ దోచుచున్నది. జ్ఞానము రెండువిధములు. ఈవెలిచోద్యమును వెలినుండి మానసముద్వారా తెలుసుకొనఁ

బ్రియత్నించునది యొకటి. ఇదే యథార్థజ్ఞానము. ఇదేబహిః ప్రపంచజ్ఞానము. ఈ వెలిచోద్యములయొక్క సత్యమును దానినిజతత్వమును మూలమును జ్ఞానానుభవముచే నంతర్ముఖమునఁ దెలుసుకొనుటకుఁ బ్రయత్నించునది రెండవది. సామాన్యముగా నీరెంటికి భేదము కల్పింపఁబడినది. దేవుని జ్ఞానమనఁబడు నూర్ధ్వజ్ఞానము మనకుఁ గలిగినప్పుడు తక్కిన ప్రపంచజ్ఞానముతో మనకుఁ బనిలేదని తలచబడుచున్నది. కాని నిశ్చయార్థమందా రెండొక యన్వేషణమునకుఁగల రెండువైపులు. సమస్తజ్ఞానము తుదకు దేవునికి సంబంధించిన జ్ఞానమే. తన ద్వారా స్వభావముద్వారా స్వభావకార్యముద్వారా యాజ్ఞానము కలుగుచున్నది. మానవజాతి మొదట యీజ్ఞానమును బహిర్జీవిత ద్వారమునఁ బొందఁ బ్రియత్నించుచున్నది. కారణమేమనగా మానసము పూర్తిగా వృద్ధియయ్యేవరకు దివ్యజ్ఞానము సాధ్యము కాదు. అది వృద్ధియైనకొలది దివ్యజ్ఞానసంసిద్ధికి నవకాశము వృద్ధిచెంది విపులత గాంచుచున్నది.

భౌతికశాస్త్రములు కళలు వేదాంతములు ధర్మశాస్త్రములు మానసశాస్త్రములు మొదలైనవి జీవితముద్వారా స్వభావము ద్వారా దేవుని కార్యవిధానమును దెలుసుకొనుటకు సాధనములు. మొదట మనము స్వభావరూపములతో జీవితకార్యములతో మాత్రమే పనిచేతుము. లోతుకుదిగినకొలది పరిపూర్ణానుభవ మొందినకొలది యీశాస్త్రవిధానములోఁబ్రతిది మనకు దేవుని ముఖాముఖిఁ జూపఁగలదు. భౌతికశాస్త్రములుసహితము (Physical science) తుదకనంతుని సర్వవ్యాపకుని యాత్మను దివ్యవ్యక్తిచిత్తములను ప్రపంచమందుఁ గనిపెట్టుటకు నిర్బంధింపఁబడుచున్నవి. ఊర్ధ్వలోకములగురించి సూక్ష్మశక్తి విధానములగురించి చెప్పునట్టి మానసశాస్త్ర

ములకు నీపని మిక్కిలి సులభసాధ్యమైయుండును. ఈమానసికశా
స్త్రములు స్థూలేంద్రియములకుఁ గానరానట్టియు సూక్ష్మ మాన
సేంద్రియములకు గోచరించునట్టియుఁ గానఁబడని లోకవిషయముల
లోకవాసులఁ దెలుపునట్టివి. కళలుసహిత మీఫలమునే యిచ్చుచు
న్నవి. శృంగారపురుషుఁడు సౌందర్యరాగభరితుఁడై పూర్తిగా స్వ
భావమందు లగ్నమౌటచేఁ దుదకీశ్వరరాగము నొందకఁబోవఁడు.
అతఁడనంతజీవితమును మాత్రమేగాక వసంతసాక్షాత్కారముసహి
తమందుఁ గాంచఁగలఁడు. మొదట మానుషజీవితసౌందర్యమందు
లగ్నమైయుండి తుదకు మనుష్యజాతియందు దేవుని సర్వవ్యాపకుని
యాత్మను జూడఁగలఁడు. వేదాంతశాస్త్రము వస్తుతత్త్వముల విమ
ర్శించుచు నీతత్త్వములకు మూలతత్త్వమేదో దాని స్వభావమెట్టిదో
గుణములెట్టివో కార్యవిధానమెట్టిదో విచారించును. అదేవిధమున
ధర్మశాస్త్రము తానన్వేషించుచున్న సర్వసుఖదాయకమైన ధర్మమే
యీశ్వరధర్మమని తుదకు గ్రహించి ధర్మాధిపతియైన యీశ్వరుని
స్వభావస్థితులపై నాధారపడియుండును. మానసశాస్త్రము (Psy-
chology) ప్రాణుల మానసజీవముల విమర్శించి సమష్టి చరాచర
ములంగున్న యద్వితీయజీవాత్మ నద్వితీయమానసమును గ్రహించు
చున్నది. చరిత్రము ప్రకృతిచరిత్రమువలెనే యెవని భావచిత్రము
లు బ్రహ్మాండమానుష పరిణామద్వారమున పనిచేయుచున్నవో
యట్టి సర్వవ్యాపకనిత్యశక్తి పురుషుని దెలుసుకొనుచున్నవి. కర్మసహి
తము మన కర్మద్వారమునఁ బనిచేయుచు మనకర్మల వశముచేసు
కొని నుపయోగించు దివ్యశక్తితో సంబంధమునకు మనల బలవంత
పెట్టుచున్నది. ఎవఁడులేకున్న ప్రకృతిమనుజులు లేకుందురో యెవని
జ్ఞానముయొక్క వ్యక్తివలన నుత్తమస్థితులఁ బొందఁగలమో యట్టి

యీశ్వరుని మేధ తెలుసుకొనుటకును రాగము లనుభవించుటకును చిత్తము సేవించుటకుఁ బ్రారంభించును.

ఇచ్చటనే యోగ మారంభమగుచున్నది. ఈశ్వరస్వాధీనము కొఱకది జ్ఞాన రాగ కర్మల నుపయోగించుచుఁ బ్రారంభమగుచున్నది. కారణమేమనగా నీశ్వరునియందైక్యముకొఱకు వ్యక్తితోఁ బూర్తిగాఁ బ్రయత్నించుటే యోగము. తక్కినవన్నియు నసంపూర్ణములై వ్యక్తిలేని ప్రయత్నములు. మొట్టమొదట యోగ మధోజ్ఞానవిధానకర్మలనుండి వేరగుచున్నది. ఈయధోజ్ఞానము వెలినుండి యపరోక్షమున దేవునిసమీపించి యతని రహస్యనివాసస్థానములోఁ బ్రవేశించఁజాలకున్నది. యోగము మనల లోనకుఁబిలిచి దేవుని సాక్షాత్కార మొందించుచున్నది. అధోజ్ఞానము మానసముద్వారా యీశ్వరు నన్వేషించి ముసుకులోనున్న యతనివ్యక్తికలదాచున్నది. కాని యోగ మనుభవముద్వారా యతని నన్వేషించి ముసుకు తొలగించి పూర్తిగా సాక్షాత్కార మొందుచున్నది. అధోజ్ఞానమున కతనియునికి బలముతోచుటమాత్రమే. కాని యోగమునకుఁ బ్రత్యక్షసాక్షాత్కారము బరిపూర్ణము కలుగుచున్నవి. అధోజ్ఞానము దేవుని కార్యవిధానము తెలుసుకొనుటమాత్రముచే నాకార్యములద్వారా సత్యముయొక్క స్వల్పచిహ్నముల కొన్నిటిమాత్రమే కాంచఁగలదు. వాని యోగము మనయంతరస్థితిని సత్యముతో నైక్యమొందించి యట్టి యైక్యమునుండి కార్యవిధానమును బరికించుచున్నది. కాబట్టి యోగవిధానము లధోజ్ఞానవిధానములకంటె వేరగుచున్నవి.

దృష్టిలోనికిఁదిప్పుటే జ్ఞానయోగవిధానము. బహిర్వస్తువుల నాలోకించుట వానిలోనికిదూరి లోనున్న యద్వితీయ నిత్యసత్యము

ను బొందుటకే. అధోజ్ఞానము వెలిచోద్యములతోఁ గార్యములతో నిదివరకే పనికలిగియున్నది. ఊర్ధ్వజ్ఞానమునకు మొకటియావశ్యకత యేదనగా నీవెలిచోద్యము దేనిపై యాకారమో యట్టిసత్యమును, నీ వెలిచోద్యము దేనికార్యమో యట్టి వ్యక్తియొక్క శక్తిస్థితులను బొందుటే. ఇది మూఁడువిధానములచే సంభవించుచున్నది. ఆవిధానము లొకటికొకటి యత్యావశ్యకములు. ఒకటివలన శక్తినవి రెండు పూర్తి జెందఁగలవు. అవియేవనగా (1) శుద్ధిచేయుట (2) యేకాగ్రతనొందుట (3) నైక్యమగుట. శుద్ధివలనఁ బ్రయోజనము సమస్త మానసస్థితిని దివ్యసత్యమును బ్రతిఫలింపఁజేయఁజాలిన యద్దముగా దివ్యసాక్షాత్కారముతో నింపఁదగినపాత్రగా దివ్యసాక్షాత్కారమును బ్రవహింపఁజేయఁగల కాలువగా దివ్యస్వభావ మావహించి నూతన పరిమాణమిచ్చి దివ్యవిషయములకుపయోగించఁదగిన సూక్ష్మపదార్థముగా మార్చునదైయున్నది. ఇప్పటిమానసస్థితి మానస స్థూలదృష్టిచే సృజింపఁబడిన ప్రపంచకల్లోలమును మాత్రమే ప్రతిఫలించుచున్నది. అజ్ఞానభరితమైన యధోస్వభావముయొక్క కల్లోలమునకుఁ గాలువయగుచున్నది. ఉత్తమజ్ఞానమును పనిచేయనివ్వని యభ్యంతరములతో నిండియున్నది. కాబట్టి మన సమస్తాకారము వికారమై యసంపూర్ణమై యూర్ధ్వవిషయములతో విరోధముకలదై హీనోపయోగకార్యములఁ జేయునదై యున్నది. అది ప్రపంచనిజసత్యమును సహితము ప్రతిఫలించదు. ఈశ్వరుని ప్రతిఫలించనేలేదు.

ఏకాగ్రత యత్యావసరమే. ఏలయనగా మొదట మనోచిత్తములకు స్వభావసిద్ధమైన చపలత్వము నశింపఁజేయవలెను. భావవిధానముల వెంబడించి వివిధకారముల వెంటఁబడి యింద్రియములచే

నాకర్షింపఁబడి వెలిచోద్యమందు జిక్కుకొని చపలత్వమొందు మనో చిత్తముల మొదట నిలుపవలెను. సమస్తమునకు వెనుకనున్న నిత్య సత్యములపై మన భావచిత్తముల నిలుపవలెను. దీనికి విశేషప్రియత్నము కావలెను. నిశ్చలమైన యేకాగ్రతయుండవలెను. రెండవ యావశ్యకమేమనగా మన సాధారణమానసముచే మనకును సత్యమునకును మధ్య నేర్పరచఁబడిన ముసుకు చించివేయుట. సాధారణ శ్రద్ధాస్వీకారములవల్ల బహిర్జ్ఞానము సంపాదించవచ్చును. కాని లోనదాగియున్న యంతరసత్యము నిశ్చలమైన మానస యేకాగ్రతవల్లను నిశ్చలమైన చిత్తైకాగ్రతవల్లను బట్టుపడుచున్నది. ఒకపర్యాయము పట్టుపడినతరువాత తదేకనిష్ఠతో దాని విడువకుండునటుల యలవాటుచేసుకొని దానితో నైక్యమొందవలెను. సంపూర్ణజ్ఞాన వశీకరణము లైక్యమునకులక్షణములు. అలవాటుచేఁగలిగిన శుద్ధత్వమువల్ల సత్యము తీవ్రముగాఁ బ్రతిఫలింపఁబడి పూర్తిగా నందేకాగ్రతనొందుచే నైక్యమనఁబడును. మన యజ్ఞానమానసముయొక్క సాధారణస్థితి భిన్నత్వము ప్రత్యేకత్వము. నిత్యసత్యమనఁబడు స్థితికిని మనకుండు నీభేదముడుగుటకిది యత్యావశ్యకము.

వీనిలో నేవియు సద్యోజ్ఞానవిధానములకు సాధ్యముకావు. వీనియందుసహితే మిగావిధానములు దారి సిద్ధముచేయుటకుఁ బనికివచ్చును. కాని కొంతవరకే యావిపనికివచ్చును. నానిపని యెచ్చట నాగిపోవుచున్నదో యచ్చట మనవృద్ధిని యోగము స్వీకరించి పూర్తినొందించుటకు సాధనములఁ గనిపెట్టుచున్నది. సర్వవిధములైన జ్ఞానాన్వేషణములు విశేష ప్రాపంచికదృష్టిచేఁ జెడిపోకున్న స్థితిని శుద్ధిచేసి సూక్ష్మత్వమునొందించి శ్రేష్టత్వము కలిగించును. మనము మానసికముగా మారిసకొలది మనస్వభావము సూక్ష్మతనొంది యు

ష్టమభావముల శుద్ధచిత్తమును స్థూలరహిత సత్యము నంతరశక్తులం
బ్రతిఫలింపఁజేయుట కెక్కువ విలుకలదగును. నైతికజ్ఞానమునకు నై
తికభావములకుఁగల పవిత్రీకరణశక్తి యందఱకుఁ దెలిసినదే. వేదాం
తశాస్త్రము వివేచనను శుద్ధిచేసి సర్వవ్యాపకానంత సాంగత్యమున
కర్వాంత తెచ్చుటేగాక స్వభావమును సూక్ష్మమొందించి ఋషులకుం
డుపరిశాంతము కలిగించుచున్నది. పరిశాంతమాత్మనిగ్రహ శుద్ధ
త్వాధిక్యతలకు లక్షణము. శృంగారరూపములందు సర్వవ్యాపక
సౌందర్యముతోఁ బని కలిగియుండుటసహితము స్వభావమును బవి
త్రముచేయుటలోఁ దీవ్రశక్తి కలిగియున్నది. అది యెక్కువైనకొలది
పవిత్రీకరణము (శుద్ధి) వృద్ధిగాంచును. భౌతికశాస్త్రానుభవములో
బ్రహ్మాండధర్మములలో లగ్నమైయుండుటసహితము విచక్షణాశక్తిని
పరీక్షాశక్తిని వృద్ధిచేయుటేగాక, నైహికాపేక్షలచేఁ జెడకున్న,
మానసమును స్థిమితమొందించి లేవనెత్తి శుద్ధిచేయుటకు సామర్థ్య
ముకలది. కాని యాశుద్ధియంతగాఁ బైకిఁ దెలియఁబడునదికాదు.

మానసము నేకాగ్రతనొందించుటకై సత్యమును స్వీకరించి
యందు నివసించుటకై చిత్తమును శిక్షించుట యీపరిశీలకు ఫల
ములు. వానికి నిత్యావశ్యకములు. మనకుఁ బూర్ణతీవ్రతతో దివ్య
సత్యముయొక్క స్వీకారమును మొదట తెలివియందును తరువాత
యోచనయందును కలిగించుచున్నవి. అవి చివరకొకవిధమైన ప్రాథ
మిక యేకత్వమందంత మొందవచ్చును. కాని యిదియంతయుఁ గొంత
వరకే పనిచేయును. సత్యమును బూర్తిగా స్వీకరించి ప్రతిఫలించుట
కు మన స్థితియొక్క శుద్ధి కొన్ని ప్రత్యేక యోగ విధానములచే
మాత్రమే కలుగుచున్నది. అధోజ్ఞానముయొక్క బహుముఖముల
నున్న నేకాగ్రతకుమారుగా యోగమునకుండు నిశ్చలయేకాగ్రత

రావలెను. అధోజ్ఞానమివ్వగల యస్పష్టమై ఫలశూన్యమైన యేకత్వమునకుమారుగా యోగము తెచ్చునట్టి పరిపూర్ణమై తీవ్రమై ప్రాణయుక్తమైన యేకత్వము రావలెను.

కాని యోగము తనమార్గమందుగాని సంసిద్ధియందుగాని యధోజ్ఞానలోపములఁ ద్రోసివేసి విడనాడదు. ఆయోగము తీవ్రమైన వైరాగ్యముగా వేదాంతముగా మారినప్పుడు మాత్రమే యీప్రపంచదివ్యరహస్యమును నిరాకరించుచున్నది. తన యుద్దేశ్యమున కనుగుణ్యమైన విధానముల విపులత్వ తీవ్రత్వములవలన నధోజ్ఞానరూపములకంటె వేరగుచున్నది. కాని యట్టిజ్ఞానరూపములతో నది ప్రారంభమై మార్గమందు కొంతదూరమువరకు వానిని వెంటనిడుకొని యుపకరణములుగా నుపయోగించుచున్నది. అట్లు నైతిక భావము నైతికధర్మాచరణమెంతయో నెక్కువగా యోగ ప్రారంభమున నుపయోగపడుచున్నది. మరియు యోగవిధానము మానసశాస్త్రసంబంధమైయున్నది. (Psychological). పూర్ణమైన మానసశాస్త్రానుగుణ్యాభ్యాసమేయని యది చెప్పఁబడుచున్నది. దేవుని స్థితి ధర్మములద్వారమున భగవంతుని తెలుసుకొనుటకై దేనివలనఁ బ్రయత్నించుటకుఁ బ్రారంభించుచున్నదో యా యాధారములే వేదాంతశాస్త్రమునకు సామగ్రి. వేదాంతమివ్వఁజాలిన తెలివితోఁ గూడిన ప్రబోధమును యోగము తీవ్రమొందించుచున్నది. అతీవ్రతభావమును దాటించి ప్రత్యక్షమును కలిగించుచున్నది. గ్రహింపును దాటించి యనుభవస్వాధీనముల నిచ్చుచున్నది. దేనిని వేదాంతమనిర్వాచ్యమతిదూరమనుచున్నదో దానిని యోగము వర్ణింపఁదగినదిగా సమీపవర్తిగాఁ జేయుచున్నది. రసగ్రహణరాగమానసము సుందరాకారములు జ్ఞానయోగమందుసహిత మేకాగ్రతను బలపరు

చు సాధనములుగా నుపయోగపడుచున్నవి. అవి శుద్ధిచేయఁబడి భక్త్యానందయోగమునకు సాధనములగుచున్నవి. శుద్ధిచేయఁబడి జీవితకార్యరూపమునఁ గర్మయోగమునకు సాధనములగుచున్నవి. ప్రకృతియందున్న దేవుని ధ్యానము మనుష్యునందు మానుషజీవితమందు భూతభవిష్యద్వర్తమాన ప్రపంచమందున్న దేవుని సేవధ్యానములు సమస్తవస్తువులందుండు యీశ్వరానుభవము పూర్తినొందించుటకు జ్ఞానముచేసహితము నుపయోగింపఁబడవలసిన సామగ్రియైయున్నది. సమస్తమొక ప్రయోజనమునకై వినియోగింపఁబడును. దేవునివైపునకుఁ ద్రిప్పఁబడును. దివ్యభావముతో నిండింపఁబడును. అట్లుచేయుటచే బహిర్గతమై యింద్రియములంజిక్కుకొని వెలివోస్యమందధోజ్ఞానముతోఁ బనికలిగియుండుటకు మాఱుగా నద్వితీయ దివ్యజ్ఞానముతో పనికలిగియుండుట సంభవించుచున్నది. సంసిద్ధిగాంచినతరువాత యాస్వభావమే నిలిచియుండును. యోగి వ్యష్టియందు దేవుని తెలుసుకొని చూచుచుండును. ప్రపంచమందు దేవుని జ్ఞానమునకు దేవుని కార్యమునకుఁ దానొక కాలువవలె నుపయోగపడును. కాబట్టి ప్రపంచజ్ఞానమునకు జీవితముతో సంబంధించిన సమస్తమును విపులత్వమొందించి పైకి లేవనెత్తుటకతనికి వీలుచిక్కును. సమస్తమందతఁడు దేవుని చూచుచున్నాఁడు. ఉత్తమసత్యమును చూచుచున్నాఁడు. అతనుపనిచేయుటకుఁగల యుద్దేశ్యము మనుష్యజాతికి దేవునిజ్ఞానముకలుగుట కుత్తమసత్యస్వ స్వాధీనమొందుటకు సహాయముచేయుటే. అతఁడు భౌతికశాస్త్రసామగ్రి మూలకమున దేవుని జూచుచున్నాఁడు. వేదాంతశాస్త్ర నిరూపణలలో దేవుని జూచుచున్నాఁడు. శృంగారరూపములందును నైతికరూపములందును దేవుని జూచుచున్నాఁడు. సమస్త జీవితకార్యములందు దేవుని జూ

చుచున్నాఁడు. వర్తమాన ప్రపంచధోరణులందు భూతకాల ప్రపంచఫలములందు భవిష్యత్ప్రపంచవృద్ధియందు దేవుని జూచుచున్నాఁడు. వీనిలో దేనిలోనైనను వీనిలో నన్నిటిలోనైనను శుద్ధిఁగాఁబడిన యతనిదృష్టిని విముక్తిగాంచిన యాత్మశక్తిని జొనుపఁగలఁడు. అధోజ్ఞానమే యూర్ధ్వజ్ఞానమునొందుటకతనికి సోపానమైయున్నది. ఊర్ధ్వజ్ఞానమతనికి యధోజ్ఞానమును ప్రకాశయుక్తమౌనట్లొనరించి దానిలో నది భాగమేనను వ్యక్తి కలిగించును. ఎంతహీనమగు వెలిప్రకాశతనైన నక్షత్రకనుపరుచును.






38 అధ్యాయము.

# సమాధి.



వృద్ధి, దివ్యజ్ఞానమందుఁ బ్రవేశించుట, లేక నారోహించుట యనఁబడు జ్ఞానయోగముయొక్క యుద్దేశ్యముతో మిక్కిలి సంబంధించిన ముఖ్యాంశము యోగనిద్ర, సమాధి యనఁబడుచున్నది. సమాధియందుమాత్రమే పొందఁదగినస్థితు లున్నవని తలఁచఁబడుచున్నవి. ఏస్థితియందు సమస్తవ్యక్తికార్యము నశించునో చలనరహిత కాలాతీతానంతమందు స్వచ్ఛమైన నిమజ్జనముతప్ప మరి వేఱుజ్ఞానములేదో యట్టిస్థితి ముఖ్యముగాఁ గోరఁదగినదే. ఇట్టి నిద్రనుపొందిన జీవుఁడు మహోన్నతనిర్వాణ నిశ్శబ్దమునకుఁ జేరుచున్నాఁడు. అసత్యము హీనమైనస్థితిలోనికిఁ దిరిగిరాఁడు. భక్తియోగమునకు సమాధి యంతగా ముఖ్యమైనదికాదు. కాని యచ్చటసహితము దానికి స్థానమున్నది. దివ్యప్రేమావేశమట్టి మూర్ఛయందుఁ బ్రవేశపెట్టుచున్నది. దానియందుఁ బ్రవేశించుటే హఠరాజయోగాభ్యాసముల నుచ్చనకు తుదిమెట్టు. అయితే సమాధియన నెట్టిది? సమాధినిద్రవలనఁ బరిపూర్ణయోగమున కేమిప్రయోజనము? జీవితమందే యీశ్వ

రుని పొందుట మన యుద్దేశ్యమైనయెడల ప్రాణము నిలిచిపోవుట యనుస్థితి తుదిమెట్టుకానేరదు. కోరఁదగినయుత్తమస్థితికాదు. బహుయోగవిధానములందువలె యోగనిద్ర పొందఁదగిన చివరవిషయము కాదు. కాని సాధనమగును. జాగ్రత్తునుండి తప్పించుకొనుటకు సాధనము మాత్రమేగాక వృష్టిని జీవితమును వ్యక్తిని లేవనెత్తి విపులముచేయుటకు సాధనమాచున్నది.

ఆధునికజ్ఞానమిప్పుడు మరల కనిపెట్టుచున్నట్టియు హిందూ మానసశాస్త్రమున కెల్లప్పుడు గోచరించునట్టియుఁ బ్రపంచస్థితియొక్కగాని మనస్థితియొక్కగాని కొంతభాగముమట్టుకే మనవ్యక్తికి గోచరమాచున్నదను నంశముపై సమాధికిఁగల యాధిక్యత యాధారపడియున్నది. తక్కినది యంతరస్థితియందు లోన దాగియున్నది. అది యంతర్వ్యక్తి (Subliminal) యొక్క యగాధములోనికి దిగుచున్నది. మహోన్నత యూర్ధ్వవ్య (Super-conscience). నధిరోహించుచున్నది. మన స్వల్పజాగ్రద్వ్యక్తిని యావరించుకొని చుట్టూయున్న సర్వవ్యాపకవ్యక్తి యదియే (Circum conscient) దీనిచిహ్నముల కొన్నిటినే మన మానసేంద్రియములు గాంచుచున్నవి. పురాతన హిందూ మానసశాస్త్రము దీనిని వెల్లడించుచు వ్యక్తిని మూఁడుభాగములుగా విభజించినది. జాగ్రత్స్వప్న సుషుప్తులని వానికిఁ బేర్లు. మనుజునందు జాగ్రత్పురుషుఁడు స్వప్న పురుషుఁడు సుషుప్తిపురుషుఁడు గలరనియుఁ బైన నాలుగవస్థితియైన తుర్యము (యుత్తమపురుషుఁడు) కలదనియుఁ బ్రపంచానుభవముకొఱకా నాలుగవదానినుండి యీమూఁడేర్పడినవనియు హిందూ మానసశాస్త్రాభిప్రాయము.

ప్రాచీనగ్రంథములలోని శబ్దములఁ బరీక్షించితిమా జాగ్రదావస్థయనఁగా స్థూల మానసాధికారమునకు లోనై యీదేహమందు మనకు సాధారణముగాఁగల స్థూలప్రపంచజ్ఞానమే. స్వప్నావస్థయనఁగా లోనున్న ప్రాణ మానసలోకములకుఁ బోలియున్న జ్ఞానమే. మనకు వాని సమాచారములు వచ్చుచున్నను స్థూలవిషయములవలె ప్రత్యక్షప్రమాణములు కావు. సుషుప్త్యవస్థయనఁగా విజ్ఞానమునకు లక్షణమైన యూర్ధ్వ మానసలోకమునకు సరిపోలిన జ్ఞానమే. అది మన యనుభవమందు లేదు. కారణమేమనఁగాఁ గారణశరీరమింక మనలో నేర్పడియుండలేదు. దానిశక్తులు పనిచేయుట లేదు. కాబట్టి మనకాలోకము స్వప్నరాహిత్యమైన నిద్రను పోలియున్నది. పైనున్న తుర్యమనఁగా స్వచ్ఛమైన యాత్మస్థితియొక్క జ్ఞానమే. పరిపూర్ణస్థితియొక్క జ్ఞానమే. దానితో మనకుఁ బ్రత్యక్ష సంబంధములేదు. మన జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థయందెట్టి మానస యోచనలు మనకు వచ్చినా తుర్యము మనకు ప్రత్యక్షమునలేదు. ఈచతుర్విధానము పరిపూర్ణేశ్వరుని నారోహించుటకు నేర్పడిన నిచ్చెనలోని మెట్లకు సరిపోలియున్నవి. సాధారణముగా జాగ్రదవస్థనుండి వెనుకకుతగ్గక ప్రపంచమునువిడిచి వెనుకకుఁబోఁగలక మనము స్థూలమానసమునుండి యూర్ధ్వలోకములకేగఁజాలము. కాబట్టి యీయుత్తమస్థిత్యనుభవము కోరువారికి సమాధి పథ్యమైనది. స్థూలమానస సంబంధములోనుండి తప్పుకొనుటకుసాధనమగుచున్నది.

సమాధి లేక యోగనిద్ర జాగ్రత్తునుండి దూరమైనకొలది జాగ్రన్మానసమునకు రాకపోకలులేని జ్ఞానస్థితులలోఁ బ్రవేశించినకొలది జాగ్రత్ప్రపంచమునుండి సమాచారములందుట తగ్గినకొలది మిక్కిలి గాఢమగుచున్నది. ఒకానొకస్థితి దాటినతరువాత నానిద్ర

పరిపూర్తి నొందుచున్నది. అప్పుడానిద్రను మేలుకొలుపుట సాధ్యముకాదు. అప్పుడు జీవుని క్రిందికిఁ బిలుచుటకు వీలులేదు. తనచిత్తానుసారమది తనంతటఁదా రావలసినదే. లేక బలవత్తరమైన స్థూలప్రేరేపణచే రావచ్చునుగాని యట్టి యకాలయాగస్మిక పునరావృత్తివలనశరీరమునకపాయము రాఁగలదు. కాని యుత్తమసమాధిస్థితులు కలవనియు వానియందు చాలాకాలము జీవుడుంటచేఁ దిరిగిరాఁజాలఁడనియుఁ జెప్పఁబడుచున్నది. కారణమేమనగా జీవితమును వ్యక్తితో బంధింపఁబడియున్న సూత్రవశీకరణము దానికితప్పుచున్నది. శరీరము విడువఁబడుచున్నది. దేహము మొదటయుంచిన స్థితిలోనే నిలిచియుండును. చావదుకాని దానియందిదివరకు నివసించియున్న ప్రాణమును తిరిగి పొందఁజాలదు. తుదకు యోగివృద్ధియొక్క యొకానొకస్థితిలో మరణములేక నేతనయిష్టానుసారముగా శరీరమును విడుచుటకు (ఇచ్ఛామృత్యువు) శక్తికలవాఁడగును. ఊర్ధ్వ ప్రాణ ప్రవాహ మార్గమున ననగా (ఉదాన) మార్గమున శిరముననున్న బ్రహ్మరంధ్రమును దెరిచి దేహమును విడువఁగలఁడు. సమాధియందుఁ బ్రాణము విడుచుటవలన వాఁడు కాంక్షించుచున్న యుత్తమస్థితిని సరాసరి పొందఁగలఁడు.

స్వప్నావస్థయందే యనంత నిశ్చల సోపానపంక్తికలదు. తీవ్రతలేని స్వప్నావస్థయందు పునరావృత్తి బహుసులభమై యుండు. ను. తత్కాలమునకు మూయఁబడియున్నను స్థూలప్రపంచ మింద్రియద్వారములయొద్దనే యుండును. స్వప్నావస్థ గాఢమైనకొలది బహిప్రపంచము దూరమై యేకాగ్రతను భేదింపఁజాలదు. మానసమప్పుడు నిశ్చలసమాధి నొందినది. సమాధికిని సాధారణనిద్రకును సంపూర్ణమైనభేదమున్నది. యోగముయొక్క స్వప్నావస్థకును స్థూ

లముయొక్క స్వప్నావస్థకును విశేషభేదము కలదు. స్థూలస్వప్నము స్థూలమానసమునకు సంబధించినది. యోగస్వప్నావస్థయందు సరియైన సూక్ష్మమానసము స్థూలమానస సంపర్కమెంతమాత్రమును లేకఁ బనిచేయుచున్నది. స్థూలమానసస్వప్నము లసందర్భవుల కలగలుపు. దేనిచుట్టు నధోమానసశక్తులు బుద్ధియనఁబడు చిత్తవివేచనలకు వెలియై చలనవికారమల్లుచున్నవో యట్టి స్థూలప్రపంచమునుండివచ్చు నస్పష్టవిషయములకుఁ బ్రతిభాషణములతో నాకలగంబపు గొంతమట్టు కేర్పడినదే. వికారమొందిన మెదడుకుసంబంధించిన జ్ఞాపకముల కలగలుపుచే గొంతమట్టు కేర్పడుచున్నది. మానసలోకమందుఁ బ్రయాణముచేయుచున్న జీవుని యాలోచనచే కొంతమట్టు కేర్పడుచున్నది. సాధారణముగా నీయోచనలు సందర్భము వ్యక్తి లేనివై స్వీకరింపఁబడుచున్నవి. స్వీకరించుటలో విశేషముగా వికారమొందినవి. ఇతరస్వప్నవిషయములతో సమ్మేళనమొందినవి. మెదడుయొక్క జ్ఞాపకములతోను స్థూలప్రపంచమునుండి రాఁబడు నింద్రియవిషయముల వికారమొందిన ప్రత్యుత్తరములతోను నిండియున్నవి. యోగస్వప్నావస్థయందైతే మానసము నిర్మలమై స్వాధీనము కలిగియున్నది. స్థూలప్రపంచవిషయము కాకపోయినను సందర్భముతోఁ బనిచేయుచున్నది. ఏకాగ్రతనొందించి శక్తియుతముగఁ జేసి తనకు సాధారణముగానున్న చిత్తవృత్తులతోనైనను పైకి మిక్కిలి లేవనెత్తఁబడి మనోలోకములకు సంబంధించిన చిత్తవృత్తులతోనైనను బనిచేయఁగలిగియుండును. అది బహిఃప్రపంచానుభవమునుండి తొలగుచున్నది. స్థూలేంద్రియములఁ గదలనివ్వదు. జడపదార్థములతో నుత్తరప్రత్యుత్తరముగల యాస్థూలేంద్రియద్వారముల మూయుచున్నది. తనకు స్వతసిద్ధమైన భావన, వివేచన, యాలో

చన దృష్టి మొదలైనవానిని జాగ్రద్ధ్యానసముయొక్క చంచలకల్లో లములులేని యేకాగ్రతచే జనించి వృద్ధిజెందిన శక్తి పవిత్రతలతోఁ బనిచేయించును. అది తనచిత్తమును నుపయోగించి తనలోనైన నావరణమందైన మానసఫలముల నీతిఫలములఁ గలిగించఁగలదు. ఆఫలములు సమాధి చాలించినతరువాత జాగ్రదవస్థయందు నిలిచియుండి ప్రతిఫలములివ్వఁగలవు.

(1) స్వప్నావస్థయందు శక్తులఁ బూర్తిగాఁ బొందవలెనన్న మొదటియవసరమేదనగా స్థూలేంద్రియములపై దృష్టి శబ్దము మొదలైనవాని దాడినాపుటే. సూక్ష్మదేహమునందు సూక్ష్మేంద్రియములమూలకమున స్వప్ననిద్రయందు బహిఃప్రపంచమును దెలుసుకొనుటకుఁ బూర్తిగా సాధ్యముకలదు. మన కిష్టమున్నంతవరకు వానిని మనము తెలుసుకొనవచ్చును. జాగ్రత్తునందుకన్న మిక్కిలి విపులముగాఁ దెలుసుకొనవచ్చును. సూక్ష్మేంద్రియముల ప్రభావము స్థూలావయవములకంటె మిక్కిలి గొప్పది. ఇంతయని చెప్పుటకు వీలులేనంత విపులప్రభావముకలవిగాఁ జేయవచ్చును. సూక్ష్మేంద్రియములవలనఁ గలిగెడు బహిఃప్రపంచవ్యక్తికంటె కేవలము వేరైనది. సాధారణమైనవ్యక్తికిని నిశ్చలసమాధికిని పోలికలేనేలేదు. ఏలనన స్థూలేంద్రియములయొత్తిడి సమాధినిభేదించి మనసును క్రిందికి దింపి తమకు స్వాధీనయధికారములుకల సాధారణస్థితిలోనికి మార్చుచున్నవి. కాని సూక్ష్మేంద్రియములు తమలోకమందును స్థూలావణమందును స్వాధీనయధికారము కలిగియున్నవి. స్థూలప్రపంచము వానికిదూరమేకాని యని దానియందుసహితము పనిచేయఁగలవు. యోగమందు స్థూలేంద్రియకవాటముల మూయుటకు వివిధోపాయము లుపయోగింపఁబడుచున్నవి. అందుకొన్ని కేవల

స్థూలప్రక్రియలు. అన్నిటికంటె మిక్కిలి తృప్తికరమైనది యేకాగ్రతవలనకలిగెడి శక్తి. దానివలన మనస్సులోనికిదిగి యంతర్గతమై వెలిపిలుపులకుఁ గడుదూరవమౌను. (2) రెండవ యవసరమేమనఁగా స్థూలనిద్రను ప్రవేశింపనివ్వరాదు. మనస్సునకు సాధారణమైన యలవాటేదియనగా నంతర్గతమై స్థూలవిషయములతో సంబంధము విడిచినప్పుడు నిద్రయందు స్వప్నములయందుఁబడుట దానికి స్వభావము. కాబట్టి సమాధినిష్ఠకొఱకది యాంతర్గత్యమొందింపఁబడినపుడు మొట్టమొదట దానికున్న యలవాటుచొప్పున కోరఁబడినవిరాక సాధారణముగావచ్చునట్టి స్థూలసుషుప్తి సంభవించును. మనస్సునకుండు యీయలవాటును దీసి పారవేయవలెను. స్వప్నావస్థయందు మానసము మేలుకొనియుండుట నేర్చుకొనవలెను. ఈస్వాధీనముతప్పియుండరాదు. బహిర్గతమౌచున్న వ్యక్తితోఁగాక యంతఃస్వీకారమొందింపఁబడిన వ్యక్తితో మేలుకొనియుండవలెను. అట్టి యంతర్గతమై రాశీభూతమైన వ్యక్తియందుఁ బూర్తిగా నిమగ్నమొందియున్నదది తన సమస్త శక్తులతోఁ బనిచేయఁగలదు.

స్వప్నావస్థయందుఁ గలిగెడి యనుభవములు పలువిధములైయున్నవి. సాధారణ మనోవ్యక్తులనఁబడు విచక్షణ విమర్శన యిచ్ఛ యూహ మొదలైనవాని పూర్ణస్వాధీనముకలిగి వానిని తనకిష్టము. వచ్చినరీతిని యేవిషయమునకైన యేపనికైన నుపయోగించుటేగాక స్థూలము మొదలు శ్రేష్ఠమైన మానసలోకములవరకుఁ దాను బ్రవేశించదలచిన లోకముతో సంబంధము స్థిరపరచఁగలదు. బహిర్గతమౌచున్న స్థూలేంద్రియముల స్వల్పహద్దులనుండి విముక్తిగాంచిన యంతర్గత మానసమునకు గల సూక్ష్మత్వము, మార్దవము బహుళత్వముల వివిధసాధనములచే నిట్లుచేయుచున్నది. స్థూలప్రి

పంచమునందుఁగాని యితరలోకములందుఁగాని సమస్తవస్తువుల నది మొదట కనుపించురూపముల (విగ్రహముల) సహాయమున తెలుసుకొనుచున్నది. సమాధియందు మానసము చిదాకాశమనఁబడు యంతర్ప్రదేశమునకుఁ జేరగలదు జడప్రపంచముయొక్క ఘనీభవించిన యాకాశమువలన నీసూక్ష్మాకాశ మావరింపఁబడుటచే స్థూలేంద్రియములకు గోచరించుటలేదు. భూలోకమందుగాని యితరలోకములందుగాని గోచరించు సమస్తవస్తువులు వాని ప్రతివచనముల ప్రతిరూపముల ప్రతిధ్వనుల నీసూక్ష్మాకాశమందు నిర్మించుచున్నవి. వాని నీచిదాకాశము స్వీకరించి దాచుచున్నది.

దూరశ్రవణ దూరదర్శనమను విద్యలకిదే కారణము. జాగ్రన్మానసము సూక్ష్మాకాశరూపస్మృతి యనఁబడు స్వల్పజ్ఞానములోనికిఁబ్రవేశముగాంచుటే యీవిద్యలకు మూలము. దానివలన వర్తమానభూతవిషయములు తెలియుటేగాక భవిష్యద్విషయ పరిజ్ఞానము సహితము కలుగుచున్నది. కారణమేమనగా భవిష్యద్విషయములిదివరకే యుత్తమ మానసలోకములందు జ్ఞానదృష్టికి సంభవించేయున్నవి. కాబట్టి వాని రూపములు వర్తమానము మానసమందుఁ బ్రతిఫలింపకమానవు. కాని జాగ్రత్తునందసాధారణమైనట్టియుఁ గష్టసాధ్యమైన ప్రత్యేకమహాత్మ్యమువల్ల బ్రత్యేకశిక్షవల్లను గ్రహింపఁదగిన యీవిషయములు స్వప్నావస్థవ్యక్తికి స్వభావసిద్ధమైయున్నవి. అట్టి స్వప్నావస్థయందర్గతమానసము స్వాతంత్ర్యము గాంచినదగుటచే నీవిషయములు దానికి స్వతసిద్ధమైయుండును. అట్టి మానసమీరూపవ్యక్తిచేతనేగాక ప్రస్తుత మానసశాస్త్రములు టెలిపతి (Telepathy) యని పేరుపెట్టబడిన వ్యక్తివిశేషమునకు సరియైన భావజ్ఞానములేక భావస్వీకారముచే సహితము వివిధలోకవస్తు పరి

జ్ఞానమొందఁబడుచున్నది. కాని స్వప్నమానసముయొక్క శక్తులింత టితో సమాప్తమొందలేదు. అది సూక్ష్మదేహమందు తనకుఁదాఁ బ్రవేశించి యితరలోకములందు లేక యీలోకమందే దూరదేశము లకువెళ్లి యాప్రదేశమందు స్థూలరూపముతో సంచరించి యచ్చట జరుగుచున్నవిషయముల ప్రత్యక్షానుభవమును తేఁగలదు. లేక సూక్ష్మదేహమును స్వీకరించి దానితోఁ బ్రయాణముచేసి స్థూలదే హమును దావచ్చువరకు శవాకారముగా విడిచిపెట్టి యితరలోక సంచారము చేయఁగలదు.

సమాధియొక్క స్వప్నావస్థకుఁగల గొప్పప్రాముఖ్యత యీ బహిర్విషయముల నొందుటకాదు. దేనివలన జీవుఁడు విపులత్వా న్నత్యాత్మాధికారముల వృద్ధినొందునో యట్టి భావచిత్తహృదయ శక్తులఁ బొందించుట. ముఖ్యముగా దీనివలన నింద్రియవికారముల నుండి వైతొలగి యేకాగ్రతనొందిన యాత్మైకాంత పరిపూర్ణశక్తి యందు జీవుఁడు స్వేచ్ఛతగల వివేక భావ విచక్షణలచే మానసదృ ష్టి యైక్యతలచే నుత్తమాత్మ నతీతసత్యము నీశ్వరుని మహాత్ముసందే గాక కేవలశుద్ధస్థితియందు సహితము పొందుటకు సంసిద్ధుఁడగుచు న్నాఁడు. లేక సంతోషానురాగములలో నిమగ్నుఁడై పరిపూర్ణ యేకాంతమందు సమస్తానందాధికారియైన తనప్రియునితో నైక్య మొంది యానందించుటకు సంసిద్ధుడుకాఁగలఁడు.

పరిపూర్ణయోగమునకే సమాధివిధాన మొకలోపము కలిగిం చునదిగాఁ గనుపించును. సమాధినిష్ఠ చాలించినతోడనే సంబంధము తెగును. జీవుఁడు వెలిజీవితముయొక్క బహుళత్వములోనికి యసం పూర్ణత్వములోనికి దిగిపోవును. ఆగాఢానుభవస్మృతిచే బహిర్జీవిత

మెంతవరకు లేవనెత్తఁగలదో యదితప్ప మరివేరుకనుపించదు. కాని యీబంధవిచ్ఛేదనమీ గొప్ప యంతరాయమనుతప్పనిది దాట వీలు లేనిదికాదు. మొదట యభ్యాసము పూర్తిగాలేక సమాధియందుఁ దోచినయనుభవము జాగ్రత్తునందు వ్యక్తముకాదు. కాని సమాధి వశమైనకొలది లోవెలిజ్ఞానమునకుఁగల యంతరము పోవుచున్నది. తరువాత నంతస్సంస్థి బహిర్వ్యక్తికి సాధ్యమై సాధారణానుభవమై జాగ్రత్తునకు సర్వసాధారణమైన మహత్తుగామారును. సాధారణ ముగా స్థూలముచేఁగప్పఁబడిన సూక్ష్మమానసము జాగ్రత్తునందు సహితము సామర్థ్యమొందుచున్నది. విపులతఁగాంచుచున్న మాన వుఁడు స్థూల సూక్ష్మదేహములందు నివసించఁగలఁడు. సూక్ష్మ మానసవ్యక్తికలిగి దాని నుపయోగించఁగలఁడు. సూక్ష్మేంద్రియ ముల సూక్ష్మశక్తుల సూక్ష్మసామర్థ్యములఁగలిగి స్థూలమునకుపరి నున్న సత్యజ్ఞానానుభవస్వాధీన మొందుచున్నాఁడు.

సుషుప్త్యావస్థ యుత్తమమహత్తులోనికి భావాతీతమైన శుద్ధ జ్ఞానములోనికి రాగాతీతమైన శుద్ధానందములోనికి చిత్తాతీతమైన శుద్ధాధికారములోని కెక్కుచున్నది. ప్రపంచవృత్తులు దేనినుండి యావిర్భవించుచున్నవో యట్టి సచ్చిదానంద యుత్తమస్థితితోఁ గ లుపుటకు సుషుప్త్యావస్థద్వారము. కాని శబ్దాలంకారములవల్లఁబుట్టు చిక్కులఁ దప్పించుకొనుటకు జాగ్రత్తపడవలెను. ఈయుత్తమస్థితు లకు స్వప్నమని సుషుప్తియని వాడుట సాధారణస్థూలమానసమున కలవాటుకాని యుత్తమలోకానుభవ విషయములఁదెలుపు మాట లే కాని వేరు కాదు. తృతీయావస్థయైన సుషుప్తియందాత్మయ వ్యక్తస్థితిలోనుండుననుట సత్యముకాదు. కాని సుషుప్త్యాత్మను ప్ర జ్ఞయని వాడుచున్నారు. ప్రజ్ఞయనగా వివేకజ్ఞానముల కధికారి,

విజ్ఞానాత్మ, యీశ్వరుఁడు, స్థితిప్రభువు. స్థూలమానసమునకది నిద్ర. విపుల సూక్ష్మజ్ఞానమునకది విశేషజాగరణము. సాధారణ మానసానుభవమున కతీతమైనప్పటికి యట్టి మానసహద్దులోనికి రాఁగల సర్వము స్వప్నముగాఁ దోఁచును. కాని దానిహద్దుకుమించిన స్థితి యందేని స్వప్నములోఁ జూచినరీతినైన సత్యమునుజూడలేక తెలివిలేని స్వీకరించలేని యవ్యక్తములోఁ బ్రవేశించును. ఈహద్దు వ్యష్టి మానసమునకుఁగల శక్తి వృద్ధి మెళుకువననుసరించి మారుచుండును. మానసమునుసహితము దాటునంతవరకీ హద్దును పైకి పైకి నెట్టవచ్చును. ఊర్ధ్వ మానసస్థితులలో సమాధిజనిత యంతరనిర్నిద్రిత్వమున్నను సాధారణమానసము మెళుకువతో నుండఁజాలదు. కాని యీలోపమును దీర్చుకొనవచ్చును. ఈస్థితులలో జీవుఁడు మేలుకొని యుండి విజ్ఞానభావము విజ్ఞానచిత్తము విజ్ఞానానందముల యందధికారమొందును. సమాధిలో నతఁడు దీనిని పొందఁగలిగినయెడల నట్టి యనుభవస్మృతిశక్తుల జాగ్రత్తలోనికి తేఁగలఁడు. అంతకు పైస్థితియైన యానందావస్థయందు మేలుకొనియున్న జీవుఁడట్లే యే జాగ్రత్తయందుఁ బ్రపంచవ్యక్తియందుసహితా మానందాత్మయొక్క స్వాధీనముకలవాఁడగుచున్నాఁడు. కాని యాపైన కొన్నిస్థితులుండ వచ్చును. అట్టిస్థితులనుండి యిట్టిదనరాని సర్వాతీతమైన "యేదో తెలియఁబడని యానందమందుంటినని స్థిత్యానందమందుంటినని" చెప్పుటతప్ప మరివేరుస్మృతి తేఁజాలఁడు. అనుభవమందు స్థితితో పాటు వ్యక్తి నశించుటచే స్థితిజ్ఞానముకూడ లేకపోవచ్చును. అప్పుడు బౌద్ధులనిర్వాణముమాత్రమే న్యాయమైనది ముఖ్యముగా న్యాయమైనదియై కానుపించును. జాగరణశక్తి యెంతవృద్ధిగాంచిన నింక పైస్థితికలదని తోఁచుటచే నట్టిపైస్థితిలో సుషుప్తికి స్థానమున్నదని కనుపించును.

యోగసమాధి తత్త్వమిట్టిది. దాని వివిధరూపముల నిచ్చట మనము చర్చించనవసరములేదు. పరిపూర్ణయోగమునకు దానివలన గల్గు ద్వివిధప్రయోజనము దెలిపినఁజాలును. ఒకానొక హద్దువరకు సమాధియివ్వఁగల సమస్తము సమాధిలేకనే పొందవచ్చుననుట సత్యము. కాని యధ్యాత్మికానుభవమున కుత్తమస్థితులుకలవు. ప్రతిఫలించు రూపమునగాక వాని ప్రత్యక్షానుభవము సమాధిమూలముననే పూర్తిగానొందుటకు సాధ్యమౌను. మరియొకవిధముగాఁ బొందఁబడుదానికి సహితము సమాధి సిద్ధముగానున్న సాధనముల నిచ్చి యెక్కువ సహకారికాఁగల సామర్థ్యమును కలిగించును. ఉత్తమస్థితి నొకపర్యాయముపొందిన తదనుభవము జాగ్రత్తులోనికి సాధ్యమైనంతమట్టుకుఁ దేవచ్చును. సమస్తజీవితమును బరిగ్రహించునట్టి యోగమునకు సమాధివల్లకలుగు ప్రయోజము సమాధిజనితానుభవముల మనుష్యరూపముననున్న జీవుఁడు పూర్ణముగా మేలుకొనుటకతని స్వాధీనానుభవములోనికిఁ దెచ్చుటే.

సంపూర్ణము.

